


# నా పెళ్ళి. నా కోరిక.

## నా పెళ్ళికి నేనే డ్రైవ్ చేసా.

మీ కోసం, మా సొంత తయారీ కేంద్రాలలో రూపొందించబడిన అధునాతన డిజైన్లు.

**KHAZANA JEWELLERY**

Across India & Middle East

హైదరాబాద్ - అబిడ్స్ రోడ్ | సోమాజిగూడ | కూకట్‌పల్లి | A.S. రావు నగర్ | దిల్‌సుఖ్‌నగర్ | చందానగర్ • కరీంనగర్ • వైజాగ్ - ద్వారకా నగర్ 1 | ద్వారకా నగర్ 2 | గాజువాక • విజయవాడ • గుంటూరు
కాకినాడ • రాజమండ్రి • భీమవరం • తిరుపతి • నెల్లూరు • వరంగల్ • శ్రీకాకుళం • ఒంగోలు • ఖమ్మం • అనంతపురం • విజయనగరం • కడప • చెన్నై - టీ. నగర్ | కథెడ్రల్ రోడ్ | అన్నానగర్ | పురసైవాక్కం | వేలచేరి
కోయంబత్తూరు • సేలం • వెల్లూర్ • కాంచీపురం • పుదుచ్చేరి • తిరునెల్వేలి • తిరుచి • మదురై • తూత్తుక్కుడి • నాగర్‌కోయిల్ • బెంగళూరు - డికెన్సన్ రోడ్ | జయనగర్ | మారతహళ్ళి | కోరమంగళ | మల్లేశ్వరం
మంగళూరు • బళ్ళారి • ఢిల్లీ - ప్రీత్ విహార్ • గుర్గావ్ • నోయిడా • దుబాయ్ - కరామా సెంటర్ | మీనా బజార్ | గోల్డ్ సూక్ | షార్జా | త్వరలో అబుదాబిలో ప్రారంభోత్సవం. (అన్ని రోజులు షాపు తెరచి ఉండును)
www.khazanajewellery.com

## సరదాగా....

**గంట**

అత్తగారు గుడికెళ్ళడంతో కొత్త కోడలు మొదటి సారి వంటగదిలోకి అడుగుపెట్టింది. ఆమెకి వంట చేయటం రాదు. కానీ అత్తగారు గుడినుంచి వచ్చే లోగా వంట చేయాలి? ఎలాగా? చివరికి వంటల పుస్తకం చేతబట్టింది. రెసిపీలు సెలెక్ట్ చేసుకుని, కావాల్సిన పదార్థాలన్నీ దగ్గర పెట్టుకొని, తయారీ విధానం చదువుతూ, మొత్తానికి వంట పూర్తయిందనిపించింది. వండిన పదార్థాలన్నీ నీట్‌గా డైనింగ్ టేబుల్‌పై అమర్చింది.

గుడికెళ్ళిన అత్తగారు రానే వచ్చారు. "అత్తయ్యా... నేనివాళ వంటచేశాను" అని ఎంతో ఎగ్జైటింగ్‌గా చెప్పబోయిన కోడల్ని కాస్త ఆగమని, మంచినీళ్ళ కోసం ఫ్రిజ్ తెరచిచూసి అవాక్కైంది అత్త.

"పూజ గది నుండి ఈ గంట ఫ్రిజ్‌లో కెట్లా వచ్చిందే?..." కోడల్ని అడిగింది.

"ఏం లేదత్తయ్యా! బొబ్బట్లు చేద్దామని పిండి కలిపాను. పిండి కలిపిన తరువాత ఒక గంట ఫ్రిజ్‌లో పెట్టాలని పుస్తకంలో ఉందత్తయ్యా" అని బదులిచ్చింది కోడలు.

**ఒక ప్రశ్న?**

హవీష్ బ్యాంక్ పరీక్షలకి ప్రిపేర్ అవుతున్నాడు. బేసిక్ ఇంగ్లీష్‌పై పట్టుంది. జనరల్ నాలెడ్జ్‌లో పరవా లేదు. కరెంట్ ఎఫైర్స్ గురించి ఆలోచించాల్సిన అవసరమేలేదు. ఎందుకంటే రోజూ పేపర్లు, న్యూస్ ఛానల్స్‌ను వదపోయందే నిద్రపోడు కదామరి! ఇక హవీష్‌కి ఒంటబట్టనిది ఏంటంటే అనలిటికల్, లాజికల్ రీజనింగు, డేటా ఇంటర్‌ప్రిటేషనూ... వాటి పేరెత్తితేనే చిరాకొస్తుంది హవీష్‌కి. ఏడుపు ముంచుకొచ్చేస్తుంది. కానీ ఎలాగైనా సరే బ్యాంక్ ఉద్యోగం పట్టాల్సిందే! మార్కెట్‌లో దొరికే రీజనింగు పుస్తకాలన్నీ ముందేసుకుని కూర్చుంటున్నాడు. టైంటేబుల్ వేసుకొని దాని ప్రకారం రోజుకో టాపిక్ చొప్పున ప్రాక్టీస్ చేస్తున్నాడు. ఆ రోజు 'సరాసరి' టాపిక్ తీసుకుని ప్రాక్టీస్ చేస్తున్నాడు. ఒక ప్రాబ్లమ్ దగ్గరకొచ్చేసరికి అతడికి ఏమీ అర్థం కాలేదు. కాసేపు ఆలోచించినా బుర్రకెక్కలేదు. పక్కింట్లో ఉండే ధరణి దగ్గరకు వెళ్ళి వివరించి చెప్పమని అడిగాడు. ధరణి మ్యాథ్స్ లెక్చరర్. ఆ ప్రాబ్లమ్ చూసి, దాన్ని ఎలా సాల్వ్ చేయాలో అతడికి వివరించి చెప్పింది. ఇంతకీ ప్రాబ్లమ్ ఏంటంటే, "రోహిణి కరెంటు బిల్లు కట్టడానికి క్యూలో నిల్చొని ఉంది. ముందునుంచి చూసినా, వెనుక నుంచి చూసినా ఆమె క్యూలో నిల్చొన్న స్థానం 21. ఆమె ముందు ఎంత మంది నిల్చున్నారు? వెనుక ఎంతమంది ఉన్నారు? అసలు మొత్తం క్యూలో నిల్చున్నవారి సంఖ్య ఎంత?" ఈ సమస్యకి సమాధానం ఎలా కనుక్కోవాలో హవీష్‌కి అర్థమైంది. సమాధానం కూడా వచ్చింది. మరి మీరూ ప్రయత్నించండి.

**సమాధానం**

రోహిణి క్యూలో నిల్చున్న స్థానం ముందునుంచి చూస్తే 21. అంటే ఆమె ముందు 20 మంది ఉన్నారనుకోవాలి. వెనుకనుంచి చూసినా ఆమె స్థానం 21 కాబట్టి వెనుక కూడా ఇరవైమందే! అంటే క్యూలో మొత్తం నిల్చున్నవారి సంఖ్య 20+20+1 = 41 అన్నమాట.

# తీన్ మార్

















## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: శ్రుతిహాసన్
ఫొటో: గోపీకృష్ణ

**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**

**నవ్య వీక్లీ,** ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com

## మార్నింగ్ కాఫీ



### నేలచూపులు

హఠాత్తుగా శారదకు మెలకువ వచ్చింది. లేచి చూస్తే, భర్త మంచమ్మీద కూర్చుని బాధగా నేలచూపులు చూస్తున్నాడు. టైమేమో తెల్లారు జాము మూడుగంటలైంది.

"ఏంటింకా మీరు నిద్రపోలేదా?" ఆశ్చర్య పోయి అడిగింది భర్తని.

"లేదు! గతనెల ఎదురింటి రామారావు దగ్గర పదివేలు తీసుకున్నాం కదా! ఆ డబ్బు రేపిస్తానన్నాను. అయితే డబ్బు చేతికందలేదు. రేపు ఎలా ఇవ్వాలో తెలియడం లేదు. దాంతో..." అన్నాడు భర్త. అంతే! విసురుగా తలుపులు తెరచి, ఎదురింటి తలుపులు తట్టింది శారద. 'రామారావుగారూ! రామారావుగారూ' అని కేకేసింది. నాలుగైదుసార్లు తలుపులు తట్టి, పది పన్నెండుసార్లు పిలిస్తేనేగాని తలుపులు తెరవ లేదు రామారావు. అఖరికి తెరిచాడు. విసుక్కుంటూ అడిగాడిలా.

"ఏంటమ్మా! ఏఁవైంది? తెల్లారుజాము మూడు గంటలప్పుడు ఏఁవిటీ గావుకేకలు?"

"రేపు మావారు మీకు ఇస్తానన్న పదివేలూ ఇవ్వడం లేదు. ఆయన దగ్గర డబ్బుల్లేవు. అదీ సంగతి." అని చెప్పి, వెనక్కి తిరిగింది శారద. ఇంట్లోకి వచ్చి, తలుపులు వేసింది. విస్తుపోయి చూస్తున్న భర్తతో అన్నదిలా.

"మీరిప్పుడు హాయిగా పడుకోండి!

రామారావు మీ పని చేస్తాడు. నేలచూపులు చూస్తూ కూర్చుంటాడు."

### భార్యాభర్తలు

భార్యాభర్తలు కిడ్నీ లివర్‌లాంటివాళ్ళు. భర్త లివర్ అయితే భార్య కిడ్నీ. లివర్ పాడైంది అనుకోండి. కిడ్నీ కూడా పాడైపోతుంది. అదే కిడ్నీ పాడైందనుకోండి, లివర్ ఇంకో కిడ్నీతో మేనేజ్ చేసుకుంటుంది.

### చికిత్స

తల చిట్లింది. ధారాపాతంగా రక్తం కారుతోంది. కుట్లు వేస్తోంది నర్స్. పేషెంట్‌ను అడిగిందిలా.

"మీ పేరు"
"సుబ్బారావు"
"ఎప్పుడు పుట్టారు?"
"21 ఫిబ్రవరి"
"పెళ్ళయ్యిందా?"
"లేదండి! యాక్సిడెంటయ్యింది."

**-వైనతేయ**

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 13 సంచిక: 36
9-11-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

## పునీతుడు

శీతకాలం. కార్తీకమాసం. తొలి సోమవారం. తెల్లారిందో లేదో శివాలయంలో హడావుడి ప్రారంభమైంది. సన్నని గొంతుతో లింగాష్టకం వినవచ్చింది. ఓం నమశ్శివాయ! హరోంహర! శివశివా అని భక్తుల వేడుకోళ్ళు వినరాసాగాయి. నాయుడుకి మెలకువ వచ్చింది. తల మీద నుంచి కప్పుకున్న దుప్పటిని తీసి చూశాడు. దూరంగా నూతిదగ్గర తల స్నానాలు చేస్తూ మనవలు కనిపించారు. లేస్తూనే కోడలుపిల్ల స్నానం చేసినట్టుంది. జుత్తును ముడిబెట్టింది. పూజకి నంది వర్థనం పూలు కోస్తూ కనిపించింది. అబ్బాయి పట్టుపంచెలో పవిత్రంగా ఉన్నాడు. త్వరగా స్నానాలు కానీయండి! అవతల అభి షేకానికి టైమవుతోంది అంటున్నాడు. పిల్లల్ని తొందర చేస్తున్నాడు. అంతా శివుడికోసం పరుగుదీస్తున్నారు. తీయనిది తానొక్కడే అనుకున్నాడు నాయుడు. ఒత్తిగిల్లాడిటు. చెంపకు మతాబులు చల్లగా తగిలాయి. గతరాత్రి దీపావళికి కాల్చినవి కాల్చగా, మిగిలినవి తన దుప్పటిలో మనవలు దాచుకున్నారనుకున్నాడు నాయుడు. వాటిని తీసి, మంచం కింద జాగ్రత్త చేశాడు. బోర్లా పడి లేచే ప్రయత్నం చేశాడు కాని, వీలు కాలేదు. ఇక ఇంతే అనుకుని మళ్ళీ వెల్లకిలా పడుకున్నాడు. స్నానాలయిపోయాయి. నూతి దగ్గర నుంచి మనవలు వెళ్ళిపోయారు. పూలు కోసుకుని కోడలు కూడా వెళ్ళిపోయింది. అబ్బాయి అలికిడి లేదు. అంటే... అంతా గుడికి వెళ్ళిపోయి ఉంటారనుకున్నాడు నాయుడు. కాసేపట్లో అభిషేకం ప్రారంభం అవుతుందనుకున్నాడు.

ఏ వేళపడితే ఆ వేళ అక్కడ ఆ గుడిలో అభిషేకం చేయరు. ఒకరి తర్వాత ఒకరిగా పొద్దున ఒకేసారి చేస్తారంతా. ఎంతటి వారైనా క్యూలో నిలబడాల్సిందే! తమవంతు వచ్చే వరకూ వేచి చూడాల్సిందే! ఆబాలగోపాలమూ చిన్నదో పెద్దదో పాత్ర పట్టు కుని, పాత్ర నిండా నీరుపట్టుకుని నిలబడితే హరహరమహదేవ! శంభోశంకర అని ప్రధానార్చకుడు అభిషేకాన్ని ప్రారంభి స్తాడు. అభిషేకించి అతను పక్కకి తప్పుకుంటే భక్తులప్పుడు తోసుకొస్తారు. ఇటు అభిషేకించడం, అటు ప్రసాదం అందు



కోవడం రెండూ ఏకకాలంలో జరుగుతాయి. వేడివేడి పులిహోర ప్రసాదంగా పెడతారు. బాదం ఆకుల్లో భద్రంగా పెడతారు. బలే రుచిగా ఉంటుందది అనుకున్నాడు నాయుడు. ఐదేళ్ళ వయసు నుంచీ ఆ ప్రసాదం రుచి తెలుసు. ఎనభై ఏళ్ళుగా రుచి చూశాడు. తేడా లేదెన్నడూ. అదే ముక్కంటిమహిమ అనుకున్నాడు నాయుడు. తనకిప్పుడు ఎనభై అయిదేళ్ళు. ఎనభై అయిదేళ్ళ వయసులో మంచానపడి, అభిషేకానికీ ప్రసాదానికీ దూరమయ్యాననుకున్నాడు.

ఐదేళ్ళ వయసులో తల్లిదండ్రులతో అభిషేకానికి వెళ్ళిన రోజు గుర్తొచ్చింది నాయుడికి. తనని ముందు ఉంచుకుని, తల్లిదండ్రులు వరుసలో నిల్చున్నారు. చిన్న చెంబులో నీళ్ళుంచుకుని నిలబడ్డాడు నాయుడు. తన వంతు వచ్చింది. లింగం మీద చెంబుని బోర్లించాడు. లింగం మీద నుంచి జారుతున్న నీరు పట్టుకుని, తలకి రాసుకోమన్నది అమ్మ. గోలలో వినిపించలేదది. అమ్మ అభిషేకించి, ఆ నీటిని రాసింది. శివయ్య చెయ్యి తల మీద ఉంచి నిమిరినట్టయింది. ప్రసాదం కోసం పరుగుపెట్టాడు. రెండు చేతుల్తోనూ రెండుసార్లు అందుకున్నాడు. చలిచలివేళ, వేడివేడిప్రసాదం, గుడిమెట్ల మీద తల్లిదండ్రుల మధ్య వెచ్చవెచ్చగా కూర్చుని తినడం గొప్ప అదృష్టం. తిన్నాడలాగే! చీరకొంగుతో అమ్మ నోరు తుడిచింది. నాన్న నవ్వుతూ దగ్గరగా తీసుకున్నాడు. వాళ్ళేరి? ఏమైపోయారు? ఎక్కడికి వెళ్ళిపోయారు? ఏడుపొచ్చింది నాయుడికి. ఏడుస్తూ తలగడ గలేబులో చేయి దూర్చి వెది కాడు. దొరికింది. దొరికిన దానిని చేతుల్లోనికి తీసుకుని చూశాడు. చిన్న శివలింగం. రాతి లింగం. అమ్మ ఆనాడు ఆలయం దగ్గర కొని ఇచ్చిన లింగం. ఎనభై ఏళ్ళుగా దాచుకున్నది. వెలిగిపోతూ కనిపించింది. నిమురుతోంటే చేజారింది. గుండె బేజారై ఒత్తిగిల్లాడు. ఒత్తిగిల్లినప్పుడు నాయుడి కన్నీటిబొట్టు, మంచం మీద పక్కనే పడిన లింగం మీద పడింది. దానిని అభిషేకించిన ట్టయింది. అంతే! అక్కడ ఆ గుడిలో అభిషేకం ప్రారంభం అయింది. గంటలు మోగాయి. శంఖధ్వని చెలరేగింది. లింగం మీది కన్నీటిని తడిమి, ఆ తడిచేతిని భక్తిపూర్వకంగా తలకు రాసుకున్నాడు నాయుడు. పునీతుడయ్యాడు.




## రిపేర్ చేసుకునే రోడ్లు

చినుకు పడితే చిత్తడయ్యే రోడ్ల సంగతి మనకు తెలిసిందే. వానలు తగ్గాక ఆ గతుకులు పూడ్చడం..తవ్వడం..పూడ్చడం.. రోడ్లు పాడైపోయిన ప్పుడల్లా ఇలాంటి సీన్లు మనకు మామూలే. అయితే ఈ సమస్యకో పరిష్కారం కనుగొన్నాడు నీమ్ కుమార్ భాంటియా. మరి అదేంటో తెలుసుకుందామా!

శాశ్వత ప్రాతిపదికన టెక్నికల్ రోడ్లు...
పాడైతే వాటికవే రిపేర్ చేసుకునే రోడ్లు...

కెనడాలో ప్రొఫెసర్గా పనిచేస్తున్న నీమ్ కుమార్ భాంటియా కనిపెట్టిన రోడ్లు అచ్చం అలాంటివే. రోడ్లంటే... తారు, కంకర మిక్స్చేసి దానిమీదనుంచి రోలర్ తొక్కించి నున్నగా చేసిన రోడ్లుకాదు. దానికి టెక్నాలజీ తోడైంది. పాడైతే దానికదే రిపేర్ చేసుకుంటుంది. ఒకసారి రోడ్డు వేస్తే మళ్లీ దాని జోలికి పోవాల్సిన అవసరమే ఉండదు! పైగా పర్యావరణానికి ఏమాత్రం హానికలగదు.

డిల్లీ ఐఐటీ నుంచి గ్రాడ్యుయేషన్ పూర్తిచేసుకున్న నీమ్కుమార్ కెనడాలో స్థిరపడ్డాడు.



వాన్ కోవర్ లోని బ్రిటీష్ కొలంబియా యూనివర్సిటీలో సివిల్ ఇంజనీరింగ్ డిపార్టుమెంటులో పనిచేస్తున్నాడు నీమ్కుమార్. 2014 నుంచి అతడు తన టీంతో కలిసి బెంగళూరుకు 90 కిలోమీటర్ల దూరంలో ఉన్న తొండేబావి అనే గ్రామంలో ఇలాంటి రోడ్లనిర్మాణానికి ప్రాజెక్ట్ వర్క్ చేపట్టాడు.

నీమ్ కుమార్ అభివృద్ధి చేస్తున్న రోడ్లు అన్ని రోడ్లల్లాంటివీ కాదు. మామూలు తారురోడ్లతో పోలిస్తే ఈ రహదారుల మందం 60 శాతం తక్కువగా ఉంటుంది. ఖర్చు తక్కువే. చాలామటుకు సిమెంట్కు బదులుగా బూడిద ఉపయోగిస్తారు. పగుళ్ళువస్తే దానికదే రిపేర్ చేసుకునేలా దానికి టెక్నాలజీని జత చేస్తున్నారు.

మెటీరియల్లో వాడే ఫైబర్లకు హైడ్రోఫోలిక్ నానో కోటింగ్ ఉంటుంది. ఈ హైడ్రోఫోలియా నీళ్ళను ఆకర్షిస్తుంది. ఆ నీళ్ళు పగుళ్ళను అరికట్టడంలో ఉపయోగపడతాయి. సో, ఎప్పుడు రోడ్డు మీద చీలిక వచ్చినా సిమెంటుని హైడ్రేట్చేసి సిలికేట్లను ఉత్పత్తి చేస్తుంది. దాంతో రోడ్డు దానికదే రిపేర్ చేసుకుంటుంది. మామూలురోడ్లతో పోలిస్తే ఈరకం రోడ్లను 30 శాతం తక్కువ ఖర్చుతో వేయొచ్చు. పైగా ఇవి 15 ఏళ్ళ వరకు చెక్కు చెదరకుండా ఉంటాయట. ఈ తరహా రోడ్లు వేయడానికి ఇప్పటికే వివిధ రాష్ట్రాల కంపెనీలతో సంప్రదింపులు జరుపుతున్నారు. అంతా అనుకున్నట్టు జరిగితే మన దేశంలో రోడ్లకు మహర్దశ పట్టినట్టే.. ఏమంటారు?

# మెయిల్ బాక్స్

### ఆరంభమే అదిరింది

సినీవాలి సీరియల్ ఆరంభమే అదిరింది. వెట్టి, మహానంది సీరియల్స్ కూడా ఒకదానితో మరొకటి పోటీపడుతున్నాయి. డాక్టర్ మాధురి సీరియల్ అద్భుతంగా ఉంది. మొదటిపేజీ 'విన్నపాలు వినవలె'లో నూతన జంటల అనుబంధాలు ఎలా ఉండాలో తెలియజేసింది. అమ్మవీలునామా కథ కన్నీళ్ళు రప్పించింది. కోట శ్రీనివాసరావు గారి కథా కథనం రెండవభాగం ఆసక్తికరంగా ఉంది.

-కె.వి.దుర్గామోహనరావు, హైదరాబాద్

### కళ్ళుచెమర్చిన కథ

మృత్యుంజయుడు కథ చదివాం. డోనార్కార్డ్ మా కళ్ళు చెమర్చాయి. కథలు నాలుగూ సూపర్. అమ్మ వీలునామా, ఆశ్రమం కథలు ఉద్వేగపరిచాయి. ఎవరినైనా బెదిరించడం నోటిమాటగానే ఉండాలి. కానీ కాగితంపై రాస్తే బుక్ అవడం ఖాయం అని తెలియజేసింది 'దెబ్బకుదెబ్బ'. భార్యాభర్తల అనురాగ దాంపత్యానికి మూలసూత్రం బోధించింది మొదటిపేజీలో విన్నపాలు వినవలె.

-తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం-11

### దెబ్బకు దెబ్బ

మార్నింగ్ కాఫీ దెబ్బకుదెబ్బ అదిరింది. మొదటి పేజీ సరదాగా జీవిత సత్యాన్ని తెలియజేసింది. సినీవాలితోపాటు లక్కీడిప్ ఆరంభం కావడం హర్షణీయం. ఆరోగ్యం మన చేతుల్లోనే ఉందన్న విషయం చదివి గ్రహించాం. మృత్యుంజయుడు కథాకర్త అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యంగారికి అభినందనలు. మార్నింగ్ కాఫీ భార్యభర్తల అనుబంధం సర్వే కిక్ ఇచ్చింది.

-నేమాన సుభాష్చంద్రబోస్, విశాఖపట్నం

### అద్భుతమైన కథ

'అమ్మ వీలునామా' అద్భుతంగా ఉంది. తల్లి ప్రేమ అందలేదని కొడుకు, అతని ప్రేమ అందక తల్లి పడిన వేదన మా హృదయాల్ని మెలి పెట్టింది. సురభి అంశాలు ఆకట్టుకున్నాయి. పెంపుడు కుక్కకి ఐ ఫోన్లు గిఫ్ట్గా ఇవ్వడం కేవలం పిచ్చితనమే. కుక్క ఫోన్లని ఏంచేసుకుంటుంది? భవనంలోంచి రోడ్డు, టన్నెల్ ఆఫ్ గాడ్ ఆసక్తి కలిగించాయి.

-స్నేహమాధురి, పెద్దాపురం

### సముచితమైన నిర్ణయం

వేమూరి ఆంజనేయశర్మగారు ధన్యజీవి. ఆయన స్మారక అవార్డు నవ్యవీక్లీ శర్మగారికివ్వడం సముచితం. సరసి కార్టూన్లు మధ్యతరగతి మందహాసాలే. మొదటిపేజీలోని రాయుడిగారి హృదయవైశ్యాలం కొలవలేనిది. నౌకా గ్రంథాలయంలో నాకిష్టమైన పుస్తకం ఆ ఓడ పైభాగానికి వెళ్ళి చదవాలనే సరదా కల్గుతోంది.

-బి.రాజేశ్వరమూర్తి, చిలకలపూడి

### సంపాదకీయం బాగుంది

దేవుడేమరి సంపాదకీయం చాలాబాగుంది. కథలు తెలుగు విలువల్ని కాపాడేలా ఉన్నాయి. వారం వారం నవ్యవీక్లీలో సరికొత్తదనం కనిపిస్తోంది. తమిళనాడు అమ్మ జయలలిత ఆరోగ్యపరిస్థితిపై ప్రత్యేకవ్యాసం ఆసక్తికరంగా ఉంది.

-ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

### సినీవాలీ అదుర్స్

'సినీవాలి' సీరియల్ అత్యద్భుతంగా ఉంది. సినీ రంగం తెరమీద ఎంత అందంగా ఉంటుందో, తెర వెనుక అంత కల్మషంతోను, పట్టింపులతోను అసూయలతోను నిండి ఉంటుంది. కొంతమంది తారల జీవితాలు అద్భుతం. కానీ వారు జీవితంలో బాధలు తట్టుకోలేక ఆత్మహత్యలు చేసుకుంటారు. నవ్య పాఠకులకు 'సినీవాలి' చక్కని బహుమతి. గతంలో




రావూరి భరద్వాజ పాకుడురాళ్ళు చదివాను.

అత్యద్భుత నటనతో ప్రేక్షకులను మెప్పించి, నిజ జీవితంలో మోసపోయిన సావిత్రిగారిని ఈ సమయంలో స్మరించుకోక తప్పదు. సీరియల్ రాస్తున్న ప్రభాకర్జైని గారికి అభినందనలు.

-గొట్టాపు దుర్గారావు, ఏలూరు

### వీక్లీకి క్రేజ్ తెచ్చిన సీరియల్

ప్రభాకర్జైని కొత్తసీరియల్ సినీవాలి ప్రారంభం కావటం, పాఠకుల ప్రశ్నకు లక్కీ డిప్లో విజయం సాధించిన పాఠకులకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్ స్టోర్స్, హనుమకొండ వారి సౌజన్యంతో పట్టుచీర బహుమతి ఇవ్వటం నవ్య వీక్లీకి క్రేజ్ తెచ్చింది.

-టి.బాల్ముకుంద్ సింగ్, అమరచింత

### నానమ్మ ఐడియా

కుంగుబాటు లొంగదీసుకోవడానికి నానమ్మ ఐడియా, చిన్నచిన్న చిట్కాల స్క్రీన్ప్లే అద్భుతంగా ఉంది. అందరూ పాటించదగిన చిట్కాలివి. అవి నీతిపై ఉపన్యాసాలు కాదు, ఎవరికివారు దాన్ని అంతం చేసే యత్నం చేయాలి. విమర్శల్ని ఎలా స్వీకరించాలో వివరించిన గేమ్ ఆఫ్ లైఫ్ ఉపయుక్తంగా ఉంది.

-ఆర్.శాంతిచంద్రిక, సామర్లకోట

### ఆలోచన రేకెత్తించే యండమూరి కాలమ్

యండమూరి నిర్వహిస్తున్న కాలమ్ సరదాగా ఉండటమే కాక అడిగే ప్రశ్న ఆలోచన రేకెత్తిస్తోంది. దేవుడేమరి అంటూ మొదటిపేజీలో చెప్పిన కథ హృదయాన్ని హత్తుకుంది. సురభిలో చెప్పిన ఏటిఎం కథ కమామీషు ఆసక్తికరం. హృదయం పదిలం అంటూ వివరించిన జాగ్రత్తలు, సూచనలు ఉపయుక్తంగా ఉన్నాయి. నౌకా గ్రంథాలయం అలరించింది.

-చంద్ర, కాకినాడ

# చార్లీ చాప్లిన్ మ్యూజియం

ఆయన పేరు చెబితే చాలు తెలియకుండానే మన మోము చిరునవ్వులమయమైపోతుంది. మనసులోని ఆందోళనలన్నీ దూరమైపోతాయి. విషాదంలో ఉన్నాసరే వినోదం పంచడం ఆయనకే చెల్లింది. ఆయనే కామెడీ కింగ్ చార్లీ చాప్లిన్. ఆయన గురించి బహుశా తెలియని వారు ఉండరేమో! హావభావాలతోనే ప్రేక్షకులను నవ్వించగల కామెడీ కింగ్ చాప్లిన్.

తలపై టోపీ, చేతిలో కర్ర, చిరుగులకోటు.. ఇదే అతని వస్త్రధారణ. వీటితో పాటు ముఖంలో ఎన్నో రకాల భావాలు పలికిస్తూ ప్రేక్షకులను కడుపుబ్బా నవ్వించే ఆ నటుడి గురించి చాలామంది తెలుసుకోవాలనే కోరుకుంటారు. అలాంటివారికోసమే ప్రత్యేకంగా ఒక ప్రాంతం ఏర్పడింది. ఆ ప్రాంతంలో ఎక్కడ చూసినా చాప్లిన్‌కి సంబంధించిన విశేషాలే మనకు కనబడతాయి.

### చార్లీ ప్రపంచం

తన కెరీర్‌లో సుమారు 80 సినిమాల్లో నటించి, మూడు అకాడమీ అవార్డులు అందుకున్న చార్లీ హాస్యనటుడుగానే మనందరికీ తెలుసు. కానీ ఆయన ఒక మంచి రైటర్, ప్రొడ్యూసర్, డైరెక్టర్. ఈ విషయం చాలామందికి తెలియదు. ఇలాంటి ఎవరికీ తెలియని ఎన్నో విషయాలను మనం ఈ ప్రాంతానికి వెళితే తెలుసుకోవచ్చు. ఇంతకీ ఏంటా ఊరు అంటారా. అది ఒకరకంగా చార్లీ చాప్లిన్ ప్రపంచంగా చెప్పొచ్చు. ఆ ప్రాంతమే వేవే. స్విట్జర్లాండ్‌లోని జెనీవా తీర ప్రాంతాల్లో ఉంది ఆ అందమైన నగరం.

చార్లీ 1977 సంవత్సరంలో తన 88వ ఏట కన్నుమూశారు. చార్లీ చాప్లిన్ అమెరికా నుంచి వెళ్ళిపోయిన తర్వాత 25 ఏళ్ళపాటు అంటే తను మరణించేంతవరకు కూడా ఇక్కడే నివసించారు. అందుకే ఆయన జ్ఞాపకార్థం ఇక్కడ ఏకంగా ఓ మ్యూజియం ఏర్పాటు చేశారు.



### ఏముందీ మ్యూజియంలో?

ఈ మ్యూజియంలో మొత్తం మూడు భాగాలు ఉన్నాయి. అందులో చాప్లిన్ స్టూడియో, సినీ పరిశ్రమలో చాప్లిన్ చేసిన సినిమాలు, ఆయన నివసించిన ప్రాంతాన్ని గార్డెన్లుగా మార్చి అంతటినీ మ్యూజియం చేశారు. ఈ మ్యూజియంలోనే చాప్లిన్ కుటుంబీకుల ఫోటోలు ఆయన్ను కలిసిన ప్రముఖుల ఫోటోలు మనకు కనిపిస్తాయి. అంతేకాదండోయ్.. ఈ మ్యూజియం పక్కనే ఉన్న ఓ రెస్టారెంట్‌లో అక్కడికి వచ్చే కస్టమర్లకు చాప్లిన్ గుర్తుగా కొన్ని బహుమతులు కూడా ఉచితంగా ఇస్తారు.

### అతిపెద్ద పెయింటింగ్

వేవేలో ఉన్న ఓ స్థానిక టవర్‌బ్లాక్‌పై చార్లీ చాప్లిన్ పెయింటింగ్‌లు కూడా కనిపిస్తాయి. అక్కడే ఉన్న గిలమెంట్ టవర్స్ అనే ఓ పెద్ద భవనంపైన ఫ్రాన్స్‌కి చెందిన ఓ పెయింటర్ 2010లో చాప్లిన్ పెయింటింగ్ వేశాడు. అతనిపేరు ఫ్రాంక్ బొరెలెక్. అది వేయడానికి ఫ్రాంక్‌కి 1000 కిలోల పెయింటింగ్‌తో పాటు 50 పెయింటింగ్ బ్రష్‌లు అవసరం పడ్డాయట.

వేవేలోనే లడేరాక్ అని ఓ చాక్లెట్ షాప్ ఉంటుంది. బ్లేస్ పోయెట్ అనే క్రాఫ్ట్‌మన్ చాప్లిన్ వేసుకునే బూట్ల ఆకారంలో చాక్లెట్లు తయారు చేస్తాడు. వాటినే అతడు చాప్లిన్‌కి నివాళిగా అర్పించాడు. ఇప్పటికీ ఈ చాక్లెట్లకు అక్కడ మంచి ఆదరణ ఉంది. దేశవిదేశాల నుంచి ఎందరో అక్కడికివచ్చి ఆ చాక్లెట్లను కొనుగోలు చేస్తుంటారట. అంతేకాదు ఆ ఊరువీధుల్లో కూడా పలుచోట్ల చార్లీచాప్లిన్ విగ్రహాలు మనకు కనిపిస్తాయి.



# అలల అంచులపై రిస్కీ జర్నీ!

**అనంతమైన మన ప్రకృతి ఎన్నో వింతలమయం. ఈ వింతలపై మనిషి నిత్యం ఎన్నో ఫీట్లు చేస్తూ ఉంటాడు. చాలా సందర్భాల్లో ఇవన్నీ ప్రమాదకరమైనవే. అయినా మనం లక్ష్యపెట్టం. అదే మనిషి గొప్పతనం!**

వేసవికాలం వస్తే బీచ్‌లకు ఉండే క్రేజ్ అంతా ఇంతా కాదు. సముద్ర తీరాల్ని ఇష్టపడని వారు బహుశా చాలా తక్కువ మందే ఉంటారు. సాయంత్రంవేళ సముద్రతీరం వెంబడి వీచే పిల్లగాలులు, మీద మీదకు దూసుకువచ్చే సముద్ర కెరటాలు...అలల మాటున ఉన్న కడలి అందాలు ఎవరినైనాసరే ఇట్టే కట్టిపడేస్తాయి. ఆ ప్రకృతి రమణీయతను చూస్తే ఎంతో మానసికోల్లాసం కలుగుతుంది కూడా.

అయితే ప్రకృతి అందాలు ఉట్టిపడే సముద్రం ఎన్నో వింతలను తనలో ఇముడ్చుకుంటూ ఉంటుంది. ఆ వింతలు చూసేందుకే ప్రపంచం నలు మూలల నుండీ పర్యాటకులు ఆయా ప్రాంతాల సందర్శనకు వెళుతూ ఉంటారు. సముద్రంలోపల ఉండే వింతల్ని మనం ప్రత్యక్షంగా చూడలేం. కానీ కొన్ని కొన్ని సముద్ర తీరాల దగ్గరలో ఉండే కొన్ని చారిత్రక వింతలు మనల్ని ఎప్పుడూ సంభ్రమాశ్చర్యాలకు గురిచేస్తూనే ఉంటాయి. సముద్ర అలలు చేసే వింతలు కొన్ని. అలలు కొన్ని ప్రదేశాలను కొన్ని గంటల పాటు తమలో కలిపేసుకుంటాయి. అలాంటి ప్రదేశాలేంటో తెలుసుకుందామా!!

## సముద్రంలో రైలుమార్గం

సముద్రాల మధ్యలో ప్రయాణ మార్గాలు ప్రపంచంలో మనకు ఎన్నో ఉన్నాయి. రామాయణంలో శ్రీరాముడు సముద్రంపైనే వారధి నిర్మించాడు. ఆ వారధిని వివిధ దేశాల నుంచి వ్యాపారం కొనసాగించడానికి ఉపయోగించేవారని అంటుంటారు. అంతేకాకుండా శ్రీకృష్ణుడి ద్వారక సముద్రగర్భంలో ఉందని చెప్పిన నాసా కూడా ఇటీవల కొన్ని చిత్రాలు విడుదల చేసింది. ఇలా వివిధ కట్టడాలున్న మన భారతదేశంలోనే ఒక ముఖ్యమైన సముద్ర రైలు మార్గం ఉంది. రామేశ్వరం నుంచి ప్రారంభయ్యే ఈ బ్రిడ్జిని 1994 ఫిబ్రవరి 24న ప్రారంభించారు. ఈ బ్రిడ్జిని పంబన్ బ్రిడ్జి అంటారు. ఈ మార్గాన్ని వ్యాపారానికే కాకుండా ప్రజలకు కూడా అందుబాటులో ఉంచారు. ఇక్కడ రైలులో ప్రయాణించిన ఏ ఒక్కరూ ఆ అనుభవం మర్చిపోలేరు. ఒకరకంగా ప్రమాదకరమైనప్పటికీ తగిన జాగ్రత్తలు తీసుకున్నారు రైల్వేసిబ్బంది. ఓడలు, నౌకలు దీని నుంచి ప్రయాణించేందుకు వీలుగా కొందరు మనుషుల సాయంతో ప్రతి నెలా ఈ బ్రిడ్జిని తెరుస్తారు.

## పాసేజ్ డ్యూ గోయిస్

సముద్రంలో రైలుమార్గం సరే... మరి సముద్రంలో రోడ్డుమార్గం ఉంటే! అలాంటిది కూడా ఉందా అనుకుంటున్నారా? అవునండీ రోడ్డు మార్గం కూడా ఉంది. వర్షాలు అధికంగా పడినప్పుడు వరదలు ముంచెత్తినప్పుడు పలు గ్రామాల మధ్య రాకపోకలు నిలిచిపోవడం చూస్తూనే ఉంటాం. వరద ప్రభావం తగ్గి యథావిధిగా రవాణా సౌకర్యాలు మెరుగుపడుతుంటాయి. కానీ ఫ్రాన్స్‌లోని





ఓ ఐలాండ్‌కు ప్రతిరోజు ఇదే సమస్య ఎదురవుతోంది. దీనికి కారణం అక్కడ వరదలో తుఫానో అనుకునేరు. సముద్రంలో ఏర్పడే ఆటుపోట్లు. అదేంటి సముద్రం ఏంచేసింది అనుకుంటున్నారా? అవునండీ అక్కడ సరిగ్గా సముద్రం మధ్యలో రోడ్డు నిర్మించారు మరి. ఇదొక వింత మార్గమనే చెప్పాలి. ఫ్రాన్స్‌లో ఉన్న ఈ రహదారి రోజుకి కొద్ది గంటలు మాత్రమే ప్రయాణానికి అనుకూలంగా ఉంటుంది. మిగతా సమయాలలో కనీసం అది కనిపించదు. ఎందుకంటే ఆ మార్గం 13 అడుగుల ఎత్తున సముద్రపు నీటితో నిండిపోతుంది. అవునండీ నిజమే చెబుతున్నాం. ఇలాంటి అబ్బురపరిచే రోడ్డు నిర్మాణం పేరు పాసేజ్ డ్యూ గోయిస్. గల్ఫ్‌లోని బర్నెఫ్ - ఫ్రాన్స్‌లోని నోయిర్ మౌటర్ ప్రాంతాలను కలుపుతూ ఈ మార్గాన్ని నిర్మించారు.

### రోజుకు రెండుసార్లు మాత్రమే!

సాధారణంగా అలలు ఇలా వచ్చి అలా వెళ్ళిపోతాయి. కానీ ఇక్కడ మాత్రం అలలు రహదారిని ముంచేస్తాయి. దీంతో రహదారి కనిపించదు. కొంత సమయానికి నీరు వెనక్కి వెళ్ళి ఓ గంట పాటు రాకపోకలకు దారి ఇస్తుంది. ఆ తర్వాత మళ్ళీ రహదారిని ముంచేస్తుంది. అలా రోజులో రెండుసార్లు మాత్రమే రహదారి కనిపిస్తుంది.

కానీ ఈ రహదారిని 1701లో నిర్మించినట్లుగా తెలుస్తోంది. దీని నిర్మాణం పూర్తైన తర్వాత ఈ రహదారిని ఉపయోగించలేదట. సుమారు వంద సంవత్సరాల పాటు ఈ రహదారిని ఉపయోగించకుండా ఉంచేశారు! సుమారుగా 1840 ప్రాంతంలో దీనికి మళ్ళీ గుర్తింపు వచ్చింది. అప్పట్లో గుర్రాలతో ఈ మార్గంలో రాకపోకలు సాగించేవారు. ఇప్పుడు నెమ్మదిగా కార్లను సైతం ఈ మార్గంలో రాకపోకలకు ఉపయోగించడం మొదలు పెట్టారు.

### ప్రమాదాలు జరిగే అవకాశం

ఈ పాసేజ్ డ్యూ గోయిస్ మార్గం 2.58 మైళ్ళు నిడివిగలది. అంటే 4.1 కిలోమీటర్లు. ఓ ప్రత్యేక సమయంలోనే అలలు ఈ దారిని కనిపించకుండా నీటితో ముంచేస్తాయి. కొద్దికొద్దిగా అలలు ఈదారిని ముంచేస్తాయి. ఆ సమయంలో రహదారి మార్గమధ్యంలో ఉన్నవారు ప్రమాదానికి గురయ్యే ప్రమాదం ఉంది. అందుకే అటువంటి ప్రమాదాలు చోటుచేసుకోకుండా ప్రత్యేక ఏర్పాట్లు చేశారు. రహదారికి ఇరువైపులా చిన్న స్తంభాలు ఏర్పాటు చేశారు. కొద్దిపాటి అలలు ఇక్కడ ప్రారంభం కాగానే ప్రయాణం చేస్తున్నవారు అప్రమత్తమవ్వాలి. అలా లేకపోతే అలల ఉధృతి పెరిగే కొద్దీ ప్రమాద అవకాశాలు ఎక్కువ. ప్రమాదంలో చిక్కుకున్నవారిని రక్షించేందుకు సహాయక సిబ్బంది ఎల్లప్పుడూ అందుబాటులో ఉంటారు. ఒకవేళ ఎప్పుడైనా అలల్లో చిక్కుకుంటే రోడ్డుకు ఇరువైపులా ఉన్న స్తంభాలు పట్టుకుని పైకి వచ్చి నిలబడాలి.

అలా చేయడంవల్ల సహాయక సిబ్బందికి కనిపిస్తారు. అప్పుడు వాళ్ళు వచ్చి రక్షిస్తారన్నమాట. ఎప్పుడైనా ఫ్రాన్స్ వెళితే ఈ అద్భుతాన్ని మిస్ కాకండి!

### నీళ్ళల్లో ఫ్లైట్ లాండింగ్!

విమాన ప్రయాణం చాలామందికి ఓ కల. ఇక అందులో ప్రయాణించే అవకాశం దొరికితే ఆనందానికి అవధులే ఉండవు. విమాన ప్రయాణంలో ల్యాండింగ్, టేకాఫ్ రెండు సరిగ్గా జరిగితేనే ప్రయాణం సాఫీగా సాగినట్లు లెక్క. టేకాఫ్ కన్నా ల్యాండింగ్ చాలా ప్రమాదకరమైనది. కాస్త అటూ ఇటూ అయితే అంతే సంగతులు. అయితే ల్యాండింగ్ అంటేనే పై ప్రాణాలు పైకెళ్ళిపోయే రీతిలో భీతి కలిగించే విధంగా ఓ రెండు ఎయిర్‌పోర్టులు ఉన్నాయి. ఇవి సముద్రానికి దగ్గరలో ఉంటాయి. అందులో ఒకటి యుకెలో ఉన్న లండన్ సిటీ ఎయిర్‌పోర్ట్. మీరు కనుక ఇక్కడికెళుతుంటే కాస్త జాగ్రత్తగా ఉండాల్సిందే. కాస్త అటూ ఇటూగా విమానం ల్యాండ్ అయిందంటే నేలమీద కాదు సరాసరి సముద్రంలోనే ల్యాండ్ అయిపోతాం. ఇంకోటి స్కాట్లాండ్‌లో ఉన్న బరా ఎయిర్‌పోర్ట్. ఇక్కడ ఎప్పుడు భూమి మీద ల్యాండ్ అవుతామో ఎప్పుడు నీటి మీద ల్యాండ్ అవుతామో ఎవరికీ తెలియదు. సముద్ర అలల ఆటుపోట్ల శబ్దం, మీదకు దూసుకువచ్చే సముద్ర ప్రవాహాలు ఈ ఎయిర్‌పోర్టులను కూడా ముంచేస్తాయి. అందుకే అప్పుడప్పుడు కొన్నిసార్లు ఈ బరా ఎయిర్‌పోర్టులో నీటిమీదనే ఫ్లైట్స్ ల్యాండ్ చేసేస్తారట.

### గుర్రాల విగ్రహాలు నీట మునుగుతాయి

ఇంగ్లాండ్ దేశానికే అందం థేమ్స్ నది. అక్కడ నదిలో ఓ వింత జరుగుతుంది. ఆ నదిలో ఉండే గుర్రపు బొమ్మలు థేమ్స్ అలల తాకిడికి కనిపించకుండా మాయమవుతాయి. ఈ వింత చూసేందుకు అనేక దేశాలనుంచి యాత్రికులు వస్తుంటారు. థేమ్సనది ఒడ్డున నాలుగు గుర్రపు బొమ్మలుంటాయి. ఇవన్నీ నదిలో వేగం పెరిగే కొద్దీ నీటమునిగి పోతుంటాయట. అసలేంటీ గుర్రాలు అనుకుంటున్నారా? 41 ఏళ్ళ జాసన్ డికేరియస్ టైలర్ అనే అతను నదిలో ఈ గుర్రం విగ్రహాలు నిర్మించాడు. ఈ గుర్రాలను నిర్మించడం వెనక ప్రధాన రహస్యం ఏంటంటే ప్రపంచీకరణ పెరుగుతుండడం, పారిశ్రామికీకరణ, వాతావరణం ఎలా మారిపోతుందో ప్రజలకు చెప్పడానికే! ఈ గుర్రపు బొమ్మలు అందుకు ఉపయోగపడతాయిమరి!

భవిష్యత్తులో ప్రపంచాన్ని పారిశ్రామికీకరణ ఎలా ముంచేస్తుందో, వాతావరణం ఎలాంటి మార్పులకు లోనుకాబోతుందో చెప్పడానికి ఈ బొమ్మలు ముందస్తు హెచ్చరికలన్నమాట. అందుకే ఈ గుర్రపు బొమ్మలు నాలుగే పెట్టారు. వాటిని తోలుతున్నట్లుగా నలుగురు మనుషులు ఉంటారు. అందులో ఇద్దరు పెద్దవారు, ఇద్దరు చిన్నవారుంటారు. అందులో పెద్దవారు నడిపే గుర్రపు బొమ్మలు రాజకీయనాయకుణ్ణి, బిజినెస్‌మెన్‌ని సూచించేలాగా ఉంటే మిగతా రెండు గుర్రపు బొమ్మల్నీ రాబోయే తరానికి గుర్తుగా నిర్మించారు. ఈ గుర్రపుబొమ్మలు 2006 సంవత్సరంలో నీటిలో నిర్మించిన మొదటి శిల్పాకృతి కట్టడంగా ప్రపంచవ్యాప్తంగా పేరు తెచ్చుకున్నాయి. అంతేకాకుండా నేషనల్ జియోగ్రాఫిక్ ప్రకారం ప్రపంచవ్యాప్తంగా ఉన్న 25 వింతలలో ఇదీ ఒక్కటిగా నిలిచింది.

మన చుట్టూ ఉండే వింతల్ని మనం కొన్నిసార్లు గమనించం. అలాంటి అద్భుతాలు ఎప్పుడో ఒకసారి బైటపడుతుంటాయి. అవి ఆలస్యంగా వెలుగులోకి వచ్చినా ఎప్పటికప్పుడు అబ్బురపరుస్తూ ఉంటాయి.

*-విజేత*





# వామనుడి మూడవ పాదం

-శీరం నారాయణస్వామి

**లోకబాంధవుడు నడినెత్తిన భగభగలాడేవేళ. పేదవాడి కడుపు ఆకలితో నక నకలాడే వేళ గుమ్మానికి రెండు చేతులూ ఆనించి నిలబడి మగనిరాకకోసం ఎంతో ఆత్రుతతో ఎదురు చూస్తున్నది అలిమేలుమంగతాయారు.**

**గాలికానీ వెలుతురుకానీ చొరరాని వాళ్ళఇంటిని ఇల్లు అనడంకన్నా గుహ అనడం సమంజసంగా ఉంటుంది. ముందు ఒక చిన్నగది, దానిని ఆనుకుని మరొక గది కలిసి ఆ గుహ ఏర్పడింది. ఆ గుహలో త్రేతాగ్ని తన భార్య మంగతాయారుతోను కళాశాల విద్యాభ్యాసం చేస్తున్న తనయుడితోనూ ఉన్నత పాఠశాల చదువులు చదువుతున్న కూతురితోనూ బతుకు ఈడుస్తున్నాడు.**



త్రేతాగ్నిది కోస్తా జిల్లాలకు చెందిన ఒక అగ్రహారం. వంశపారంపర్య అర్చకత్వం. ఒకప్పుడు దేవునిపేర విస్తారంగా మాన్యాలుండేవేమో, గుడిలో వేలుపులకే కాక ఇంట్లో అర్చకులకూ నైవేద్యానికి ఏ లోటూ ఉండేదికాదు. అయితే ఆ మంచి కాలం పోయింది. పిదపకాలం వచ్చింది. రాజకీయ ప్రముఖుల అండదండలతో భూబకాసురులు దేవుని మాన్యాలను స్వాహా చేయటంతో అర్చకత్వ వ్యవస్థ కునారిల్లిపోయింది. దారిద్ర్యం గతుకులబాటపై జీవన శకటం లాగడం కష్టమైపోయింది. ఉనికి మారితే గతి మారుతుందన్న ఆశతో కూతురు అడ్డాలలో ఉన్నప్పుడే నగరానికి వలస వచ్చేశాడు త్రేతాగ్ని.

నగరంలో పురప్రముఖులూ వణిక్ప్రముఖులూ భారి విరాళాలు సేకరించి దేవతలందరకూ అతిపెద్ద దేవాలయ సముదాయం నిర్మించారు. తిరుపతి వెంకన్న, లింగరూపధారి పరమశివుడు, సంకటహారి విఘ్నేశ్వరుడు, కనకదుర్గమ్మ, సీతాసమేతుడైన శ్రీరామచంద్రుడూ, ఆయన నమ్మిన బంటు ఆంజనేయుడూ, దక్షిణాదిన విశేషంగా కొలువబడే అయ్యప్పస్వామి, షిరిడీవాసుడు సాయినాథుడు... ఇలా ఇందరు దేవతలూ ఒకేచోట కొలువుతీరారు. వేలుపులందరూ ఒక్కచోటే అందుబాటులో ఉండే ఈ దేవాలయానికి ఆ చుట్టుపక్కల ప్రాంత భక్తులు దినమంతా తండోప తండాలుగా తరలి వస్తుంటారు. ఒకపక్క హరినామస్మరణ, మరొకపక్క హనుమాన్‌చాలీసా పారాయణం, ఒకచెంత కనకదుర్గా స్తోత్రం... ఇక దినమంతా గుడి గంటల గణగణ ధ్వనులతో ఆ పరిసరాలు ప్రతిధ్వనిస్తుంటాయి. నిత్యమూ వందలసంఖ్యలో కొబ్బరికాయలు పగులుతుంటాయి. హుండీలో వేసిన కానుకలు మాత్రమే భగవంతునికి చెందుతాయని ప్రకటించినప్పటికీ భక్తజనం తమ కానుకలు హారతి పళ్ళెంలోనే వేస్తుంటారు. కానుకలతో హారతిపళ్ళాలు నిండిపోతుంటే అర్చకస్వాముల వదనాలు దరహాస చంద్రికలతో వెలిగిపోతుంటాయి. తమకు లభించే వేతనాలు ఈ కరువు కాలంలో ఏ విధంగాను చాలవేమో. ఆ కానుకలే వారిని ఆదుకుంటాయి.

అయితే త్రేతాగ్ని పరిస్థితి ఇందుకు భిన్నం. ఆ ఆలయ సముదాయంలో కడపటినున్న గరుడాళ్వార్ సన్నిధికి ఆయన అర్చకత్వం వహిస్తున్నాడు. తక్కిన వేలుపులను ఎంతో భక్తిశ్రద్ధలతో తృప్తిగా తనివితీరా సేవించుకున్న భక్తులు గరుడాళ్వార్‌పట్ల ఎందుకో ఉపేక్ష వహిస్తారు. అంతదాకా వచ్చినవారు గరుడాళ్వార్‌ను దర్శించుకోకుండానే వెనుదిరిగి పోతుంటారు. అందువలన తక్కిన వేలుపులవద్ద భక్తులు కిటకిటలాడుతుంటే గరుడాళ్వార్ సన్నిధిలో మాత్రం భక్తులకు కటకట... అక్కడ దినమంతా జేగంటలు గణగణలాడుతుంటే గరుడాళ్వార్ సన్నిధిలో మాత్రం నిరంతరం నిశ్శబ్దం తాండవిస్తుంటుంది, త్రేతాగ్ని జీవి



తంలో నైరాశ్యంలా!

శ్రీమహావిష్ణువు భారాన్ని గరుడాళ్వార్ మోయగలుగు తున్నాడేమోగానీ ఆయన్ను నమ్ముకున్న త్రేతాగ్నిమాత్రం తన దారిద్ర్య భారాన్ని మోయలేకపోతున్నాడు.

ఆ అపరాహ్నవేళ మంగతాయారు భర్త రాక కోసం ఎదురు చూస్తుండటానికి కారణం లేకపోలేదు. ఆరోజు మహాలయ అమావాస్య. పైలోకంలోని పితృదేవతలకు విప్రులద్వారా స్వయంపాకాలు అందించే రోజు. ఒకరిద్దరైనా తన మగనికి స్వయం పాకాలు అందిస్తారనీ వాటితో ఈనెల చివరి నాలుగురోజులూ సజావుగా జరిగిపోతాయనీ ఆ ఇల్లాలి ఆశ.

అయితే అల్లంత దూరాన చెమటోడ్చుకుంటూ రిక్తహస్తాలతో ఉస్సురుమంటూ నడుచుకు వస్తున్న త్రేతాగ్నిని చూడటంతోనే ఆమె నీరుగారిపోయింది. అలసటతో కుర్చీలో వాలిపోయిన విభునికి మంచితీర్థం అందిస్తూనే అడగటం అనవసరం అనుకుంటూనే ఉండబట్టలేక అడిగేసింది.

"అయితే ఎవ్వరూ స్వయంపాకాలు ఇవ్వడానికి రాలేదన్నమాట".

"రాకనే... చాలామంది వచ్చారు. కానీ నా దాకా రానిస్తేనే కదా! అంతా వాళ్ళల్లోవాళ్ళే పంచేసుకున్నారు. వాడి పిండం పిల్లులకి పెట్ట. ఆ గణపతిశాస్త్రి తానొక్కడే ఏ ఏడెనిమిది మంది దగ్గరో స్వయంపాకాలు పుచ్చుకుని ఉంటాడు. నా దగ్గరకు ఒక్కణ్ణీ పంపలేదు. వాడి ఆశ కూలిపోను. అయినా మనరాత ఇలా తగలబడ్డప్పుడు మరొకరిని నిందించి ప్రయోజనమేముందిలే" అంటూ రొంటి నుంచి అయిదు రూపాయలు చిల్లర తీసి భార్యకందించాడు. ఈవేళ హారతి పళ్ళెంలో దక్కింది ఇంతేమరి. దీనితో ఇంటిల్లిపాదీ మింగి చావడానికి పురుగుల మందుకూడా దొరకదు అన్నాడు వేదనతో. దారిద్ర్యానికి కులంలేదు మరి.

అపరాహ్నవేళ అటువంటి మాటలెందుకులెండి అంటూ అతడి చేతిలోనుంచి చిల్లర అందుకుని చెప్పుల్లో కాళ్ళు దూర్చి ఇప్పుడే వస్తానంటూ మండుటెండలో బైటకు వెళ్ళింది. అరగంట తరువాత ఎర్రటి వదనం ఎండకు మరింత ఎర్రగా కందిపోగా చెమటలు కారుస్తూ కాసిని పుదీనా కట్టలతో తిరిగివచ్చింది పెద్దబజారుకు వెళ్ళి వచ్చానంటూ.

ఇంతోటి పుదీనా కట్టలకోసం మండుటెండలో అంతదూరం వెళ్ళాలా అన్నాడు త్రేతాగ్ని పరితాపంతో.

ఆమె పైటచెంగుతో ముఖం తుడుచుకుంది. అద్దంలో చూసుకుంటూ చెమటకు చెదిరిపోయిన కుంకుమబొట్టు సరిదిద్దుకుంటూ "ఇంటిదగ్గర ఐదు రూపాయలకు ఒక్కకట్టే దొరుకుతుంది. దూరం అనుకోకుండా పెద్ద బజారుకెళితే పెద్దపెద్ద కట్టలు రెండు వచ్చాయి" అన్నది.

త్రేతాగ్ని ఒక చిన్నకునుకుతీసి లేచేసరికి ఆమె 'అన్నం వండేశాను, మడికట్టుకోండి' అన్నది. వేడివేడి అన్నం ఘుమఘుమలాడుతున్న పుదీనా పచ్చడి. తప్పితే వేరేకూర ఏదీ లేదు. ఆఖరికి ఒక్క మజ్జిగబొట్టుకూడా లేదు. బాగా ఆకలిమీద ఉన్నాడేమో త్రేతాగ్ని ఒక మెతుకైనా మిగల్చకుండా తినేశాడు. కొంచెం అన్నం మారు అడగాలనిపించింది. అక్కడికీ మంగతాయారు అడగనే అడిగింది అన్నం మారువెయ్యమంటారా అంటూ వద్దనేశాడు.

హస్తప్రక్షాళనం చేసుకుని భార్య గమనించకుండా అన్నం గిన్నెమీది మూతతీసి చూస్తూనే గతుక్కుమన్నాడు. ఆ ఇల్లాలు తనకంటూ మిగుల్చుకున్నది కేవలం గుప్పెడు మెతుకులు! ఇంకా నయం అన్నం మారు అడిగేడు కాదు. ఆ కాసిన్ని మెతుకులూ తనకే విదిల్చేసేదికదా అను కున్నాడు. ఆయన మనసు భార్యపట్ల సానుభూతితో ద్రవించిపోయింది. ఏ జన్మలో ఏం పాపం చేసుకున్నదో మరి ఈ దరిద్రుడి బారినపడింది కదా అనుకున్నాడు.

ఆరోజు రాత్రి త్రేతాగ్ని నిద్రకుపక్రమిస్తుండగా ఏదో చెప్పడానికన్నట్లు దగ్గరకు వచ్చింది మంగతాయారు. సమస్యలతో సతమతమవుతున్న ఏ మగడైనాసరే భార్య మరిన్ని సమస్యలచిట్టా విప్పితే విసుక్కుంటాడు. కసురుకుంటాడు. చీదరించుకుంటాడు. కానీ త్రేతాగ్ని అలాకాదు. ఎందుకంటే మంగతాయారు బహుదొడ్డ ఇల్లాలు. ఒక సమస్యకు పరిష్కారం ఆలోచించాకే ఆ సమస్య అతడి ఎదుట లేవనెత్తుతుంది.

ఏదో చెప్పబోతున్నట్టున్నావు, చెప్పుమరీ అన్నాడు నడుం వాల్చబోతున్నవాడల్లా లేచి కూర్చుంటూ.

గుహలోని పక్కగదిలో నిద్రిస్తున్న పిల్లలకు నిద్రాభంగం కలగకుండా చాలా తగ్గుస్వరంతో నానిగాడికి అదేదో ఫీజు కట్టాలటండీ అన్నది. ఎంతేమిటి అడిగాడు. ఆమె చెప్పింది వింటూనే అబ్బ, పెద్దమొత్తమే అన్నాడు దిగులుగా.

క్షణం మౌనం తరువాత ఆమె "అమ్మాయి రోజురోజుకీ ఎదిగివస్తున్నది. పైబట్టలేకుండా నలుగురిలో మసలడానికి ఎంతో ఇబ్బంది పడుతున్నది. దానికి తక్షణమే రెండు ఓణీలైనా కొని పెట్టాలి" అన్నది.

త్రేతాగ్ని మౌనంగా ఉండిపోయాడు.

"ఈ రెండూ తక్షణ అవసరాలే. దేన్నీ పక్కన బెట్టలేం. అందుకని రేపు మధ్యాహ్నం కోవెలనుంచి తిరిగివచ్చేటప్పుడు దీనిని అంపకం పెట్టండి" అంటూ ఒక వెండిగిన్నె ఆయనకు చూపించింది.

దాన్ని చూస్తూనే గతుక్కుమన్నాడు త్రేతాగ్ని. అది డెబ్బైసంవత్సరాలనాటిది. మంగతాయారు తల్లిగారికి బాల్యంలో అన్నప్రాసన సమయంలో ఆవిడ మేనమామలెవరో చదివించారు. మరణించినతల్లిగారి జ్ఞాపకార్థం మంగతాయారు దానిని ఎంతో పదిలంగా దాచుకుంది. దానిని ఎంత అపురూపంగా చూసుకుంటున్నదంటే చిన్నారికి ఆశీస్సులతో నడిమింటి ప్రసాదరాయశర్మ తేదీ: 7-1-1940 అని దానిమీద చెక్కించిన అక్షరాలు ఇంకా చెరిగిపోకుండా అలాగే నిలిచి ఉన్నాయి.

అయ్యో దీనినే అంపకం పెడదామంటావా అన్నాడు బాధాతప్తస్వరంతో.

ఏం చేస్తాం. మన అవసరాలు అటువంటివి కదా. ఇలా అవసరాలకు ఆదుకుంటాయనే పెళ్ళిళ్ళలో పెద్దలు బంగారమూ, వెండీ కానుకలుగా సమర్పిస్తుంటారు. మీకు తెలియని దేమున్నది లెండి. తన వెండిగిన్నె మనుమలకు ఇలా ఉపయోగపడుతున్నందుకు పైలోకంలో ఉన్న మా అమ్మ సంతోషిస్తుందిలెండి. అంచేత మీరు వేరే ఆలోచన చేయకుండా దీనిని అంపకం పెట్టండి అన్నది.

అలా తేలికగా చెబుతున్నదేగానీ, తనతల్లి జ్ఞాపికను అమ్ముకుంటున్నందుకు ఆమె మనసు ఎంత క్షోభిస్తున్నదో, గుండె ఎంతలా రాయి చేసుకున్నదో త్రేతాగ్ని ఊహించగలడు. ఆయనకు తన దారిద్ర్యంమీదా తనమీదా ఎనలేని అసహ్యం కలిగింది.

చెప్పవలసినదంతా చెప్పేశాక మంగతాయారు నిద్రకు ఉపక్రమిస్తూ నడుంవాల్చింది. కాసేపటికే గాఢనిద్రలోకి జారుకున్నది. కానీ త్రేతాగ్నికి నిద్ర పట్టలేదు ఎంతసేపటికీ. తీరని అశాంతితో మంచంమీద అటూఇటూదొర్లి చివరకు మంచంమీదనుంచి లేచి పక్కగదిలో నిద్రిస్తున్న పిల్లల వద్దకు వెళ్ళాడు.

త్రేతాగ్నికి కూతురంటే ప్రాణం. ఆ అమ్మాయికి పద్నాలుగేళ్ళుంటాయి. పచ్చని పసిడి ఛాయతో సన్నగా పొడుగ్గా ఎంతో చక్కగా ఉంటుంది. పదిమందిలో తిరుగుతున్నప్పుడు దారినబోయే మగాళ్ళచూపులు 'అక్కడ' పడుతుంటే నా బంగారుతల్లి ఎంతఇబ్బంది పడుతోందో కదా అనుకుంటుంటే జాలితో ఆ పితృహృదయం

**త్రేతాగ్నికి నలభైఐదేళ్ళు. పచ్చని నిమ్మపండు ఛాయ. లక్ష్మీ కటాక్షం లేకపోయినప్పటికీ వదనంలో వర్చస్సు ఉట్టిపడుతూ ఉంటుంది. నుదుట పెద్ద కుంకుమబొట్టు, మెడలో రుద్రాక్ష మాల. చూపరులకు భక్తిభావం కలిగించే ఆజానుబాహువు. దేహీ అంటూ ఎవ్వరినీ ఎన్నడూ యాచించని అభిమానధనుడు. గుడిలో అర్చకత్వ వృత్తి. కానీ ఆ రోజు సూర్యోదయం కాగానే గుడిదగ్గర దృశ్యం చూసి భక్తకోటి నివ్వెరపోయింది. ఏమిటాదృశ్యం?**

ద్రవించిపోయింది. గాఢనిద్రలో ఉన్న కూతురికి మెలకువరాకుండా ఎంతో మృదువుగా ఆమెతల నిమురుతూ ఉండిపోయాడు ఎంతోసేపు. ఆ నిరుపేదతండ్రికి కూతురిపట్ల తనకుగల వాత్స ల్యాన్ని ప్రదర్శించుకునే మార్గం అదొక్కటే మరి.

ఆ మరుసటిరోజు అపరాహ్నవేళ కోవెలపని ముగించుకుని అటునుంచి అటే బజారుకువెళ్ళి గుండెరాయి చేసుకుని అత్తగారి వెండిగిన్నె తెగనమ్మేశాడు.

ఇంట్లో అడుగుపెడుతూనే ఇది నానిగాడి ఫీజు. లెక్కబెట్టే ఉంచాను. దీనిని అలాగే వాడికి చ్చేయి అంటూ చిన్ననోట్ల బొత్తి భార్యకి అందించాడు. బాగా మన్నుతాయని కొంచెం ఖరీదైనా అమ్మాయికి రెండూ మంచి ఓణీలే తెచ్చాను అంటూ బట్టల పేకెట్ ఆమెకు అందించాడు. బరువుగా ఉన్న సంచి మంగతాయారుకు అందిస్తూ మిగిలిన డబ్బులతో మూడుకిలోల బియ్యమూ, అరకిలో కందిపప్పూ, కాసిని కూరగాయలూ వచ్చాయి. వీటితో ఈ నాలుగు రోజులూ జరుగుబాటైపోతుంది అన్నాడు.

ఆమె ఖాళీగా ఉన్న బియ్యం డబ్బాలోకి సంచిలోని బియ్యం వంపుతుండగా ముందు ముందు ఏర్పడే అవసరాలకు ఆదుకోడానికి మనకిక ఏమీమిగలలేదు. నీవీనావీ మాత్ర పిండాలు తప్ప అంటూ బిగ్గరగా నవ్వేశాడు.

వేలాది వేదనాగ్ని పర్వతాలను దాచుకున్న నవ్వు అది.

రోజులు గడుస్తూనే ఉన్నాయి. మనుషుల బతుకులు మారకపోయినా రుతువులు మారుతూనే ఉంటాయి. ధనం అనబడే హవిస్సు లుప్తమైనా జీవనక్రతువు సాగుతూనే ఉంటుంది ఏదో ఒకవిధంగా.

త్రేతాగ్నికి నలభైఅయిదు సంవత్సరాలుంటాయి. మంచి ఆజానుబాహువు. పచ్చని నిమ్మపండు ఛాయ. లక్ష్మీ కటాక్షం లేకపోయినప్పటికీ వదనంలో మంచివర్చస్సు ఉట్టిపడుతుంటుంది. నుదుటదిద్దుకున్న పెద్ద కుంకుమబొట్టు మెడలో రుద్రాక్షమాల చూపరులకు ఆయనపై భక్తిభావం కలిగిస్తుంటాయి. ఇనుపగజ్జెలతల్లి నీడన మసలుతున్నప్పటికీ దేహీ అంటూ ఎవ్వరినీ ఎన్నడూ దేనినీ యాచించని అభిమానధనుడు. అందువల్ల పదుగురిలో మన్నన పొందుతుంటాడు.

ఒకరోజురాత్రి అర్చకత్వం ముగించుకుని తన సదనానికి బయలుదేరుతుండగా దేవాలయం వెలుపల అయ్యగారూ నమస్కారం అంటూ పలకరించాడు నాగభూషణం. అతడు దేవాలయంవద్ద చెప్పులస్టాండ్ నిర్వహిస్తుంటాడు. ఒక్కొక్క చెప్పులజతకు ఒక రూపాయి చొప్పున వసూలు చేస్తుంటాడు. ఎన్నో సంవత్సరాలనుండీ అదే అతడి వృత్తి. అతడి కుటుంబానికి అదే ఆలంబన. దానిమీద ఆధారపడే తన కొడుక్కి పెద్దపెద్ద చదువులు చెప్పించడమే కాక భారీసొమ్ము వ్యయం చేసి ఉద్యోగాలనిమిత్తం నిర్వహించబడే పోటీ పరీక్షలకు శిక్షణ ఇప్పించాడు. అతడి కష్టం ఫలించింది. అతడికొడుకు పోటీపరీక్షల్లో ఉత్తీర్ణుడై ఈ మధ్యనే తమిళనాడులోని ఒక పెద్ద బ్యాంక్‌లో ప్రొబేషన్ అధికారిగా ఉద్యోగంలో చేరాడు.

కొద్దిసేపు లోకాభిరామాయణం. అనంతరం నేను మీ వద్ద సెలవు తీసుకునే సమయం ఆసన్నమైంది అన్నాడు నాగభూషణం. అదేమిటి అలా అంటున్నారు అన్నాడు త్రేతాగ్ని కించిత్ ఆశ్చర్యంతో. మావాడు చిదంబరంలో బ్యాంక్ ఆఫీసర్. ఉద్యోగంలో చేరాడని లోగడ మీకు చెప్పాను కదా! వాడి హోదాకు తగ్గట్టు పెద్ద అద్దె ఇల్లు తీసుకున్నాడు. నన్నూ వాళ్ళమ్మనూ తన దగ్గరకు వచ్చేయమంటున్నాడు. అక్కడకు దగ్గరలోనే ఎన్నో పుణ్యక్షేత్రాలున్నాయనీ వాటిని చూపిస్తాననీ వాళ్ళమ్మకు ఆశ పెట్టాడేమో. ఇక్కడినుంచి మకాం మార్చేద్దామని మా ఆవిడ పోరు పెడుతున్నది. నాకైతే స్వంత కొడుకైనా సరే ఒకరిమీద ఆధారపడి బతకడం ఇష్టం లేదు. నా జీవితం ఇక్కడ సాఫీగానే



సాగిపోతున్నది. పేరుకి చెప్పులస్టాండ్ అన్నమాటే గానీ దీనిమీద ఒక కుటుంబానికి సులభంగా జరుగుబాటైపోతుంది. ఎక్కడా ఒకరూపాయి అప్పు చేయకుండా దీనిమీద ఆధారపడే, మావాణ్ణి ఎలా చదివించుకున్నానో మీకు తెలుసు కదా, అన్నాడు నాగభూషణం.

"కష్టపడినంతకాలం కష్టపడ్డారు గదా! తమిళనాడులో ఉన్నన్ని దివ్యక్షేత్రాలు దేశంలో ఇంకెక్కడా లేవు. చక్కగా మీ అబ్బాయి చెంతచేరి పుణ్యక్షేత్రాలు దర్శించుకుంటూ శేషజీవితం ఎంతో ప్రశాంతంగా గడిపేయండి" అంటూ సెలవు తీసుకున్నాడు త్రేతాగ్ని.

దారిద్ర్యమనేది వామనుడి మూడవపాదం వంటిది. మనిషిని ఎంతటి అధఃపాతాళానికైనా అణగతొక్కగల సామర్థ్యం దానికుంది.

ఆరోజు ఉగాది. తెలుగువారికి పెద్దపండుగ. ఎంతో పెద్ద పండుగ. నూతన సంవత్సరమంతా సుఖశాంతులతో శుభదాయకంగా జరిగిపోవాలనేకాంక్షతో ప్రభాతవేళ నుంచే దైవదర్శనానికి తరలివస్తున్నారు భక్తజనం. ఆ సందర్భానికి తగ్గట్టుగా దేవాలయ సముదాయాన్ని రంగురంగుల విద్యుద్దీపాలతో నానావిధ కుసుమాలతో మామిడి ఆకులతో ఎంతో నేత్రపర్వంగా అలంకరించారు. రాత్రికిరాత్రే అదనపు కొబ్బరి దుకాణాలూ, పూల దుకాణాలూ, పండ్ల దుకాణాలూ వెలిశాయి. మొత్తానికి అక్కడ తిరునాళ్ళ వాతావరణం నెలకొని ఉంది.

గోరువెచ్చని సూర్యుడు నునువెచ్చని కిరణాలతో జగతికి స్నానం చేయిస్తుండగా, నూతన వస్త్రాలతో తనువులు మెరిసిపోతుండగా, నూతనోత్సాహంతో మనసులు మురిసి పోతుండగా, ఆనందం అర్ణవమైన ఆ ప్రత్యేక ప్రభాతవేళ.. చెప్పులస్టాండ్ వద్ద దృశ్యం చూస్తూనే నివ్వెరపోయారు భక్తజనం.

ఆశ్చర్యంతో నోరువెళ్ళబెట్టనివారు లేరు. ముక్కున వేలు వేసుకోని వారూ లేరు.

శుచిగా స్నానంచేసి ఆళ్వార్ సన్నిధిలో నిలబడి శఠారితో భక్తులను ఆశీర్వదించవలసిన త్రేతాగ్ని చెప్పుల స్టాండ్‌లో నిలబడి భక్తుల పాదరక్షలు తీసుకొని గూటిలో పెడుతూ టోకెన్లు అందిస్తున్నాడు. అలవాటులేని పని. అయినా ఎంతో అనుభవజ్ఞుడిలా మెరుపువేగంతో ఆ పని చేసుకుపోతున్నాడు. ఎడతెరిపిలేని పని. ఊపిరి సలపనంత పని. ఎదుటివ్యక్తుల ముఖాలుగానీ ఆ ముఖాలలోని హావభావాలనుగానీ గమనించేంత తీరికలేని పని.

ఆరోజు అందరికీ అదే పెద్ద చర్చనీయాంశమైపోయింది.

రోజులు, వారాలు గడిచాయి. మాసాలూ గతించాయి.

కొత్తవృత్తికి బాగా అలవాటుపడిపోయాడు త్రేతాగ్ని. నానాటికీ భక్తులరద్దీ పెరుగుతున్నదే గానీ తగ్గటంలేదు. దానికితోడు సువిశాలమైన దేవాలయ అంతర్భాగంలో నిత్యం, ప్రతి సాయంత్రం ఔత్సాహిక కళాకారుల నృత్య ప్రదర్శనో, పండిత ప్రకాండుల పురాణకాలక్షేపమో జరుగుతూ ఉంటుంది. దానికి వయసుమళ్ళినవారే కాకుండా పిన్నవయస్కులు కూడా హాజరవుతుంటారు. అందువలన సాయంత్రవేళలో అదనంగా డెబ్బై ఎనభై జతల పాదరక్షలు చెప్పులస్టాండ్‌లో ఆశ్రయం పొందుతుంటాయి.

ఇప్పుడు త్రేతాగ్ని ఆర్థిక పరిస్థితి ఎంతో మెరుగుపడింది. ఎంతకాలంనుండో మార్వాడీవద్ద తాకట్టులోఉన్న మంగతాయారు తాళిబొట్టు విడిపించుకున్నాడు. తనకూ ఇల్లాలికీ దుస్తులు కొనుక్కున్నాడు. తనయుడి ముచ్చట తీరుస్తూ అతడికి జీన్సూ టీషర్టూ కొనిపెట్టాడు. తన గారాలపట్టిని స్వయంగా దుకాణానికి తీసుకువెళ్ళి ఆమె ఎంపిక చేసుకున్న వస్త్రాలు కొనిపెట్టాడు. ఒక హ్యాండ్ బ్యాగ్ కొనిచ్చాడు. గోళ్ళకు పులుముకోడానికి వన్నెవన్నెల గోళ్ళ రంగులూ కొనిచ్చాడు. కొనుగోళ్ళు ముగిశాక కూతురిని మంచి చిరుతిండిశాల (హోటల్)కి తీసుకువెళ్ళి ఆమెకు ఎంతో ఇష్టమైన మసాలాదోశె తెప్పించిపెట్టాడు. ఐస్‌క్రీమ్ తినిపించాడు. సంతోషంతో ఉబ్బితబ్బిబ్బవుతున్న కుమార్తెను చూసుకున్న ఆ పితృ హృదయం తెగమురిసిపోయింది. ఇప్పుడు వాళ్ళింట్లో మరుసటిరోజు గురించి ఆందోళన చెందనవసరం లేకుండా నిత్యమూ నాలుగు రోజులు వరకూ సరిపడేలా బియ్యమూ, పప్పూ, ఉప్పూ, చింతపండూ వంటనూనెలూ ఉంటున్నాయి. మహాఇల్లాలు మంగతాయారు ఎంతో దక్షతతో వ్యవహరిస్తున్నదేమో నాలుగు రూకలు మిగులుతున్నాయి.

అంతా సవ్యంగానే ఉంది.

కాని... కాని...

ఇన్నినాళ్ళు గడిచినా చెప్పులస్టాండ్‌వద్ద త్రేతాగ్ని ఉనికిని ఇంకా జీర్ణించుకోలేకపోతున్నారు భక్తజనం. అక్కడికీ ఉండబట్టలేక ఒకరిద్దరు ఎంతో మొహమాటంగా నసుగుతున్నట్టుగానే అడుగుతున్నారు.

"అయ్యవారూ ఇలా అడుగుతున్నందుకు తమరు అన్యథా భావించకండి. ఆగ్రహించకండి. చక్కగా ఆగమశాస్త్రాలన్నీ చదువుకున్న మీరు, స్వామివారి సన్నిధిలో నిలబడి శఠారితో మమ్మల్ని ఆశీర్వదించవల్సిన మీ పవిత్ర హస్తాలతో ఇలా...."

వారి ప్రశ్న ముగియకమునుపే చిరునవ్వు, చిరుకోపము మిళితమైనస్వరంతో మధ్యలోనే అందుకుంటున్నాడు త్రేతాగ్ని.

"నేనేమైనా దొంగతనాలు చేస్తున్నానా? దోపిడీలు చేస్తున్నానా? లేక టక్కరితనంతో జనాన్ని ఏమారుస్తున్నానా? ఆళ్వార్‌ను నమ్ముకున్నంత కాలమూ ఒక్కమెతుకు పుట్టలేదు. ఇదిగో ఇప్పుడీ చెప్పులస్టాండ్‌ను నమ్ముకుంటున్నప్పటినుంచీ ఇంటిల్లిపాదికీ రెండుపూటలా తలొక ముద్ద పెట్టగలుగుతున్నాను. ఇంతకుమించి నా బతుక్కి కావలసినదేమున్నది?

**సెల్: 94403 06485**



## ఆ ఇద్దరూ సేమ్ టూ సేమ్

వృత్తిపరంగా ఎలా ఉన్నా వ్యక్తిగతంగా నయన సమంతను ఫాలో అయిపోతోంది అంటున్నారు సినీ జనాలు. ఇద్దరికీ పెళ్ళి కాలేదు కానీ పెళ్ళికొడుకులు నిశ్చయమైపోయారు. నయన కోలీవుడ్ దర్శకుడు విఘ్నేశ్‌తో పీకల్లోతు ప్రేమలో ఉంటే సమంత నాగచైతన్యే తన సరిజోడని ఎపుడో చెప్పేసింది. అయితే ఇపుడు ఈ ఇద్దరు ముద్దుగుమ్మలు తమ అత్తలను ప్రసన్నం చేసుకోవడానికి వారిని తెగ కాకా పడుతున్నారని సినీ జనాలు అంటున్నారు. అపుడెపుడో సమంత, అత్త అమలతో కలిసి షాపింగ్ చేస్తే, ఇపుడు నయన తన అత్తగారిని ఇంటికి పిలిచి స్వయంగా వండి వడ్డించింది. పెళ్ళి అయిన తరువాత కూడా ఇద్దరూ ఇదే ట్రెండు ఫాలో అవుతారా? లేదా? అన్న అనుమానాన్ని పలువురు వ్యక్తం చేస్తున్నారు.





# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 5

**'సరే ఎల్లుండి బయలుదేరండి. నేను మళ్ళా వైజాగ్ వెళ్ళాలి' అన్నారు టి.కృష్ణగారు. ఇప్పట్లాగా అప్పట్లో ట్రైన్ రిజర్వేషన్లు ఎక్కువగా ఉండేవి కాదు. అనుకోని ప్రయాణం! ఎలాగో టిక్కెట్టు తీసుకుని రైలు ఎక్కేశా.**

'మీరు రైలు దిగగానే ఫోన్ చేయండి' అని టి.కృష్ణగారు చెప్పిన మాటలు, ఆయన ఇచ్చిన ఫోన్ నెంబరు గుర్తున్నాయి. అందుకే చెన్నై సెంట్రల్ స్టేషన్‌లో దిగి ఫోన్ ఎక్కడుందా? అని వెతికా. షాపతను తమిళంలో మాట్లాడాడు. ఫోన్ చేసుకోవాలని ఇంగ్లీషులో అడిగా. అర్థం చేసు

## అలా.. సినిమా నన్ను పిలిచింది!

కుని ఫోనిచ్చాడు.

నెంబర్ డయల్ చేయగానే ఫోన్ రింగైన శబ్దం అవతలివైపు నుంచి వినిపిస్తూనే ఉంది. ఆ గ్యాప్‌లోనే మనసులో ఎన్నో ఆలోచనలు. అందుకు కారణం లేకపోలేదు.. అంతకు ముందు మద్రాసు వెళ్ళానో లేదో గుర్తులేదుగానీ నటుడిగా అడుగు పెట్టడం అదే తొలిసారి. ఓ వైపు ఫోన్ మోగు తూనే ఉంది.. ఇవతల ప్లాట్‌ఫారమ్ మీద దిగిన ప్రయాణికులు ఎవరి గమ్యం వాళ్ళు వెతుక్కుంటూ వెళుతున్నారు. 'వీళ్ళల్లో ఎంతమంది నాలాగా అవకాశాలకోసం వస్తున్నారో' అనిపించింది.

ఇంతలో 'హలో' అని అవతలి నుంచి గొంతు వినిపించింది. అది టి.కృష్ణగారి గొంతే.

గుర్తుపట్టా. 'సార్ నేను పలానా' అనగానే, 'అక్కడే ఉండండి. మీకోసం కారు పంపిస్తాం' అన్నారు. నాకు బాగా గుర్తు. ఎర్ర మారుతి కారులో ఒకతను వచ్చారు. ఆయనే నిర్మాత పోకూరి బాబూరావు. ఈతరం ఫిలిమ్స్ పతాకంపై ఆయన చాలా సినిమాలు తీశారు. ఇప్పటికీ తీస్తూనే ఉన్నారు. సెంట్రల్ స్టేషన్‌నుంచి నన్ను ఈతరం ఆఫీసుకు తీసుకెళ్ళారు. అక్కడే స్నానం చేసి, బట్టలు మార్చుకున్నా. అక్కడి నుంచి కంపెనీ ఆఫీసుకు తీసుకెళ్ళారు. అక్కడ వై.హరికృష్ణగారు, ఆయన పక్కనే టి.కృష్ణగారు ఉన్నారు. 'మనం వేషం అనుకున్నాం కదా. అది వేస్తున్నారాయన' అని అక్కడున్నవారికి టి.కృష్ణగారు పరిచయం చేశారు. 'ఆయనకు డేట్లు ఇచ్చి, అడ్వాన్స్ ఇచ్చి పంపండి' అని నిర్మాతగారిని చూసి చెప్పారు. 22 రోజులేమో డేట్లు తీసుకున్నారు. అడ్వాన్స్ కూడా ఇచ్చారు. అడ్వాన్స్, పారితోషికం అంతా కలిసి అప్పట్లో 2,500 రూపాయలు ఇచ్చారు.



### అది భగవంతుడి స్క్రీన్‌ప్లే

'వందేమాతరం' సినిమా చేసేటప్పుడు విజయ శాంతికి రత్నం అని మేకప్‌మ్యాన్ ఉండేవాడు. తర్వాత పెద్ద ప్రొడ్యూసర్ కూడా అయ్యాడాయన. 'ఎందుకైనా మంచిది ఈయన ఫేస్‌కి విగ్ పెడితే బావుంటుంది' అని నాకు విగ్ పెట్టాడు రత్నం. విగ్ ఎందుకా? అనుకున్నా. కానీ ఆ సినిమా క్లైమాక్స్ షూటింగ్ జరుగుతున్న సమయంలో మా నాన్నగారు చనిపోయారు. ఏం చేయాలో అర్థం కాలేదు. అపరకర్మలు చేసినప్పుడు గుండు, పిలకా.. తప్పదు. ఎలాగా? అని ఆలోచించా. ఆ సమయంలో విగ్ గుర్తుకొచ్చింది. 'విగ్ ఎంత సేవ్ చేసిందీ' అనుకున్నా. ఏదో సామెత చెప్తారే.. కలిసొచ్చే కాలంలో నడిచొచ్చే కొడుకు పుడతాడనీ.. అది నా గొప్పతనం కాదు. ఎవరి గొప్పతనమూ కాదు. అది ఆ టైమ్. సక్సెస్‌కి వెనకాల తప్పకుండా ఓ పద్ధతి ఉంటుంది. అదే భగవంతుడి స్క్రీన్‌ప్లే. అది నేను బాగా నమ్ముతాను. అలాంటివి నమ్మకుండా మన ప్రమేయంతో పెట్టుకుంటే మనకి టెన్షన్ అండీ.

### ఆ విషయం జీవితతో చాలాసార్లు చెప్పా

యాంగ్రీ యంగ్‌మ్యాన్ రాజశేఖర్‌కి 'వందేమాతరం' మొదటి సినిమా. నాది కూడా మంచి వేషం. టి.కృష్ణగారికి బాగా నచ్చింది. ఆ సినిమా చేస్తున్నన్ని రోజులూ నేను చెన్నై పాండిబజార్ లోని ఓ హోటల్‌లో ఉండేవాణ్ణి. ఓ రోజు అక్కడ ఏం తిన్నానో ఏమో ఒళ్ళంతా వాచింది. అప్పుడే రాజశేఖర్ వచ్చాడు. నన్ను చూసి 'ఇదేంటి? ఇలా ఉబ్బిపోతున్నారు' అని అడిగాడు. 'నాకేం అర్థం కావడం లేదు. ఉన్నట్టుండి ఇలా అవుతున్నా' అని చెప్పా. కాసేపటికి స్పృహ కోల్పోయినంత పని జరిగింది. ఏమనుకున్నాడో ఏమో వెంటనే నన్ను లేవదీశాడు రాజశేఖర్. ఆయన డాక్టర్ కాబట్టి వెంటనే నన్ను చేయి పట్టుకుని కిందికి తీసుకొచ్చి ఆటోఎక్కించి డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళాడు. లేకుంటే నేను తాత్సారం చేసుండేవాణ్ణి. అప్పుడు ఏం జరిగేదో ఏమో? ఇప్పటికీ రాజశేఖర్ కనిపిస్తే ఆ విషయమే గుర్తు చేస్తుంటా.





జీవితతో కూడా చాలా సార్లు చెప్పా.

ఈ సినిమా గురించి ఇంకో విషయం చెప్పుకోవాలి. సి.నారాయణరెడ్డిగారు రాసిన 'వందేమాతరం... వందేమాతరం... వందేమాతర గీతం వరస మారుతున్నదీ.. తరం మారుతున్నది ఆ స్వరం మారుతున్నది' అనే పాటను అంతకు ముందు ప్రజానాట్యమండలి కార్యక్రమాల కోసం శ్రీనివాస్ పాడేవారు. ఈ చిత్రంలో ఆ పాట పాడి 'వందేమాతరం' శ్రీనివాస్ అయ్యారు. సరే... అలా ఆ సినిమా షూటింగ్ పూర్తి చేసుకుని నేను హైదరాబాద్‌కు వచ్చేశా.

## 'ప్రతిఘటన'లో నా అసలుపాత్ర రెండు నిమిషాలే!

'వందేమాతరం' పోస్ట్ ప్రొడక్షన్ పనుల్లో ఉండగానే టి.కృష్ణగారు 'ప్రతిఘటన' సినిమా మొదలుపెట్టారు. ఆ విషయం నాక్కూడా తెలిసింది. ఓ రోజు మధ్యాహ్నం నేను బ్యాంకులో ఉండగా ఫోన్ వచ్చింది. ఆయన పేరు చారి అనో, స్వామి అనో చెప్పారు. సరిగా గుర్తులేదు. 'ఇలాగ... ఉషాకిరణ్ సంస్థ నుంచి మాట్లాడుతున్నాను.. టి.కృష్ణగారు మీకోసం ఫోన్ చేశారు. మిమ్మల్ని అర్జంటుగా వైజాగ్ పంపమన్నారు. అక్కడ ఓ సినిమా షూటింగ్ జరుగుతోంది. మీరు రావాలి' అని చెప్పారు. 'సరే బయలుదేరుతానులెండి' అని చెప్పా. బ్యాంక్ మేనేజర్ దగ్గరికివెళ్ళి విషయం చెప్పి సెలవు తీసుకుని బయలుదేరా. అది గోదావరి ఎక్స్‌ప్రెస్ వేసిన కొత్త. ఆ రైలుకు అప్పట్లో మంచి క్రేజ్. దాన్లో ఎక్కి వెళ్ళా. సినిమా యూనిట్ అంతా వైజాగ్‌లో 'ఓషన్ వ్యూ' హోటల్‌లో ఉండేది. నేను రైలు దిగాను. నాకు కారు పంపిస్తే ఆ హోటల్‌కి వెళ్ళి టి.కృష్ణగారిని కలిశా. నన్ను చూడగానే 'వందేమాతరం' లో మీ పోర్షన్ చాలా బావుందండీ, చాలా బాగా చేశారు, తప్పకుండా మంచిపేరు వస్తుంది. నేనిప్పుడే చెబుతున్నా. ఈ సినిమాకు మీరేం ఎక్స్‌పెక్ట్ చేయకండీ. స్క్రీన్‌మీద ఓన్లీ టూ మినిట్స్ కనిపిస్తారు. అదీ క్లైమాక్స్ సీన్‌లో' అన్నారు. అయితే, ఆ తర్వాత విడుదలైన 'ప్రతిఘటన'లో టి.కృష్ణగారు నాకు మొదట చెప్పిన సీను లేదు. 'నేను రౌడీకి సీటు ఇస్తున్నాను. ఎమ్మెల్యేగా నిలబడుతున్నాడు. తప్పకుండా మీరు ఓటేయండి' అని మూడు మాటలు చెప్పాలండీ. అదే వేషం. వేస్తారు కదా? అని మొదట నాతో అన్నారు టి.కృష్ణగారు. 'వేస్తానండీ. వచ్చాను కదా. తప్పకుండా వేస్తాను' అని చెప్పి హోటల్‌కి వెళ్ళా.

**పి.ఎల్.నారాయణగారితో కోట శ్రీనివాసరావుగారికి ముందునుంచే పరిచయం. ప్రతిఘటన సినిమా షూటింగ్ సందర్భంగా వీళ్ళిద్దరూ ఒకే హోటల్ రూములో ఉన్నారు. ఆ సమయంలో వాళ్ళ మధ్య జరిగిన సంభాషణను దైవ ఘటనగానే భావిస్తారు శ్రీనివాసరావుగారు. ఎందుకంటే ఆ చిత్రంలో ఆయన పాత్ర నిడివి పెరగడానికి కారణం ఆ సంభాషణే! ఈ చిత్రమే శ్రీనివాసరావుగారి జీవితాన్ని మలుపు తిప్పింది.**

ఆ రాత్రి ఆయన నా దగ్గరకువచ్చి 'రేపు మీ సీన్లు తీయట్లేదండీ. కొంచెం ఇబ్బంది వచ్చింది. ఒక్కరోజు మీరు ఆగాల్సి ఉంటుంది, పర్వాలేదు కదా' అని అడిగారు. 'దానిదేముందండీ. పర్వాలేదు' అని చెప్పా.

## భలే చెప్పావురా అని మెచ్చుకున్న పి.ఎల్

ఆ రాత్రి పన్నెండింటికి నా రూమ్‌కి పి.ఎల్. నారాయణ వచ్చాడు. అప్పుడర్థమైంది నాకు నన్ను పి.ఎల్. రూమ్‌లోనే పెట్టారని. పి.ఎల్‌తో అంతకు ముందే నాకు పరిచయం. అదీ ఇదీ పిచ్చాపాటీగా మాట్లాడుకున్నాం. 'ఏంర్రా... నువ్వు ఇంత సాఫ్ట్‌గా మాట్లాడితే ఎట్టా? నువ్వుంటే హుషారుంటుంది. చుట్టూ సందడి ఉంటుంది. రూమ్ ఇంత బోసిపోవడం నాకిష్టం లేదు. ఏదీ.. తెలంగాణ యాసలో రామాయణం చెప్పావ్‌గా ... ఇప్పుడో సారి చెప్పు.' అన్నాడు. అడగంగా అడగంగా ఒప్పుకుని మొదలుపెట్టా. బాగా ఊపందుకుని చెప్తుంటే, మధ్యలో అందుకుని 'సోదర సోదరీ మణులారా అందరికీ నమస్కారం అంటాం కదా. అదే మాటని తెలంగాణ యాసలో చెబితే ఎలా ఉంటుంది? ఒకసారి అనవా? అని అడిగాడు. ఎందుకొచ్చిందోనండీ అతనికి ఆ ఆలోచన! మనకి అర్థం కాదు. భగవంతుడి దయే అనుకుంటా. 'మీ అమ్మలకి, మీ అక్కలకి, మీ నాయనలకి అందరికీ పెడతాండా దండం' అన్నా. ఆ ఒక్క వాక్కు విని 'భలే చెప్పావురా' అని మెచ్చుకున్నాడు. నాటకాల్లో అప్పటికే మంచి పేరున్నవాణ్ణి. సినిమాలకు కొత్త. నాకు 37, 38 ఏళ్ళు ఉండేవి. మంచి ఊపుమీద ఉండేవాణ్ణి. ఎక్కడా బెరుకులేదు. పి.యల్. ఇంకోసారి చెప్పమని అడగ్గానే చెప్పేశా.

## టి.కృష్ణగారికి కొత్త థాట్ స్క్రిప్టులో మార్పులు

ఒక్క నిమిషం ఉండు అని టి.కృష్ణగారికి ఫోన్ చేశాడు పి.ఎల్.నారాయణ. ఆయనొచ్చి 'ఏంది నారాయణ' అన్నారు. 'ఇప్పుడు చెప్తాడు చూడు మనోడు' అని నన్ను చూసి 'అందుకోరా' అన్నాడు. నేను మంచి ఊపుమీద ఆ డైలాగు చెప్పా. ఆయన విని కామ్‌గా వెళ్ళిపోయారు. 'అర్ధరాత్రి దాటిన తర్వాత ఆయన్ని పిలిచావు. ఆయనేమో ఏమీ అనకుండా వెళ్ళిపోయాడు. ఆయనకి నచ్చలేదేమో. ఇప్పుడెందుకు' అన్నాను నేను. 'ఉండు. టి.కృష్ణగారి సంగతి నీకు తెలియదురా. నచ్చకపోతే బాలేదని మొహమ్మీదే చెప్పేస్తారు. అలాంటిది ఏమీ మాట్లాడకుండా వెళ్ళారంటే ఏదో ఉంది. చూడు.. పావుగంటలో ఏదో చెప్తారు' అన్నాడు. వాడు అన్నట్టుగానే పావుగంటలో టి.కృష్ణగారు సబ్జెక్ట్ ఫైల్ పట్టుకుని వచ్చారు. పి.యల్.కి అప్పటికే ఆ సబ్జెక్ట్ మొత్తం తెలుసు. 'భలే ఉంది ఐడియా. మంచి థాట్ వచ్చింది. . నన్ను పిలిచి చాలా మంచి పనిచేశావ్. సబ్జెక్ట్ మొత్తం నీకు తెలుసు కదా అంకుల్. ఇది చదివి ఈయన పాత్ర ఎక్కడెక్కడ ఇరికించగలమో.. మొత్తం ఇరికించెయ్' అన్నారు. నాకు దడ వచ్చేసింది. ఆ రోజు రాత్రి 12.30 నుంచి ఒంటిగంట మధ్యన మొదలుపెట్టాడు పి.యల్. తెల్లారుజామున ఐదు దాకా మొత్తం ఎనిమిదో తొమ్మిదో సీన్లు రాశాడు. కృష్ణగారు అన్నిటినీ చెక్‌చేసుకుని ఓకే చేశారు. పాత్ర నిడివి పెరగడంతో బ్యాంకుకు అదనంగా సెలవు పెట్టాల్సి వచ్చింది. అయినా సరే సెలవుపెట్టి వైజాగ్‌లోనే ఉండి నాలుగైదు రోజులు షూటింగ్ వర్క్ పూర్తి చేశా. ఆ రోజుల్లో సీన్లు చాలా త్వరగా తీసేవాళ్ళు. అందులోనూ కృష్ణగారి ప్లానింగ్ చాలా కచ్చితంగా ఉండేది. ఆయన భావాలు చాలా ప్రత్యేకంగా ఉండేవి. ఆయన సినిమాల్లో సమస్యను చర్చించడం మాత్రమే కాదు. మంచో చెడో ఇలా ఉంటే బావుంటుందని ఆన్సర్ కూడా చెప్పేవారు. మహానుభావుడు తొందరగా కన్నుమూశారుగానీ ఆయనే ఉంటే నాకు ఇంకా రకరకాల పాత్రలు ఇచ్చేవారండీ. ప్చ్! సర్లెండి. అలా ముందుగానే నేను చెప్పినట్టు, నేను సినిమాను వెతుక్కుంటూ ఏ రోజూ అడుగు వేయలేదు. కానీ అలా... సినిమాయే నన్ను పిలిచింది.

**(ఇంకావుంది)**

**-డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**వెటర్నరీ డాక్టర్ పశువులకు ఇంజక్షన్ చేసే దృశ్యం వెంటనే మెదిలింది, వెట్టి కనుల ముందు. బాధ భరించటం అసాధ్యమనే అనిపించింది.**

**'అయిపోయిందా? పిలవమంటారా వాళ్ళని?' డాక్టరుగార్ని అడిగింది. వెట్టి తొడల మీద చెయ్యి వేసి బలంగా అదిమి పట్టుకున్న నర్సు.**

**'కొంచెం ఆగు. మినిమమ్ నాలుగు నిమిషాలు పడుతుంది పారలైజ్ కావటానికీ' సమాధానం ఇచ్చాడు డాక్టరు.**

పళ్ళు బిగపట్టి ఉన్న వెట్టికి వెంటనే అయింది జ్ఞానోదయం.

'మత్తు ఇంజక్షన్ ఇచ్చారు. తన కాలిమీది గాయం తగ్గటానికి కాదు. తను కాళ్ళుచేతులు కదలకుండా పడి ఉన్నప్పుడు ఎవరికో అప్పచెప్ప బోతున్నారు. డెఫినెట్‌గా తన పగవాళ్ళకే! సందేహం లేదు...'

చిన్నతనంలో ఎప్పుడో ఏదో రోగానికి తమ ఊళ్ళో వైద్యుడు కాల్షియం ఇంజక్షన్ చేసినప్పుడు ఒళ్ళు సెగలు పొగలు కక్కినట్టు ఒక్కసారిగా స్టార్ట్ అయింది వేడి అతని పాదాల దగ్గర్నుంచి.

గుండెలు జలదరించే లెవెల్లో పొలికేక పెట్టాడు. పిడికిలి బిగించి, తన పక్కనే నిలబడి ఉన్న నర్సు నడుము మీద బలంగా పొడిచాడు.

బిత్తరపోయింది ఆమె. అతను అంత వయొలెంట్‌గా రియాక్ట్ అవుతాడని అనుకోలేదు కాబోలు, బ్యాలెన్స్‌డ్‌గా నిలబడలేక ఒక పక్కకు పడిపోయింది.

ఏటవాలు ప్రదేశంలో పడకేసిన తాటిబొత్తం మాదిరి ఎగ్జామినేషన్ టేబుల్ మీది నుంచి బర్రున పక్కకు దొర్లాడు అతను. పాదాలు కింద ఆనగానే, ఆశ్చర్యంగా చూస్తున్న డాక్టర్ గుండెల మీద తలతో పొడిచాడు.

అరవటం చేత కాలేదు డాక్టర్‌కి. పెద్దగా మూలిగినట్టు వికృత శబ్దం మాత్రం వచ్చింది పెదవుల మధ్యలోంచి.

'నువ్వు అడిగినంత ఇచ్చాను. నిన్ను నమ్మి నీ దగ్గరికి వచ్చాను. నిలువునా మోసం చేస్తావా? అయిపోయావు రోరేయ్... నువ్వు ఇవాళ నా చేతుల్లో చచ్చిపోబోతున్నావు." అంటూ వాష్ బేసిన్ ఉన్న స్టాండును పట్టుకుని అతని తల మీద వేయబోయాడు.

'అయ్యో... అయ్యయ్యో' అని అరిచింది, నోరు పెగల్చుకున్న నర్సు.

డాక్టర్‌ని వదిలేసి గిర్రున తిరిగాడతను, ఆమె వైపు. 'ఆడదానివేనా? నువ్వసలు మనిషివేనా? ఈ ఎదవనా బిడ్డ సొమ్ములకోసం కక్కుర్తిపడితే పడి ఉండవచ్చు. ఏమైపోయింది నీ ఆడతనం?' అంటూ బలంగా వేశాడు ఒక్క వేటు.

తగిలుంటే ఆమె తల రెండుగా విచ్చిపోయి ఉండేది. గాయపడిన పాదాన్ని గురించి మర్చిపోయాడతను. ఆ పాదం మీదే బరువును మోపడంతో, తూలి పక్కకు పడ్డాడు.

నర్సు బతికి పోయింది. ఎగ్జామినేషన్ టేబుల్ మీద పడింది దెబ్బ.

'రండి.. రండి.. పేషంట్‌కి పిచ్చి ఎక్కింది' అంటూ తన గది తలుపుల దగ్గరికి పరిగెత్త బోయాడు, తేరుకున్న డాక్టరు.

టైట్‌గా మూసి ఉన్న తలుపుల్ని తెరిచి బయటి నుంచి సహాయం పొందవలసిన అవసరం లేక పోయింది.

కత్తులుపెట్టి పొడిచినంత బాధను, కనిపిస్తున్న పాదాన్ని వెనక్కి తీసుకుని, వెట్టి స్పీడ్‌గా నిలబడే ప్రయత్నం చేస్తుండగానే, పనిచేయటం మొదలు పెట్టింది డాక్టర్ చేసిన ఇంజక్షన్.

కళ్ళ ముందు నల్లటి సిల్కు పరదాలు వేలాడుతున్న సెన్సేషన్ కలుగుతూ ఉండగా - నిలుచున్నవాడు నిలుచున్నట్టే కిందికి జారిపోయాడు. తల నేలను ఆనుకోకముందే స్పృహ తప్పిపోయింది.

'హాస్పిటల్ బయట నిలబడి ఉంటారు. పక్కనే అంబులెన్స్ ఉంటుంది. త్వరగా పిలువ్' తలుపులు తెరిచి సహాయం కోసం గావుకేకలు పెట్టాలన్న ఆలోచనను వదిలేసి నర్సుకు చెప్పాడు డాక్టర్.

'ఈ దొంగ సచ్చినోడు... కాస్తలో నా తల పగిలి పోయేది. ఈడికి ఇట్టాంటి గతే పట్టాలి. ఇట్టాంటిదే కాదు. ఇంకా ఎక్కువే పట్టాలి' తన వృత్తి ఎటువంటిదో మర్చిపోయి, నీచంగా మాట్లాడుతూ గది బైటికి పోయింది నర్సు.



**జరిగిన కథ**

*గూం*డా ముఠాలకు కనిపించకుండా తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. నాగదేవతగా చెప్పుకుంటున్న ఒక అమ్మి వెట్టికి పరిచయమవుతుంది. వెట్టిని తన ఇంటికి తీసుకెళ్ళి ఆశ్రయమిస్తుంది. కదిరి ఎస్టేటుకు బయలుదేరివెళ్ళిన ఆమె కూతురు ప్రణవి వెంట సెక్యూరిటీగా వెళతాడు వెట్టి. అతన్ని ఎక్కడో చూసినట్టనిపిస్తుంది బాజిరెడ్డికి. కానీ గుర్తురాదు. వెట్టి అసలుపేరు విఠల్‌రెడ్డి. ఇంజనీరింగ్ ఫైనలియర్ స్టూడెంట్. కాలేజీలో ఆడపిల్లను అల్లరిచేయబోయిన బాజిరెడ్డి కొడుకు పఠాన్‌కు దేహశుద్ధి చేస్తాడు. అతడి మనుషులు మర్నాడు విఠల్‌రెడ్డిపై బాంబులతో దాడి చేస్తారు. తెలివిగా తప్పించుకున్నప్పటికీ, ఊరు వదిలి పారిపోయేందుకు మారువేషం వేసుకుంటాడు. కానీ అంతలోనే బాజిరెడ్డి, అతడి మనుషుల కళ్ళబడతాడు. ఆ తర్వాత......

రెండు నిమిషాలు పూర్తిగా గడవకముందే, స్ట్రెచర్ నొకదాన్ని తీసుకుని ఆ గదిలోకి వచ్చేశారు నలుగురు దృఢకాయులు. వారి వెనుకే వచ్చాడు ఒక సన్నపాటి మనిషి.

'క్విక్.. క్విక్... ఆలస్యం చేస్తే మా వాళ్ళందరికీ అనుమానం వచ్చేస్తుంది. క్విక్' హడావుడిగా హెచ్చరించాడు డాక్టరు.

ఎగ్జామినేషన్ టేబుల్ దగ్గర పడిపోయిన వెట్టిని స్ట్రెచర్ మీద పడుకోబెట్టి, యమస్పీడుగా బయటికి తీసుకుపోయారు దృఢకాయులు.

'ఉన్నట్లుండి సీరియస్ అయ్యింది. ఇక్కడ సరైన ఫెసిలిటీస్ లేవు. ఇంకో హాస్పిటల్‌కి పంపిస్తున్నాము'. విజిటర్స్ కూర్చునే ఏరియాలో విచిత్రంగా చూస్తున్న కొంతమందికి చాలా కన్విన్సింగ్‌గా చెప్పాడు డాక్టరు. తాను మెయిన్ ఎంట్రన్స్ దగ్గర నిలబడి, స్ట్రెచర్‌ని అంబులెన్స్‌లోకి చేర్చే వరకూ అబ్జర్వ్ చేసి, తేలికగా నిట్టూరుస్తూ, అప్పుడు తిరిగి వచ్చాడు తన గదిలోకి.

తన జేబులో నుంచి నాలుగు నోట్లు తీసి అతని చేతిలో పెట్టాడు లోపలే ఉండిపోయిన సన్నపాటి మనిషి.

'ఇదేమిటీ? ఇంత తక్కువ?' కోపంగా అడిగాడు డాక్టరు.

'నువ్వు వాడికి చేసిన ఇంజక్షన్ పదిహేను రూపాయలకు మించదు. ఎగ్జామినేషన్ ఫీజు మూడు వందలు... సరిగ్గానే ఇచ్చాను. లెక్క చూసుకో' అంటూ గది బైటకు బయలుదేరాడు సన్నపాటి మనిషి.

'నర్సుకి.. నర్సుకి కూడా ఇవ్వాలి' అబ్జెక్ట్ చేశాడు డాక్టరు.

'నువ్వే ఇచ్చుకో. మన ఒప్పందంలో నర్సు మాట లేదు' అంటూ మరింత వేగంగా వెళ్ళిపోయాడు సన్నపాటి మనిషి.

నోరు తెరుచుకు చూస్తూ నిలబడిపోయిన డాక్టర్ చేతుల్లోని నోట్లు తీసుకుని తన యూనిఫామ్‌లో దాచుకుంది బైటి నుంచి వచ్చిన నర్సు.

●●●

ఫక్కున నవ్వింది చాలా శ్రద్ధగా వింటున్న ప్రణవి. 'జరిగింది అంతా ఏదో సినిమాకథ మాదిరిగానే ఉందిగాని, ఆ వచ్చిన వాళ్ళు డాక్టరు నెత్తిమీద చేతులు పెట్టినట్టు నీకు ఎలా తెలిసింది? నువ్వు తెలివితప్పి పడిపోయావు గదా... పైగా గదిలో లేవు. అంబులెన్స్‌లో ఉన్నావు' అన్నది.

'నువ్వు ఆగు తల్లీ. అతన్ని చెప్పనీ. మధ్యలో అడ్డం తగలకు' వెంటనే అబ్జెక్ట్ చేశాడు శంకరయ్య.

'నాకు తెలుసు. నేను చెపుతాను' అన్నది ప్రత్యూష.

ఆశ్చర్యంగా చూశారు అందరూ ఆమెవంక. 'నువ్వు చెపుతావా? నీకు ఎలా తెలిసింది?' అడిగింది శివారెడ్డి భార్య.

'ఇతను అంబులెన్స్‌లో నుంచి ఇంకెక్కడికి తీసుకుపోబడ్డాడో, ఆ తీసుకుపోబడిన ప్రదేశంలో ఏం జరిగిందో నాకు తెలియదుకాని, అక్కడినుంచి తప్పించుకున్న తర్వాత మొట్టమొదటగా అనంతపురమే పోయాడు. ఆ డాక్టరుగారిని, నర్సును మరోసారి కలుసుకున్నాడు.' నమ్మకంగా చెప్పింది ప్రత్యూష.

'ఏమిటబ్బయ్యా? అదేనా జరిగింది? అంతేనా?' ఆశ్చర్యంగా అడిగాడు శంకరయ్య.

తల ఊపాడు వెట్టి.

మూసి ఉన్న అవుట్‌హౌస్ తలుపులు సన్నగా శబ్దం చేశాయి. ఉలిక్కిపడి లేవబోయిన వెట్టిని, చే సైగతో ఆపేసింది శివారెడ్డి భార్య.

'కంగారు వద్దు. సంపంగి వచ్చి ఉంటుంది' అని చెప్పి 'రావే... లోపలికిరా' అని పిలిచింది. కుదురుగా కూర్చుని ఉన్న ప్రత్యూష వెళ్ళి తలుపులకు బిగించిన బోల్టును తొలగించగానే పెద్ద ట్రేలో టీ కప్పులు, బిస్కట్లు పెట్టుకుని లోపలికొచ్చింది సంపంగి.

'తల్లీ.. రోడ్డుమీద బాజిరెడ్డిసారు కారు డ్రైవర్ నిలబడి ఉన్నాడు' వస్తూనే రిపోర్టు చేసింది.

పళ్ళు బిగపట్టేశాడు వెట్టి. చర్రున కూర్చున్న



చోటునుంచి లేవబోయాడు. 'వద్దు.. వాడు లోప లికిరాడు. చీకటి పడిన తర్వాత మెయిన్‌గేటు దాటి లోపలికి వచ్చే ధైర్యం వాడికేకాదు, వాడి యజమానికి కూడా లేదు' అంటూ వారించింది శివారెడ్డి భార్య.

'పెద్దమ్మాయిగారిని తీసుకురావటానికి రమ ణయ్య పంతులు బయలుదేరాడో లేదో గమనించ టానికి కాపలా పెట్టబడినట్లుంది. పంతులుగారు వెళ్ళిపోయిన సంగతి తెలియకపోవటం వల్లనా?' తనలో తను అనుకుంటున్నట్లు పైకే అన్నాడు శంకరయ్య.

'అదేం కాదు. ఆయన వెనుకే నేను కూడా మాయం అయిపోతానని భయం. అందుకే, కాపలా కాదు నిఘా పెట్టాడు' కచ్చగా అన్నది ప్రణవి.

'అనవసరమైన మాటలు మాట్లాడకుండా ముందు టీ తాగండి' హెచ్చరించింది శివారెడ్డి భార్య.

ఖాళీ కప్పుల్ని ట్రేలో పెట్టుకుని సంపంగి బైటికి వెళ్ళిపోగానే తిరిగి తలుపులు మూసి బోల్టు బిగిం చింది ప్రత్యూష.

'ఇంక మొదలుపెట్టు అబ్బయ్యా' వెట్టిని ప్రాంప్ట్ చేశాడు శంకరయ్య.

చిన్నగా దగ్గి గొంతు సవరించుకున్నాడు వెట్టి. మాటలు మొదలుపెట్టబోతూ ఆ హాలును ఆను కుని ఉన్న ఇంకో గదివైపు చూశాడు.

బార్లా తెరిచి ఉన్నాయి ఆ గది తలుపులు. సరిగ్గా ఒక తలుపుమీది నుంచి కిందికి జారుతూ కనిపించింది అతనికి ఒక పాము.

పామంటే పాము కాదు అది. బ్రహ్మాండమైన నాగుపాము! నల్లగా నిగనిగ మెరిసిపోతోంది. దగ్గర దగ్గరగా రెండు బారల పొడవు ఉన్నది.

## కొంచెం లేటైనా లేటెస్ట్‌గానే!



హెబ్బాపటేల్... ఈ పేరును టాలీవుడ్ ప్రేక్ష కులు దాదాపు మరిచిపోయే పరిస్థితి వచ్చేసింది. ఈ సమయంలో తను తెరమరుగు కాలేదు అంటోంది హెబ్బాపటేల్! 'ఈడో రకం ఆడో రకం' తరువాత హెబ్బా వార్తలు పెద్దగా వినిపించలేదు. ఇప్పుడు 'నేనూ నా బాయ్‌ఫ్రెండ్స్' సినిమాతో మరోసారి వార్తల్లోకి వచ్చింది. ఈ సినిమాలో తన గ్లామరుకు ప్రేక్షకులు ఫిదా అయిపోతారని చెబు తోంది. కొంచెం లేటుగా వచ్చినా లేటెస్ట్‌గా కనిపిస్తా ననీ, ఈ సినిమా తరువాత మరికొన్ని సినిమాలు కచ్చితంగా వస్తాయని అంటోంది. 'కుమారి 21ఎఫ్' లాంటి హిట్ సినిమా తరువాత పెద్దగా అవకా శాలు చేజిక్కించుకోలేకపోయిన హెబ్బా, ఈ సినిమా తరువాత బిజీ అవుతుందంటే ఎలా నమ్మడం అంటున్నారు టాలీవుడ్ జనాలు.

'ఏంటి చూస్తున్నావు అబ్బయ్యా. ఏముంది అక్కడ?' ఆశ్చర్యంగా అడుగుతున్న శంకరయ్యకు చేతిని జాచి మరీ చూపించాడు అతను.

ఏముంది అబ్బయ్యా? నీకు ఏం కనిపిస్తోంది?' ఆశ్చర్యం కాస్తా అయోమయంగా మారుతుండగా అడిగాడు శంకరయ్య.

తలుపు మీది నుంచి పూర్తిగా కిందికి జారింది ఆ పాము. రెండు జానెల వెడల్పున పడగ విప్పి రెండుసార్లు అటూ ఇటూ ఊపింది.

'పాము సారూ... పెద్ద తాచుపాము.. కని పించటం లేదా?' అని అడుగుతూ చివాలున కుర్చీ లోంచి లేచాడు వెట్టి.

నేరేడు పళ్ళ మాదిరి నిగనిగలాడిపోతున్న కనులతో అతని వంక చూసింది అది. బుస్సున శబ్దం చేసి గదిలోకి జారుకుంటూ వెళ్ళిపోయింది.

'పాము ఏది అబ్బయ్యా? ఎక్కడ?' శంకరయ్య కూడా లేచాడు. వెట్టి వెనకే ఆ గది గుమ్మం దగ్గ రికి పోయాడు.

మూడు లైట్లున్నాయి ఆ గదిలో. వాటన్నిటి స్విచ్చులను చిటుకుచిటుకున నొక్కాడు వెట్టి. పట్ట పగలు మాదిరి తయారైన ఆ గదిలో ఫర్నీచర్ ఏమీలేదు. పాము కూడా లేదు.

'నువ్వు ఏదో భ్రమపడ్డావు అబ్బయ్యా. దిట్టంగా ఉన్నయ్ ఈ ఇంటిగోడలు.. తలుపులన్నీ గట్టిగా మూసి గడియలు పెట్టి ఉన్నాయ్. పాములు కాదు గదా.. పురుగులు కూడా రాలేవు. పదపద' అంటూ అతని చేయి పట్టుకుని వెనక్కి తీసుకువచ్చాడు శంకరయ్య.

'విఠల్‌బాబూ... నిజంగానే చూశావా?' చిన్నగా అడిగింది ప్రణవి.

'నిజంగా చూడకపోతే అబద్ధంగా చూశాడని ఎలా అనుకుంటాము. అల్లిబిల్లి కదలికలకు ఝడుసు కునే రకం కాదు గదా! కర్రలు, తాళ్ళు ఏమీలేవు ఇక్కడ, భ్రమపడ్డాడనుకోవటానికి' కామెంట్ చేసింది ప్రత్యూష.

ఒక్క శివారెడ్డి భార్య మాత్రం తలను కూడా ఊపకుండా బొమ్మ మాదిరి కూర్చుండిపోయింది. ఆమె కలువ కన్నుల్లో స్వల్పంగా నీటితెర... అంద మైన మొఖంలో ఏదో అలజడి.

ఛట్‌మంటూ వెట్టి చెవుల్లో మార్మోగింది, అప్పుడ ప్పుడు పిచ్చమ్మి పెదవుల్లో నుంచి వెలువడే పూత్కారం!

తనకు కోపం వచ్చినప్పుడో, తనకు నచ్చని మాట చెవిన పడినప్పుడో, ఇప్పుడు కనిపించిన పాము శబ్దం చేసినట్టే ఉండేది ఆ చప్పుడు.

నిలబెట్టి గట్టిగా అడిగితే కారణం చెప్పలేనని తెలిసికూడా, క్షణం కూడా ఆలస్యం చేయలేదు వెట్టి.. 'తల్లీ.. ఒక్కసారి శివారెడ్డి సారు దగ్గరికి వెళ్ళిరండి' అన్నాడు ఆమెతో.

తటపటాయించలేదు ఆమె. వెంటనే లేచింది. పరిగెత్తుతున్నట్టుపోయి అంతకుముందే తలుపులకు బిగించిన బోల్టును పక్కకు లాగింది ప్రత్యూష. ప్రణవి వెనక నడుస్తుండగా మెయిన్ బిల్డింగ్‌లోకి పోయింది శివారెడ్డి భార్య.

'ఏంటి అబ్బయ్యా నీ అనుమానం?' అయోమయం గానే చూస్తూ అడిగాడు వెట్టిని, శంకరయ్య.

'అనుమానం అంటూ ఏమీలేదుగాని, ఏదో తేడా కొడుతున్నది' తను అనవసరంగా అందరినీ బెదర గొడుతున్నాడేమోనన్న అనుమానం మనసును కలచి వేస్తుండగా సమాధానం ఇచ్చాడు వెట్టి.

అతని మాటలు పూర్తిఅవటం.. ఎంట్రన్స్ దగ్గరికి ప్రత్యూష పరిగెత్తుకు రావటం ఒకేసారి జరిగింది.

'రావాలి.. త్వరగా రావాలి. శివారెడ్డిసారు పరి స్థితి బాగోలేదు' కంగారుగా అరిచింది ఆమె.

వింటి నుంచి వెలువడే బాణం కంటే వేగంగా పరుగు తీశాడు వెట్టి. ఆ వేగాన్ని అందుకోలేక శంకరయ్య పది గజాలు వెనకపడి పోవటాన్ని కూడా పట్టించుకోలేదు. అర నిమిషంలో శివారెడ్డి గదిలోకి ఎంటరై పాముకు బ్రేకులు పడినట్టు ఆగిపోయాడు.

**శివారెడ్డి అకస్మాత్తుగా గుండెపోటుకు గురయ్యాడు. వెట్టి అది గ్రహించి క్షణకాలం కూడా ఆలస్యం చేయకుండా అతణ్ణి హాస్పిటల్‌కు తరలించాడు. కొద్ది నిమిషాలు ఆలస్యమై ఉంటే శివారెడ్డి పరలోకానికి టపాకట్టేసేవాడే. వెట్టి అప్రమత్తతను డాక్టర్ మెచ్చుకున్నాడు. కానీ బాజిరెడ్డి ఆగ్రహంతో ఊగిపోయాడు. హాస్పిటల్‌కు వచ్చి ఎవడ్రానువ్వు? అని నిలదీశాడు. అప్పుడు వెట్టి ఏం చేశాడు? వారి మధ్య కొట్లాట జరిగిందా?**

ఊపిరి తీసుకోవటానికి పడరాని పాట్లు పడుతు న్నాడు బెడ్‌మీద ఉన్న శివారెడ్డి. వికృత శబ్దాలు చేస్తున్నాడు. ఎగిరెగిరి పడుతున్నాయి గుండెలు.

'డాక్టరు... డాక్టరుగారిని పిలిపించండి శంక రయ్య, త్వరగా' బుగ్గల మీదికి జారుతున్న కన్నీ టిని తుడుచుకోను కూడా తుడుచుకోకుండా గద్గ దంగా ఆర్డర్ ఇచ్చింది శివారెడ్డి భార్య.

'తల్లీ.. ఆక్సిజన్ అవసరం అవుతుంది. ఆ సరం జామా అంతా రెడీ చేసుకుని డాక్టరుగారు బయలు దేరేసరికి చాలా సమయం పడుతుంది. మీరు పక్కకు తప్పుకోండి' అంటూ బెడ్ దగ్గరికి పోయాడు వెట్టి.

'ప్రత్యూష... కారు స్టార్ట్ చేసి రెడీగా ఉంచు. శంకరయ్య సారూ, డాక్టర్‌కి మనం వస్తున్నామని ఫోన్ చేయండి' అంటూ ఎగిరెగిరి పడుతున్న శివా రెడ్డిని అమాంతంగా చేతుల్లోకి ఎత్తుకున్నాడు.

లేడిపిల్ల కంటే వేగంగా పరిగెత్తింది ప్రత్యూష. బిల్డింగ్ పక్కనే ఉన్న షెడ్‌లో నుంచి ఖరీదైన కారును స్టార్ట్ చేసి మెయిన్ ఎంట్రన్స్ దగ్గరికి తీసుకు వచ్చింది.

'నిన్నమొన్నటి వరకూ అచ్చంగా ఆటలు ఆడు కుంటూ తిరిగిన ఈ బిడ్డకు ఇంత చక్కగా కారును నడపటం ఎప్పుడు వచ్చిందో?' అని తనలో తను అనుకుంటూ, ముందు హాల్లో ఉన్న ఫోన్‌ని అందు కున్నాడు శంకరయ్య.

తను చెప్పినట్లు అతను చేస్తున్నాడో లేదో గమ నించలేదు వెట్టి. శివారెడ్డిని అలాగే చేతుల్లో ఎత్తు కుని కారులో కూర్చున్నాడు. శివారెడ్డి భార్య, ప్రణవి ఇద్దరూ ఎక్కి డోర్స్ క్లోజ్ చేసిన వెంటనే వేగంగా రోడ్డుమీదికి తీసుకుపోయింది ప్రత్యూష.

'ఏంటిది? ఏం జరిగింది?' అని అడుగుతూ అడ్డం రాబోయి, ఆ వేగాన్ని చూసి అవతలికి దూకాడు బాజిరెడ్డి డ్రైవర్.

'పోనీ... ఇంకా ఇంకా స్పీడ్‌గా..' హెచ్చరించాడు

వెట్టి.

పళ్ళు బిగించి యాక్సిలేటర్‌ని అదుముకుంటూ అదిమి పట్టుకుంది ప్రత్యూష. ఖచ్చితంగా ఆరు నిమిషాల తరువాత ఆగింది, వారి ఫ్యామిలీ డాక్టర్ రావ్ చేసే నర్సింగ్ హోమ్ ముందు.

●●●

'నిజంగా ఈరోజు చాలా మంచిరోజు మేడమ్. ఇంకొక్క నాలుగు నిమిషాలు లేటయ్యుంటే ఏం జరిగి ఉండేదో నేను చెప్పలేకపోతున్నా' ఒక గంట తరువాత ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో నుంచి బయటికి వస్తూ అన్నాడు డాక్టర్.

'అసలు ప్రాబ్లం ఏమిటి? ఇంతకుముందు ఎప్పుడూ ఇలా జరగలేదు' తడి కన్నులు తుడుచుకుంటూ అన్నది శివారెడ్డి భార్య,

'అయ్యో.. తల్లీ... హార్ట్‌ఎటాక్ వచ్చిందమ్మా! ఆ అబ్బి ఎవరోగాని చాలా ముందుచూపు ఉన్నవాడి మాదిరిగా కనిపిస్తున్నాడు. స్ట్రోక్ లక్షణాల్ని చటుక్కున పట్టేసి, నన్ను పిలిపించే పని పెట్టుకోకుండా ఇక్కడికి తీసుకు వచ్చేశాడు. నిజంగా మీరు లక్కీ... వెరీవెరీ లక్కీ...' అన్నాడు డాక్టరుగారు.

డాక్టరుగారు... ఇప్పటివరకూ శివారెడ్డి సారుకు కిడ్నీ ప్రాబ్లమ్స్ ఉన్నాయని చెప్పారు మీరు. ఇప్పుడు ఈ హార్టు ప్రాబ్లం రావడం ఏమిటి?' అప్పటివరకూ మౌనంగా ఉన్న శంకరయ్య మెల్లిగా అడిగాడు.

'అయ్యో పిచ్చి శంకరరెడ్డిసారూ.. మన సిస్టం రిపేర్స్‌కి రానేకూడదు... వచ్చిన తర్వాత ఎప్పుడు ఏ పార్టు డ్యామేజీకి గురవుతుందో చెప్పటం చాలా కష్టం. ఒక్కటి మాత్రం ఖచ్చితంగా చెపుతాను' అంటూ శివారెడ్డి భార్యవైపు చూశాడు డాక్టరుగారు. 'శివారెడ్డిసారు విపరీతమైన టెన్షన్ పడుతున్నాడు. ఏదో ప్రాబ్లం. అది హెల్తు ప్రాబ్లం కాదు. బహుశా ఫ్యామిలీ ప్రాబ్లం అయి ఉండవచ్చు. అదేమిటో తెలుసుకుని ముందు మీరు ధైర్యం చెప్పాలి. ఆయన టెన్షన్ వెంటనే తగ్గిపోవాలి. లేకపోతే మెడిసిన్స్ పని చేయవు' అన్నాడు.

శంకరయ్య వైపు చూసి మళ్ళీ కళ్ళు తుడుచుకున్నది శివారెడ్డి భార్య. 'అది తప్పకుండా ఆ బాజిరెడ్డి మూలంగానే వచ్చి ఉంటుంది. వాడి కొడుక్కి ప్రణవిని ఇచ్చి కట్టబెట్టడం ఆయనకి ఇష్టం లేదు. కాని వాడి మాట కాదని అనటం కూడా ఆయనకి చేతకావటం లేదు. వాడి ముదనష్టపు మొఖం చూసి ఎందుకు అలా ఒప్పేసుకుంటున్నారో అర్థం కావటం లేదు' గద్గదంగా అన్నది అతనికి మాత్రమే వినిపించేటట్టు.

'అవన్నీ ఇప్పుడు దేనికి తల్లీ. ముందు సారుకి మీరు ధైర్యం చెప్పండి. లేనిపోని కొత్త జబ్బులు కావాలని నెత్తిమీదికి తెచ్చుకోవద్దని నచ్చచెప్పండి' అన్నాడు శంకరయ్య. ఇంకా ఏదో చెప్పేవాడే. పరుగులాంటి నడకతో వస్తున్న బాజిరెడ్డిని చూసి మాటల్ని మింగేశాడు.

'పీకలమీదికి వచ్చేవరకూ మాట్లాడకుండా ఎవరు కూర్చోమన్నారు? ముందుగానే గమనించి డాక్టరు గారికి కబురు పంపిస్తే ఇంత గందరగోళం పడాల్సిన అవసరం ఉండేది కాదు గదా..' వస్తూనే వికృత కంఠంతో నిందలు మొదలు పెట్టాడు.

మురికినీటి చెరువు దగ్గర తన కాలికి దెబ్బ తగిలి పొదల్లో పడిపోయినప్పుడు వినవచ్చిన కంఠస్వరమే అది.

'వచ్చింది ఆషామాషీ నొప్పికాదు. గుండె నొప్పి. ఒకేసారి వస్తుంది. శివారెడ్డిసారు ఉన్న పరిస్థితిలో ముందస్తు హెచ్చరికలు ఉండవు. అన్నిబాధలు ఒకే మాదిరిగా కనిపిస్తాయి. దగ్గర ఉన్నా, పక్కన కూర్చున్నా కూడా ఎవరికీ ఏమీ తెలియదు' పక్కనే ఉన్న గోడకి చెప్పాడు సీరియస్‌గా.

'ఎవడ్రా నువ్వు? ఏమిటిరా వాగుడు?' చర్రున అతనికేసి తిరుగుతూ గంయ్‌మని అరిచాడు బాజిరెడ్డి.

'అమ్మా... మీరు శివారెడ్డిసారు దగ్గరికి వెళ్ళి రండి' శివారెడ్డి భార్య వైపు తిరిగి చెప్పాడు వెట్టి.

తటపటాయించింది ఆమె. నిస్సహాయంగా శంకరయ్య వైపు చూసింది. 'వెళ్ళి రండి తల్లీ' అన్నాడు అతను కూడా.

ఆమె అవతలికి పోయిన వెంటనే బాజిరెడ్డి దగ్గరికి జరిగాడు వెట్టి. 'ఏంటి సారూ... ఏదో అన్నారు? ఇంకోసారి అనండి' అన్నాడు.

'ఏంటి? ఏంటి నీ ఉద్దేశం?' ఒక అడుగు వెనక్కి వేస్తూ అడిగాడు బాజిరెడ్డి.

పాము తల కంటే వేగంగా కదిలింది వెట్టి చేయి. అతని షర్టు ముందు భాగాన్ని ఒడిసి పట్టుకుంది.

'నేను మీ మోచేతి కింది నీళ్ళు తాగటానికి రాలేదు. మా ప్రణవమ్మకి కాపలా వచ్చాను. నీ కిందవాళ్ళని బెదిరించినట్టు నన్ను కూడా బెదిరించాలని చూడకండి. మాటలు మర్యాదగా రానీయండి. నేను కూడా మీరు మాట్లాడినవే మాట్లాడితే, మీ బతుకు ఏమైపోతుందో ఆలోచించుకోండి' అంటూ చిన్నగా ఒక నెట్టు నెట్టాడు.

ఆ కాస్త ఒత్తిడికే వైల్డ్‌గా మారి వెనక ఉన్న గోడను ఆసరాగా చేసుకోవాల్సి వచ్చింది బాజిరెడ్డికి.

'నీ అంతు చూస్తానురా... వచ్చిన దారినే నిన్ను వెనక్కి తరిమేస్తాను' ఎర్రబడిన కళ్ళతో హెచ్చరించాడు బాజిరెడ్డి.

'నీ వల్ల అయ్యే పనికాదు అది. నేను వెనక్కి పోతే, పోయిన రెండో రోజుకల్లా పదిమంది ఫారెస్టు గార్డుల్ని వెంట బెట్టుకుని, సబ్బిరెడ్డిసారు వచ్చేస్తాడు. వట్టిగా రాడు. నన్ను కాలరు పట్టుకుని వెంటతీసుకువస్తాడు. అప్పుడు ఈ కథ మళ్ళీ మొదటికి వచ్చేస్తుంది' ప్యాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని నవ్వుతూ చెప్పాడు వెట్టి.

'నేను శివారెడ్డికి చెపుతాను. నీ అంతు చూస్తాను' సరైన బెదిరింపు నోటికి రాకపోవటంతో, నీరసంగా అన్నాడు బాజిరెడ్డి.

'సారూ... ఓ డాక్టరు సారూ..' దగ్గర్లోకి వచ్చిన డాక్టర్‌గారిని పిలిచాడు వెట్టి. 'మీరు బాగా ఆలోచించి చెప్పండి. నిన్న మా బాజిరెడ్డి సారుతో ఏదో విషయాన్ని గురించి మదన పడ్డాడు శివారెడ్డి సారు. ఇప్పుడు గనక ఈయన మొఖం కనిపిస్తే ఎలా ఉంటుంది పరిస్థితి?' వినయంగా అడిగాడు.

'నీ వంటి షార్ప్‌మైండ్ గల పర్సన్‌కి నేను చెప్పవలసిన అవసరం ఏముంది యంగ్‌మ్యాన్. ఇంకోవారం రోజుల పాటు బాజిరెడ్డి సారును ఆయన దగ్గరికి పోనీయద్దు. ఒకవేళ గట్టిగా అడిగితే అహోబిలంలో శాంతి పూజలు చేయించటానికి వెళ్ళాడని చెప్పండి. శివారెడ్డి సారుకు దేవుడంటే చాలా భక్తి' అంటూ అతనికి చెప్పటమే కాదు, బాజిరెడ్డి వైపు కూడా చూసి తల ఎగరేసి అవతలికి వెళ్ళిపోయాడు డాక్టరుగారు.

విపరీతమైన కోపంతో జెముడు కాకి ఏ రంగులో ఉంటుందో ఆ కలర్‌లోకి మారిపోయింది బాజిరెడ్డి మొఖం. పళ్ళు పటపటమని శబ్దం వచ్చేలా కొరుకుతూ, విసురుగా వెనక్కిపోయి దూరంగా ఉన్న కుర్చీలో కూలబడ్డాడు.

'శభాష్ అబ్బాయ్యా.. ఏం కొట్టావయ్యా దెబ్బ..




## పతనం

రాకెట్టులో వెళ్ళి
ఓజోన్‌కు అతుకు ముక్కను
కుట్టి వస్తాడనుకున్నాను
మనిషి!

చెట్టై మొలిచి
రహదారి బాటలో నడిచే తలలకి
నీడనిస్తాడనుకున్నాను
మనిషి!

మెట్టుగా నిలిచి
ఎదిగే కాళ్ళ ముందు ఒదిగి
ఊత మిస్తాడనుకున్నాను
మనిషి!

జట్టుగా కూడి
దేశ పతాక ఎగరటానికి
గాలై వీస్తాడనుకున్నాను
మనిషి!

గ్రెజర్ కుక్కలై
గుంపులో విస్ఫోటించి
మనిషిని ముక్కలుగా తరుగుతున్నాడు



మానవత్వం ముక్కుమీద
పిడిగుద్దై పోతున్నాడు
మనిషి తనం మంచు పర్వతమై
కరిగి పోతున్నాడు

**-ఈతకోట సుబ్బారావు,**
**సెల్: 94405 29785**

గింగిరాలు తిరిగిపోయాడు పెద్దమనిషి. ఇంతకాలం నుంచీ మేం ఎవ్వరం చెయ్యలేని పనిని చిటికెలో చేసేశావు. బాజిరెడ్డి మూతికి తాటాకు బుట్ట కట్టేశావు' తన సంతోషాన్ని బైటకి కనిపించకుండా, జాగ్రత్తలు తీసుకుంటూ మహదానందంగా అన్నాడు శంకరయ్య.

దీర్ఘంగా నిట్టూర్చి గోడకి చేరగిలబడ్డాడు వెట్టి.

'ఏంటబ్బయ్యా... నీరసపడి పోయావేంటి? ఆశ్చర్యంగా అడిగాడు శంకరయ్య.

'నీరసం కాదుగాని, నా తల్లి గనుక ఇప్పుడు ఇక్కడ ఉండి ఉంటే పరిస్థితి ఎంత రంజుగా ఉండి ఉండేదో అనిపించింది' అన్నాడు వెట్టి.

'ఎవరు? జయమ్మ తల్లా?' అడిగాడు శంకరయ్య.

అవునన్నట్లు తల ఊపాడు వెట్టి.

'బాజిరెడ్డి సారు కూడా శివారెడ్డి పక్కనే బెడ్డు మీద పడిపోయేవాడు. తాచుపాము ఎలుకల్ని విదిలించినట్టు విదిలించి కొట్టేసేది' అరమూసిన కనులతో చెప్పాడు శంకరయ్య.

శివారెడ్డిని పడుకోబెట్టిన యూనిట్‌లో నుంచి ప్రణవీ, ప్రత్యూష బయటికి రావటంతో ఆగింది వారి సంభాషణ. దూరంగా కూర్చొనివున్న బాజిరెడ్డి గబగబా వస్తూ ఉండటాన్ని గమనించి, చిన్నగా పెదవులు విరిచాడు వెట్టి, ప్రత్యూషకి మాత్రమే కనిపించేట్టు.

'ఎలా ఉంది? నేను వెళ్ళి చూడవచ్చునా?' ఆత్రుతగా అడిగాడు బాజిరెడ్డి.




'అన్నయ్య కండిషన్ స్టడీగా ఉంది. ప్రమాదం తప్పిపోయింది. టెన్షన్ పెట్టే విషయాలు ఏమీ చెప్పొద్దని అంటున్నారు' ముక్తసరిగా అన్నది ప్రణవి.

'ఎస్టేట్ మాటలు అస్సలు మాట్లాడవద్దని చెప్పారు. పెళ్ళిళ్ళు పేరంటాలు మాటలు జరిగాయని డాక్టరు గారికి ఎవరు చెప్పారోగాని, ఆ మాటలు అస్సలు మాట్లాడవద్దని స్ట్రిక్ట్ వార్నింగ్' చటుక్కున కల్పించుకుని అన్నది ప్రత్యూష.

'నేను చూడవచ్చునా అంటే.. ఈ సోది అంతా ఏమిటి?' కోపంగా అడగబోయి - డాక్టరుగారు మరోసారి అటుగా వచ్చేసరికి మాటలు మింగేశాడు బాజిరెడ్డి.

'ఏమిటి బాజిరెడ్డీ? ఇంకా ఇక్కడే ఉన్నావేమిటి? నేను నవ్వులాటకి అన్నమాట నీకు నచ్చలేదా? వెళ్ళవయ్యా. అహోబిలం వెళ్ళి నిజంగానే పూజ చేయించిరా' అన్నాడు ఆయన.

'బాజిరెడ్డి సారు లోపలికిపోయి..' అంటూ మాటని ఆపాడు వెట్టి.

'వద్దని చెప్పాను కదా. వద్దే వద్దు. ఆ తర్వాత ఏమైనా జరిగితే నాది కాదు బాధ్యత. వారంరోజుల పాటు అసలు ఈయన్ని కదిరి వదిలిపెట్టి వెళ్ళి పొమ్మనటం బెటరు' అన్నాడు డాక్టరు.

అంతకు ముందు కోపం వచ్చినప్పుడు జెముడు కాకి రంగులోకి మాత్రమే మారింది బాజిరెడ్డి మొఖం. ఇప్పుడు అది ఒరిజినల్ కాకి రంగుకు తిరిగిపోయింది.

చూపులకే గనుక మనిషిని మాడ్చి మసిచేసే శక్తి ఉండుంటే అక్కడికక్కడ బూడిదగుట్టగా మారిపోయి ఉండేవాడు వెట్టి. ముక్కును గట్టిగా ఎగబీల్చి, విసురుగా అడుగులు వేస్తూ వచ్చిన దారినే వెనక్కి వెళ్ళిపోయాడు ఆ పెద్దమనిషి.

విపరీతమైన ఆశ్చర్యంతో కన్నుల్ని పెద్దవి చేసి చూసింది ప్రణవి. 'మేము లోపల ఉండగా ఇక్కడ ముఖ్యమైన విశేషం ఏదో జరిగింది. అదేమిటో నాకు తెలియాలి' నడుము మీద చేతులు వేసుకుంటూ డిమాండ్ చేసింది.

'విశేషం అంటూ పెద్దగా ఏమీలేదు తల్లీ. మన వెట్టి ఆయన షర్టు పట్టుకుని గోడకేసి నెట్టాడు..' నవ్వుతూ అన్నాడు శంకరయ్య.

'మన వీరభోజుణ్ణి గోడకేసి నెట్టటం చిన్న విషయమా?' అడిగింది ప్రత్యూష.

'వస్తూనే వాడు చెత్తవాగుడు వాగాడు. ఈ అబ్బయ్యకి ఒళ్ళుమండింది' అంటూ జరిగింది వివరంగా చెప్పాడు శంకరయ్య.

మిలమిల మెరిశాయి ప్రణవి కళ్ళు. ప్రత్యూష మాత్రం తల విదిలించింది. 'ఎవరూ చేయలేని పని చేస్తే నీకు నచ్చలేదా?' ఆమెను అడిగింది ప్రణవి.

'నచ్చటం కాదు ప్రణవీ. వాడు వట్టి దగుల్బాజీ... వెట్టి వాడిని కావాలనే రెచ్చగొడుతున్నాడు. అది వద్దని చెప్పాము కదా' అన్నది ప్రత్యూష.

వెంటనే వెట్టి వైపు తిరిగింది ప్రణవి.

'ప్రత్యూష కరెక్టుగా చెప్పింది. నువ్వు కావాలనే వాడిని రెచ్చగొట్టి ఆ తర్వాత మట్టిలో కప్పెట్టేయాలని ప్లాన్ వేస్తున్నట్టున్నావు. వాడు ఏమైపోయినా మేమేమీ బాధపడం. వాడి మూలంగా నువ్వు జైలుకుపోవటమో, ఇంకేదైనా చిక్కుల్లో పడటమో జరిగితే, అది మాకు సమ్మతం కాదు. అర్థమైందా?' అడిగింది ప్రణవి.

'ఒక వారం పాటు మీకు వాతావరణం చాలా హాయిగా ఉంటుంది. ఎంజాయ్ చేయండి' నవ్వుతూ అన్నాడు వెట్టి.

అదిగో... లోపల్నించి ఏదో కబురు వస్తోంది' ఉన్నట్లుండి చెప్పింది ప్రత్యూష. ఆమె చెప్పినట్లే వడివడిగా వచ్చింది ఒక నర్సు. 'ఇక్కడ వెట్టి ఎవరు?' అని అడిగింది.

ఒక అడుగు ముందుకు వేశాడు వెట్టి.

'శివారెడ్డి సారుకు తెలివివచ్చింది. మిమ్మల్ని పిలుస్తున్నారు' చెప్పింది ఆమె.

'మీరు కూడా రండి' అంటూ అందర్నీ ఆహ్వానించాడు వెట్టి.

కనులు తెరిచి చూస్తున్నాడు శివారెడ్డి. ఆక్సిజన్ మాస్క్‌తో అవసరం తీరిపోయింది కాబోలు, దగ్గర ఉండి స్వయంగా తొలగించాడు డాక్టరు.

'నీ గురించి నేను చెప్పాను యంగ్‌మ్యాన్. నువ్వు ఎలర్ట్‌గా ఉండి ఉండక పోయినట్లయితే చాలా కష్టమైపోయి ఉండేదని కూడా చెప్పాను.' అన్నాడు వెట్టిని చూడగానే.

'ఎలా ఉంది సారూ? హ్యాపీయేనా?' బెడ్‌కి కొంచెం దూరంగా నిలబడుతూ అడిగాడు వెట్టి.

'నువ్వు నా దగ్గర పనిచేస్తావా?' చిన్నగా అడిగాడు శివారెడ్డి.

'ఇప్పుడు చేస్తూనే ఉన్నాను కదా సారు?' అన్నాడు వెట్టి.

అయోమయంగా తన భార్యవైపు చూశాడు శివారెడ్డి.

'అతను మన ప్రణవికి కాపలా. ప్రణవి మనబిడ్డ... మనబిడ్డకి కాపలాకాసే మనిషి మన దగ్గరే పని చేస్తున్నట్టు...' తడి కనులతోనే నవ్వుతూ చెప్పింది ఆమె.

నీరసంగా పనిచేస్తున్న శివారెడ్డి మెదడుకు వెంటనే అర్థమైంది. అతనికి కూడా వెంటనే వచ్చింది నవ్వు.

'ఇప్పటికి మన దగ్గరే పని చేస్తున్నట్టు... కాని రేపు ప్రణవికి పెళ్ళిచేసి పంపిస్తే... తను కూడా వెళ్ళిపోతే?' క్షణం ఆగి అడిగాడు.

'సారూ.... ఒక మాట చెబుతాను. శ్రద్ధగా వినండి' అంటూ ఆరంగుళాలు ముందుకు జరిగాడు వెట్టి.

అందరూ ఆశ్చర్యంగా చూశారు అతని వంక, ప్రణవి ప్రత్యూషలతో సహా.

'నేను వివరంగా చెప్పాల్సిన అవసరం లేదనే ఉద్దేశంతో బయటపెట్టలేదు. సబ్బిరెడ్డిసారు నన్ను ప్రణవమ్మకు కాపలాగా పంపించలేదు. జయమ్మ గారికి కాపలాగా పంపించారు. ఆయమ్మ నన్ను ఇక్కడికి పొమ్మని చెబితే వచ్చాను. నేను జయమ్మ తల్లి మనిషిని. ఆ తల్లి ఎక్కడ ఉంటే అక్కడ ఉంటాను' అన్నాడతను.

అయోమయంగా చూస్తున్న శివారెడ్డి మొఖం మళ్ళీ నవ్వులమయమైపోయింది ఒక్కసారిగా.

'అంటే నువ్వు పర్మినెంట్‌గా మా మనిషివేనన్న మాట. చాలా బాగుంది' అంటూ హాయిగా నిట్టూర్చాడు.

'చాలు.. మాట్లాడుకున్న మాటలు చాలు. పదండి బైటికి' అంటూ అప్పటివరకూ దూరంగా నిలబడి ఉన్న నర్సు దగ్గరికి వచ్చి కమాండ్ చేయటంతో, శివారెడ్డి భార్యతో సహ బయటికి వచ్చేశారందరూ.

'ఆయన అంత చక్కగా నవ్వి ఎంతోకాలమైంది. నాకు చాలా సంతోషంగా ఉంది' వెట్టి వైపు చూస్తూ అన్నదామె.

'నువ్వు కూడా సంతోషపడే మాట ఇంకోటుంది వదినమ్మ. చెప్పమంటావా?' హుషారుగా అన్నది ప్రణవి.

'ఏమిటది?' అడిగింది ఆమె.

వెట్టి డాక్టరుగారిని మానిప్యులేట్ చేసి బాజిరెడ్డికి ఏం చెప్పించాడో వివరంగా చెప్పింది ప్రణవి.

**(ఇంకావుంది)**



డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959

# ఎముకల ఆరోగ్యానికి దోహదపడే కాల్షియం, పోషకాలు అవగాహన.. అప్రమత్తతే ముఖ్యం

మన శరీరరాకృతి ఎముకలతో నిర్మితమై ఉంటుంది. ఎముకలను ఆరోగ్యంగా కాపాడుకోవడం చాలా అవసరం. మనం ఆరోగ్యంగా ఉండేందుకు శరీరానికి పోషకాహారం ఎలా అవసరమో... అలాగే ఎముకల ఆరోగ్యానికి కాల్షియం అవసరం. ఎముకల పటుత్వానికి అవసరమైన కాల్షియం ఉంటేనే ఎముకలు ఆరోగ్యంగా ఉంటాయి. అందుకోసం శరీరానికి కావలసిన మొత్తంలో కాల్షియం, విటమిన్ డి వంటి ఖనిజాలను అందించాలి. కాల్షియం అనేది మన శరీరంలో తయారయ్యే ఖనిజం కాదు, ఇది మనం తీసుకునే ఆహారం నుంచే లభిస్తుంది. శరీరంలోకి కాల్షియంను గ్రహించడానికి విటమిన్ డి అవసరమవుతుంది. శరీరానికి అవసరమైన విటమిన్ డి లభించడం వల్ల కాల్షియం పెరుగుతుంది. అవసరమైన కాల్షియం లభించే ఆహారం తీసుకోకపోవడం వల్ల అప్పటి వరకు మన ఎముకల్లో నిక్షిప్తమై ఉన్న కాల్షియం కొద్ది కొద్దిగా తీసివేస్తూ ఉంటుంది. దాంతో ఎముకలు బలహీనపడి ఆస్టియోపొరోసిస్‌కు దారితీసే అవకాశం ఉంటుంది.




## ఆస్టియోపొరోసిస్ మహిళల్లోనే అధికం

ఆస్టియోపొరోసిస్ సమస్యను ఎదుర్కొంటున్న వారిలో పురుషుల కంటే మహిళలు అధికంగా ఉంటారు. ఎందుకనగా సాధారణంగా మహిళల్లో ఎముకలు సన్నగా ఉంటాయి. మహిళలు మెనోపాజ్ దశకు చేరుకునే సరికి హార్మోన్ల సమతుల్యత దెబ్బతినడం వల్ల ఈ సమస్య ఎదురయ్యే అవకాశం ఉంటుంది. మహిళలు మెనోపాజ్ దశకు చేరుకునే సరికి వారిలో ఎముకలను కాపాడే ఈస్ట్రోజెన్ హార్మోన్ తగ్గిపోతుంది. దాంతో ఆస్టియోపొరోసిస్ బారినపడే అవకాశలు పెరుగుతాయి. దాంతోపాటు నిత్యజీవితంలో కాల్షియం, విటమిన్ డి లభించే ఆహారం తక్కువగా తీసుకోవడం, వ్యాయామానికి దూరంగా ఉండడం వంటి కారణాల వల్ల ఆస్టియోపొరోసిస్‌కు దారితీసే అవకాశం ఉంటుంది. పురుషుల్లో కూడా ఈ సమస్య ఉత్పన్నం అయ్యే అవకాశం ఉంటుంది.

## కాల్షియం లభించే ఆహార పదార్థాలు

పాలు, పెరుగు, జున్ను (ఛీజ్) వంటి పాల ఉత్పత్తుల్లో కాల్షియం అధికంగా ఉంటుంది. వీటితో పాటు క్యాబేజి, ఆకుకూరలు, సాల్మన్, సార్డినెస్ వంటి చేపలు, టోఫు, బ్రెడ్, తృణధాన్యాలు, కాల్షియం పోర్టిఫైడ్ జ్యూస్‌లు, ఇతర పానీయాలు వంటి ఆహార పదార్థాలలో కాల్షియం లభిస్తుంది. సోడా, కార్బోనేటెడ్ పానీయాలు కేవలం ఎముకల ఆరోగ్యాన్ని దెబ్బతీయడమే కాకుండా ఇతర ఆరోగ్య సమస్యలకు దారి తీసే అవకాశం ఉంటుంది. అందుకనే అన్ని వయసుల వారికి పాలు, కాల్షియం పోర్టిఫైడ్ జ్యూసులు, మంచి నీళ్ల తీసుకోవడం మంచిది.

## కాల్షియం మందులు ఎప్పుడు అవసరం

పాలు, పాల ఉత్పత్తులు వంటి కాల్షియం లభించే ఆహారం తీసుకోని వారికి, మెనోపాజ్ దశ దాటిన మహిళల్లో, 70 ఏళ్ల పైబడిన వారికి, శరీరంలో సరిపడా కాల్షియం లేని వారికి అధిక కాల్షియం అవసరమవుతుంది. వీరికి వైద్యులు కాల్షియం మందులు సూచిస్తారు. అయితే 500 ఎంజి డోస్ మందులు తీసుకునేవారిలోనే సమర్థవంతంగా కాల్షియం గ్రహించబడుతుందని అధ్యయనాల్లో తేలింది. రోజుకు 1000 ఎంజి డోస్ కాల్షియం అవసరమైన వారు వేరే వేరే సమయాల్లో తీసుకోవాలి. ఇటీవల 1200 ఎంజిల కాల్షియం మందులు అందుబాటులోకి వచ్చాయి. కాల్షియం మందులు ఎక్కువగా విటమిన్-డితో కలిపి వస్తున్నాయి. ఇవి శరీరంలో కాల్షియం గ్రహించడానికి దోహదపడతాయి.

## విటమిన్-డి పాత్ర

మనం తీసుకునే ఆహారంలో కాల్షియం ఒక్కటే సరిపోదు. దాంతోపాటు విటమిన్-డి కూడా ఉండాల్సిందే. ఇది ఎముకల ఆరోగ్యానికి చాలా అవసరం. పిల్లల్లో విటమిన్-డి తగ్గితే రికెట్స్ వ్యాధికి దారితీస్తుంది. ఇది ఎముకలను బలహీనపరచడంతో పాటు అస్థిపంజరానికి సంబంధించిన సమస్యలకు దారితీస్తుంది. దాంతోపాటు ఆస్టియోమలాసియా, ఎముకల నొప్పి, ఇతర వైకల్యాలు ఉత్పన్నం కావచ్చు.

మొదటి ఏడాది శిశువులకు 400 ఇంటర్నేషనల్ యూనిట్స్ (ఐయు) విటమిన్-డి అవసరమవుతుంది. 1 సంవత్సరం నుంచి 70 ఏళ్ల వయస్సు కలిగిన ప్రతి ఒక్కరికి 600 ఐయు అవసరమని ఆర్‌డిఎ తెలిపింది. ఎముకలు మంచి ఆరోగ్యాన్ని కలిగి ఉండాలంటే 1000 ఐయు విటమిన్-డి అవసరమని తాజా అధ్యయనాల్లో తేలింది. సూర్యరశ్మి ద్వారా విటమిన్-డి లభిస్తుంది. అయితే ఎండలో బయటకి వెళ్లేవారు చర్మ క్యాన్సర్లకు దారితీసే యువి రేడియేషన్ బారిన పడకుండా ఉండేందుకు సన్‌స్క్రీన్ వాడడం మంచిది.

## ఎక్కువైనా అనర్థమే

మన శరీరంలో కాల్షియం, విటమిన్-డిలు ఎక్కువైనా దుష్ప్రభావాలు తలెత్తే అవకాశం ఉంటుంది. కాల్షియం అధికంగా ఉండే ఆహార పదార్థాలు తీసుకోవడం వల్ల కిడ్నీలో రాళ్లు, గుండె సంబంధిత సమస్యలు ఉత్పన్నం అయ్యే అవకాశం ఉంటుంది. కాబట్టి వైద్యుల పర్యవేక్షణలో చికిత్స తీసుకోవాలి. ఆరోగ్య పరిస్థితి, శరీర తత్వాన్ని బట్టి వివిధ రకాల మందుల డోసు అవసరమవుతాయి. సూర్యరశ్మి తక్కువగా ఉండే ప్రాంతాలలో నివసించేవారు, ముదురు రంగు చర్మం కలిగిన వారు, ఊబకాయులకు విటమిన్-డి అవసరం అధికంగా ఉంటుంది.

## ఇతర పోషకాల పాత్ర

మన ఎముకలు ఆరోగ్యంగా ఉండేందుకు, ఎముకల పెరుగుదలకు ఇతర పోషకాల పాత్ర కూడా కీలకమే. ఫాస్ఫరస్, మెగ్నీషియం, విటమిన్ కె, విటమిన్ సి, విటమిన్ ఎ వంటి ఖనిజాలు, విటమిన్ల పాత్ర ఉంటుంది. కాల్షియం, విటమిన్-డితో పాటు ఇతర విటమిన్లు, ఖనిజాలు సరిపడా ఉంటేనే మన ఎముకలు ఆరోగ్యంగా ఉంటాయి.



# గేమ్ ఆఫ్ లైఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి

19

**సమాజంలో ప్రతి మనిషికీ కొన్ని హక్కులుంటాయి. మనిషిగా పుట్టినందుకు సమాజం నుంచి వాటిని మనం సంపాదించుకుంటున్నాం.**

ఐక్యరాజ్యసమితి మానవుని ప్రాథమిక హక్కులుగా కొన్ని హక్కుల్ని నిర్ధారించింది. వాటిలో కొన్ని:

- జీవించే హక్కు.
- స్వేచ్ఛా హక్కు
- వసతి హక్కు
- విద్యా హక్కు
- ఆరోగ్య హక్కు మొదలైనవి.

వీటిని మనిషికిచెందిన ప్రాథమిక ప్రామాణిక హక్కులుగా చెప్పుకోవచ్చు.

సమాజంలో మనిషికీ మనిషికీ మధ్య సంబంధ బాంధవ్యాలు సజావుగా సాగాలంటే ప్రతి మనిషీ తన హక్కుల్ని కోరుకోవటంతోపాటు ఇతరుల హక్కుల్ని అంగీకరించే స్థితిలో కూడా ఉండాలి.

తల్లిదండ్రులు తన బాగోగులు చూడాలని బిడ్డ ఆశించినట్టే, ప్రతి మనిషీ ఇతరులనుంచి కొన్ని ఆశిస్తూ ఉంటాడు. ఇలాంటి వాటిలో స్నేహితుడు, భార్య, భర్త తనతో నిజాయితీతో వ్యవహరించాలని కోరుకోవడం ఒకటి!

అవతలి మనిషి నుంచి Expect చేసే హక్కు మనకు ఎలా ఉంటుందో అలా అవతలి మనిషికి కూడా మన నుంచి Expect చేసే హక్కు ఉంటుందన్న సంగతి అంగీకరించటం, అనుగుణంగా ప్రవర్తించటమే 'స్థితప్రజ్ఞత' Assertiveness!

ఎవరికివారు తమ హక్కుల గురించి ఆలోచించినప్పుడు, దానిని ఈ కింద జాబితాగా భావించవచ్చు.

1. నాకు కావాల్సిన దాని గురించి అడిగే హక్కు నాకుంది. అలాగే ఎదుటి మనిషికి కూడా నాతో 'లేదు' (No) అని చెప్పే హక్కు ఉందని గుర్తిస్తున్నాను.
2. స్వంత అభిప్రాయాలు, విలువలు ఉండే హక్కు, వాటిని ఇతరులముందు వ్యక్తీకరించే హక్కు నాకు ఉంది.
3. నా అవసరాలకనుగుణంగా నా మనస్సును మార్చుకునే హక్కు నాకు ఉంది.
4. నిర్ణయాలు తీసుకునే హక్కుంది. వాటి ఫలితాల్నీ భరిస్తాను.
5. ఇతరుల సమస్యలకు నేను బాధ్యుణ్ణి కాననే హక్కు నాకుంది.
6. విజయం సాధించే హక్కుంది.
7. ప్రైవసీని కోరుకునే హక్కు, ఒంటరిగా, స్వతంత్రంగా వ్యవహరించే హక్కుంది నాకు.
8. 'నాకు తెలియదు', 'అర్థం కాలేదు' అని చెప్పే హక్కుంది.
9. నన్ను నేను మార్చుకునే హక్కు, స్థితప్రజ్ఞుడిగా వ్యవహరించే హక్కు నాకు ఉన్నాయి.
10. ఏ గిల్టీనీ పొందకుండా నేను 'లేదు', 'అవును', అని చెప్పేహక్కుంది నాకు.
11. నేను నేనుగా ఉండే హక్కుంది.
12. మీతో సమంగా నన్ను చూడమనే హక్కు నాకు ఉంది.

ఇంకా ఏమైనా తడితే వాటినికూడా ఈ లిస్టులో రాసుకుని, కింద సంతకం చేసి, తేదీవేసి ఆ కాగితాన్ని మీ టేబుల్ పైభాగాన గోడ మీద అంటించండి.

స్థితప్రజ్ఞతతో ఉండేందుకు మీకివి గైడ్‌లైన్స్‌లా ఉపకరిస్తాయి.

## హక్కులు - బాధ్యతలు

ఐతే, ఆ లిస్టులోని మన హక్కులే కాకుండా ఇతరులకున్న హక్కుల్ని కూడా అంగీకరిస్తూ లిస్టు చివర నోట్ రాసుకోవాలి. ఇవి చాలా ముఖ్యం!

ఇతరులకు కూడా హక్కులున్నాయని అంగీకరించటం 'మన బాధ్యత'ను గుర్తించటమే!

సమాజంలో ఎవరైనా సరే 'బాధ్యత'లు స్వీకరించినప్పుడు మాత్రమే 'హక్కు'లు పొందగలుగుతారు.

హక్కులు సాధించుకున్నప్పుడు నైతికంగా బలవంతులవుతాం. మన జీవితంమీద అదుపు సాధించిన వాళ్ళమవుతాం.

మన హక్కులు, ఇతరుల హక్కులు గుర్తించే బాధ్యత స్వీకరించటంవల్ల స్థితప్రజ్ఞత పొందిన వాళ్ళమవుతాం.

**స్థితప్రజ్ఞతా సాధనకు ప్రవర్తనాపరమైన మెళకువలు:**

### ఏం చెప్పదల్చుకున్నారు?

మనకు ఏం కావాలో తెలియకపోతే, ఏం చెప్పదల్చుకున్నామోకూడా మనకు తెలియదు. అప్పుడు ఎదుటివారికి మనభావం స్పష్టంగా అందదు.

మన మాటల్లో నిజాయితీ కనిపించదు. ఇరువురి మధ్య అస్పష్టత, అపార్థాలు చోటుచేసుకుంటాయి. అందుకని ఒక మనిషితో మాట్లాడబోయే ముందు మన అభిప్రాయాలు, అవసరాలకు సంబంధించి మనం స్పష్టమైన అవగాహనకు రావాలి.

### నాన్చకూడదు!

అవతలి మనిషి నుంచి మనకు కావాల్సింది ఏమిటో అర్థమయ్యాక ఊరకే నాన్చవద్దు. మాటలు మింగవద్దు. అసలు విషయం వదిలి డొంకతిరుగుడు మాటలువద్దు.

అది మన ఇన్‌ఫీరియారిటీకి సూచన.

అవతలి మనిషినుంచి మనం కోరేదేమిటో స్పష్టంగా చెప్పడం స్థితప్రజ్ఞుల ముఖ్యలక్షణం!

### చెప్పేది స్పష్టంగా ఉండాలి!

మనకు కావాల్సిందేమిటో, ఏదివద్దో Specificగా చెప్పాలి. అస్పష్టత ఉంటే అనుకున్నది పొందలేరు. ఉదాహరణకు: హెయిర్ కటింగ్ సెలూన్‌కి వెళ్తారు. హెయిర్ డ్రెస్సర్ మీ జుట్టు మరీ పొట్టిగా కత్తిరించాడు. మరో మారు ఆ షాపుకు వెళ్ళబోయే ముందు అంతకు మునుపు కంటే మనక్రాపు ఇంకాస్త పొడుగ్గా ఉండాలన్న విషయం నిర్దిష్టంగా మనకు తెలిసి ఉన్నప్పుడు మాత్రమే, 'క్రితంసారి మరీ పొట్టిగా కట్ చేశావు, బాగో లేదు, ఈసారి ఇంకాస్త పొడుగుంచు' అనగలుగుతారు.

అలా కాకుండా "క్రితంసారి ఏమిటి అంత దరిద్రంగా కట్ చేశావు? ఈసారన్నా సరిగ్గాచెయ్" అన్నారనుకోండి. అప్పుడతనికి మనకు కావాల్సిందేమిటో స్పష్టంగా తెలియదు. అందుకని ఏ విషయంలోనైనా మనకేం కావాలో స్పష్టంగా తెలిసి ఉండాలి. అవతలి వాళ్ళకు స్పష్టంగా, నిర్దిష్టంగా చెప్పాలి.

### ప్రశాంత స్థితిలో చెప్పాలి

ఎవరితోనైనా, ఏ విషయమైనా చెప్పాలనుకుంటే చెప్పకుండా రోజుల తరబడి మనస్సులో దాచుకోకూడదు. దానివల్ల మన మనస్సులో టెన్షన్ పెరుగుతుంది. అందుకే వెంటనే చెప్పేయాలి. కాకపోతే ఇరువురి మనస్సులూ ప్రశాంత స్థితిలో ఉన్నప్పుడు మాత్రమే చెప్పాలి.

**సమాజంలో మనం పొందాలనుకున్న దానిపై మనకు స్పష్టత ఉండాలి. దానిని నాన్చకుండా ఎదుటివారికి సూటిగా కళ్ళల్లోకి చూస్తూ అర్థమయ్యేలా చెప్పగలగాలి. అలా చెప్పాలంటే మనకు ఏం కావాలో మనకు ముందుగా తెలిసి ఉండాలి. అలా తెలిసి ఉండాలంటే, మనకు ఉన్న హక్కులు ఏమిటో కూడా తెలియాలి. అదే సమయంలో ఎదుటివారికి ఉన్న హక్కులను కూడా గుర్తించాలి. అలా గుర్తించినప్పుడే విజయం మన సొంతం అవుతుంది.**

### కళ్ళలోకి చూడాలి

ఒక విషయం చెప్పదల్చుకున్నప్పుడు కళ్ళవైపు చూస్తూ చెబితే కంఫర్టబుల్‌గా ఫీలవుతారు. నిజంగానే కావాలని అడుగుతున్నామని వాళ్ళు అర్థం చేసుకుంటారు.

అలా కాకుండా ఎటోచూస్తూ చెబితే మన మాటల్లో నిజాయితీలేదనిపిస్తుంది. మీ కోర్కె లేక మాటలు Genuineగా అనిపించకపోవడంవల్ల లైట్‌గా తీసుకుంటారు.

### రిలాక్స్‌డ్‌గా ఉండాలి

ఒక విషయం చెబుతున్నప్పుడు మరీ బిగదీసుకుని లేదా చేతులు ఊపుతూ లేక శరీరం బరువును ఒక పాదం మీంచి మరోపాదంమీదికి మార్చుకుంటూనో మాట్లాడకూడదు.

ఈ భంగిమలవల్ల మనపై తక్కువ అభిప్రాయం ఏర్పడి మన పనులు సానుకూలం కావు.

రిలాక్స్‌డ్‌గా ఉండటం ఎలాగో అద్దం ముందు నిలబడి ప్రాక్టీస్ చేస్తే తెలుస్తుంది.

### నెర్వస్‌గా నవ్వకూడదు

కొత్తవాళ్ళతో మాట్లాడేటప్పుడు కొందరు సమయం సందర్భం లేకుండా అనవసరంగా నవ్వే ప్రయత్నం చేస్తారు. అది వారి నెర్వస్‌నెస్‌ని సూచిస్తుంది.

అనవసరంగా నవ్వుతూ మాట్లాడితే, అవతలి వారికి మనలో నిజాయితీ కనిపించదు. నమ్మాలా? వద్దా? అనే కన్‌ఫ్యూజన్ వస్తుంది.

### వ్యంగ్యం వద్దు

పని సానుకూలం కావాలంటే చెప్పాలనుకున్న విషయం సూటిగా నిజాయితీగా చెప్పాలి. బతిమాలాడుతున్నట్టు, వ్యంగ్యధోరణిలోను ఉండకూడదు.

బతిమలాడుతున్నట్లు చెబితే, అవతలివాళ్ళు తమని మీరు నమ్మటం లేదన్న సందేహంలోపడే అవకాశం ఉంది.

వ్యంగ్యంగానో, దొంగచూపులు చూస్తూనో చెబుతుంటే మనలో మిత్రత్వం కనిపించదు. అవతలివారు మనపట్ల శత్రుభావానికి గురయ్యే ప్రమాదం ఉంది.

ఈ స్కిల్స్ పాటించటం ద్వారా స్థితప్రజ్ఞతకు చేరువైన వాళ్ళమవుతాం.

### అపజయ కారణాలు

లోకంలో కొందరు చేపట్టిన చాలాపనుల్లో విజయం సాధించడం చూస్తాం. మరికొందరు మాటిమాటికీ అపజయం పొందటం చూస్తాం.



మనిషికి మాటిమాటికీ అపజయాలు ఎందుకు ఎదురవుతాయన్న విషయం గమనించినప్పుడు, అపజయాలు పొందటానికి అతడిలో ఉండే ఈ కింది అలవాట్లు శక్తిమంతమైన కారణాలుగా పని చేస్తుంటాయి.

- ఒక లక్ష్యం, ఒక ధ్యేయం లేకుండా జీవితాన్ని తెగిన గాలిపటంలా సాగించటం.
- ఇతరుల వ్యవహారాలపట్ల అనవసర ఆసక్తి ప్రదర్శించటం.
- సరైన విద్య లేకపోవటం.
- కోర్కెలమీద అదుపు లేకపోవటం, అందుబాటులో ఉన్న అవకాశాలపట్ల చిన్నచూపు.. వెరసి స్వీయ క్రమశిక్షణ లేకపోవటం.
- ఆశయాలు, ఆదర్శాలు లేకపోవటం.
- నెగెటివ్ ఆలోచనల వల్ల వచ్చే అనారోగ్యం.
- బాల్యంలో చెడు అలవాట్లు, చెడు ప్రభావాలు.
- చొరవ కొరవడటం
- నెగెటివ్ దృక్పథం
- కోపతాపాల మీద కంట్రోల్ లేకపోవటం
- ఏ ప్రయత్నం చేయకుండానే ఏదో జరగాలని కోరుకోవటం.
- సరైన సమయంలో సరైన నిర్ణయం తీసుకోకపోవడం.
- **వివిధ రకాల భయాలు.**

1. పేదరిక భయం.
2. విమర్శల భయం.
3. అనారోగ్య భయం.
4. ప్రేమను కోల్పోతామనే భయం
5. వృద్ధాప్య భయం.
6. స్వేచ్ఛ కోల్పోతామనే భయం.
7. మరణ భయం

ఈ ఏడు భయాల్లో ఏ ఒక్కటిగాని, కొన్ని కలగలిసిగానీ అతిగా ఉండటం.

- భార్య/ భర్త ఎంపికలో Poor Selection.
- అతిజాగ్రత్త లేక అసలు జాగ్రత్త లేకపోవటం.
- సెలవులు సక్రమంగా వినియోగించుకోలేకపోవటం
- కాలం, డబ్బు అర్థంపర్థం లేకుండా ఖర్చు చేయటం
- నోటిని అదుపులో ఉంచుకోలేకపోవటం




- అసహనం
- ఇతరులతో సహజీవనం చేయలేకపోవటం
- నమ్మకం కాపాడుకోలేక పోవటం.
- దూరదృష్టి Imagination లేకపోవటం
- బడాయి, కోతలు కోయటం
- ప్రతీకారేచ్ఛ
- సుఖలాలసత - బద్ధకం, ఒళ్ళు దాచుకోవటం

ఇవన్నీ మనిషికి అపకారం చేసేవే. మనిషిని మాటిమాటికీ అపజయాల్లోకి నెట్టే చెడు అలవాట్లే.

వీటిలో మీకు ఏవైనా సరిపోలేట్టుగా ఉంటే, ఆ అలవాట్లను మార్చుకునే ప్రయత్నం చేయడం మంచిది. ఇవి చెడు అలవాట్లు.

ఇవి కాకుండా మనిషికి ఉపకారం కలిగించేవీ, విజయాలు కొని తెచ్చిపెట్టే మంచి అలవాట్లను చూసినపుడు.,

### మంచి అలవాట్లు

- **ఒక ఆశయం, ధ్యేయం ఉండటం.**

జీవితంలో అన్నింటిలోకి ఇది అత్యంత ముఖ్యమైన ప్రాథమిక ఉత్తమ లక్షణం.

దీనివల్ల జీవితంలో మనం అత్యంత జాగరూకతతో ఉండగలుగుతాం. మరొక సృజనాత్మకతను కలిగి ఉంటాం. మరింత ఉత్సాహంగా ఉంటాం. 'విల్ పవర్' పెరుగుతుంది.

- **మనమీద మనకు నమ్మకం ఉండటం.**

దీనివల్ల మన మనస్సు ఎప్పుడూ పాజిటివ్ భావాలతో నిండి ఉంటుంది. నెగెటివ్ ప్రభావాలు, భయాలకు దూరంగా ఉంటాం. తద్వారా సెల్ఫ్-డిసిప్లిన్ ఏర్పడుతుంది.

- **చొరవ**

ఎవరూ ఏమీ చెప్పకుండానే మనంతట మనం ఆశయాలకు అనుగుణంగా ముందుకు సాగిపోయే చొరవ ఉండటం.

- **ఉత్సాహం**

ఏర్పరచుకున్న లక్ష్యంవైపు కొత్తఉత్సాహంతో, కొత్త ఊపిరితో సాగిపోయే లక్షణం.

- **సెల్ఫ్-డిసిప్లిన్**

ఇది అన్నింటిలోనే ముఖ్యమైనది. సెల్ఫ్-డిసిప్లిన్ ఎంతగా పాటిస్తుంటే అంతగా అది మన జీవితంలో ఒక భాగమైపోయి సక్సెస్ సాధించటానికి మనకు అవకాశాన్ని కల్పిస్తుంటుంది.

**(ముగింపు వచ్చేవారం)**



# ఉపవాసం చేస్తున్నారా!?

**అటు శరీరాన్ని.. ఇటు ఆత్మనూ పరిశుద్ధం చేసే విశేష ప్రక్రియే ఉపవాసం. ఉపవాసం అంటే పర మాత్మధ్యాసలో ఉండడంతప్ప బలవంతాన అన్న పానీయాలకు దూరంగా గడపడం కాదు. అన్ని మతాల్లోనూ ఉపవాస సంప్రదాయం కనిపిస్తుంది. ఒక్కో తరహా ప్రాంతంలో ఒక్కో తరహా పద్ధ తులు కనిపిస్తాయి. పద్ధతి ఏదైనా సరే మనసుపెట్టి ఏకాగ్రతతో చేయగలిగితే ఉపవాస ఫలితాలు అందుకోవచ్చు.**

అసలే రాబోయేది కార్తీక, ధనుర్మాసాలు. వివిధ రకాల ఉపవాసాలతో మహిళలు కాలం గడిపేస్తుంటారు. కొన్నిసార్లు ఉపవాసం మంచిదే. అయితే మంచినీళ్ళు కూడా తీసుకోకుండా కడు పుమాడ్చుకుని చేసే ఉపవాసం వల్ల కొన్ని నష్టాలు కూడా ఉన్నాయి. కాబట్టి ఉపవాస సమయంలో కొన్ని కొన్ని జాగ్రత్తలు పాటిం చడం తప్పనిసరి అంటున్నారు వైద్యులు.

## ఇలాంటివారు చెయ్యొద్దు

ఆరోగ్యం సహకరిస్తేతప్ప ఉపవాసం చేయ కూడదు. అనారోగ్యంగా ఉన్నవారు ఉపవాసం చేయడం వల్ల లేనిపోని సమస్యలను కొనితెచ్చు కునే ప్రమాదం కూడా ఉంది. కొందరు అదే పనిగా వారంలో మూడునాలుగు రోజులు ఉప వాసాలు చేస్తారు. నెలకు ఒకసారి ఉపవాసం చేయడంవల్ల ప్రయోజనం పొందినా అదేపనిగా చేసే ఉపవాసాలవల్ల ఆరోగ్యం దెబ్బతింటుంది. డయాబెటిస్ పేషెంట్స్, గర్భవతులు, ఏవైనా మందులు వాడేవారు ఉపవాసాలు చేయకూ డదు. ఉపవాసం సరిగ్గా చేయకపోతే శరీరం లోని కొవ్వు అంటే కండరాలు ఎక్కువగా కరిగి పోతాయి. అందుకే మహిళలు స్ట్రెస్‌పీరియడ్ గడిచిన వారం తర్వాత మాత్రమే ఉపవాసం చేయాలి. ఆ సమయంలో ఉపవాసాలు చేయ డంవల్ల శక్తి క్షీణించి త్వరగా అలిసిపోయే ప్రమాదం ఉంది.

## ప్రయోజనాలు

సరైన పద్ధతిలో ఉపవాసం చేస్తే అనేక ప్రయోజనాలు దక్కుతాయి. ఉపవాసం వల్ల శరీరంలోని విషతుల్యాలు బైటకుపోతాయి. క్లెన్సింగ్ జరుగుతుంది. శరీరానికి శక్తి అందు తుంది. శరీర విధుల నిర్వహణలో సమతుల్యత వస్తుంది. రోగనిరోధక వ్యవస్థ మరింత శక్తి మంతం అవుతుంది. రక్తపీడనం త్వరగా తగ్గిపో తుంది. అయితే ఇది హైబీపీ ఉన్నవారికి మంచిదే అయినా లోబీపీ బాధితులకు మాత్రం సమస్యలు తేవచ్చు.



ఉపవాసంవల్ల జీర్ణవ్యవస్థకు తగిన విశ్రాంతి దొరికి దాని పనితీరు మెరుగుపడు తుంది. ఇంద్రియాలను, మనసును అదుపులో పెట్టుకోవచ్చు. అదనపు కేలరీల బెడద లేనం దున ఊబకాయం వంటి సమస్యలు త్వరగా రావు.

## ఈ జాగ్రత్తలు తప్పనిసరి

సాధ్యమైనంత వరకూ ఉపవాస సమ యంలో పనిభారం లేకుండా చూసుకోవడం మంచిది. చాలామంది మహిళలు తినాలనే ధ్యాసనుంచి దృష్టి మరల్చుకునేందుకు ఇంటి పనుల్లో నిమగ్నమవుతారు. అలా కాకుండా కొంచెం కళ్ళు మూసుకుని విశ్రాంతి తీసుకోవాలి. మంద్రమైన సంగీతం వింటూ ఉండాలి. ధ్యానం చేయడం మంచిది.

ఉపవాసం చేసిన మర్నాడు ఆకలిగా ఉందని అతిగా తినేయకూడదు. ముందుగా ద్రవాహారం తీసుకోవాలి. ఆ తర్వాత ఘనా హారం తీసుకుంటే మంచిది. ఎక్కువ మసా లాలు కాకుండా తేలికపాటి సాత్విక ఆహారం మాత్రమే తీసుకోవాలి. అన్నం కూరలతో పాటు, సగ్గుబియ్యం జావ, పండ్లముక్కలు తినాలి.

## కఠినంగా వద్దు

శరీరానికి ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజ లవ ణాలు పోషకాలు అవసరమవుతాయి. ఇవన్నీ కొవ్వులో నిల్వ ఉండవు. వీటిని ఆహారంలో తీసు కోకపోతే శరీరానికి ఏవిధంగానూ అందవు. రక్తంలో ఎమినోయాసిడ్స్ లేకపోయినట్లయితే జీవక్రియ ప్రభావం కండరాలపై పడుతుంది. ఎప్పుడు పడితే అప్పుడు ఉపవాసాలు చేస్తుంటే హార్మోన్లు ప్రభావితం అవుతాయి.

అసలు ఏమీ తీసుకోకుండా చేసే కఠిన ఉప వాసాలవల్ల తలనొప్పి, డీహైడ్రేషన్ వంటి ఇబ్బందులు తలెత్తుతాయి. జుట్టు పల్చబడి పోతుంది. ఆహారాల లోపాలకు సంబంధించిన ఇతర సమస్యలు తలెత్తుతాయి. అందుకే కఠి నంగా, చాదస్తంగా కాకుండా పోషకాహారం లభించే డ్రైఫ్రూట్స్, పండ్లు, తగినంత నీరు తీసు కుంటూ, పండ్లరసాలను తాగుతూ ఉపవాసం పాటించాలి.

**-నివేదిత**

# హెపటైటిస్, హెర్పిస్‌లకు చెక్

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకో కపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. శృంగారం ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టదు.

# సుఖవ్యాధులతో భద్రం సుమా!

**హెచ్ఐవి :** చికిత్స లేని వ్యాధిగా హెచ్ఐవికి పేరుంది. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, త్వరగా వ్యాధులు రావడం జరుగుతుంది.

**గనేరియా :** మూత్రంలో మంట, మూత్రనాళం దగ్గర దురద, జిగురుగా ద్రవం కారడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఒక్కొక్కసారి రక్తపరీక్షలో గనేరియా బయటపడకపోవచ్చు. కానీ మూత్రనాళంలో బాధ, మూత్రంలో మంట ఉంటుంది. కొందరిలో పొత్తికడుపు నొప్పి, వీర్యంలో మంట, రక్తం రావడం కనిపిస్తాయి.

**వెనీరియల్ వార్ట్స్:** పురుషాంగం మీద చిన్న క్యాలిఫ్లవర్ తరహాలో పులిపిరులు వస్తాయి. ఇవి గుత్తులు గుత్తులుగా తయారవుతాయి.

**షాంకరాయిడ్ పుళ్లు:** ఇది కూడా లైంగిక వ్యాధే. లైంగిక సంపర్కం తర్వాత 3 నుంచి 5 రోజులలో ఈ వ్యాధి బయటపడుతుంది. జననాంగం మీద రెండు, మూడు పుళ్లు ఏర్పడతాయి. ఇది మొదట చిన్న నీటి బుడగలాగా వచ్చి చీము ఏర్పడి పగులుతుంది. పుండు ఎర్రగా మారి నొప్పి వస్తుంది.

**హోమియో చికిత్స :** రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశ వాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. గనేరియా, వెనీరియల్ వార్ట్స్, షాంకరాయిడ్ పుళ్లు కూడా హోమియో మందులతో సమూలంగా దూరమవుతాయి.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# వృషణాల నొప్పి పోతుందిలా..

వీర్యకణాల ఉత్పత్తి, టెస్టోస్టిరాన్ హార్మోన్ తయారీలో వృషణాల(టెస్టికల్స్) పాత్ర చాలా కీలకం. వృషణాలు దెబ్బతింటే సంతానలేమి సమస్య ఎదురవుతుంది. కొన్నిసార్లు కొంతమందిలో వృషణాల నొప్పి చాలా బాధిస్తుంది. వృషణాల్లో నొప్పి రావడానికి చాలా కారణాలుంటాయి. నొప్పి, వృషణాల్లో వాపు, ముట్టుకుంటే భరించలేనంత నొప్పి వంటి లక్షణాలుంటాయి. కొన్నిసార్లు రెండు వృషణాల్లో నొప్పి ఉంటే కొన్నిసార్లు ఒకే వృషణంలో ఉంటుంది.

**కారణాలు అనేకం**

అపరిచితలతో శృంగారం జరపడం వల్ల సుఖవ్యాధులు వచ్చే అవకాశం ఉంటుంది. అలా సుఖవ్యాధులు సోకినపుడు బ్యాక్టీరియా వల్ల వృషణాల్లో వాపు, నొప్పి రావచ్చు. కొన్నిసార్లు దెబ్బతగలడం వల్ల కణజాలం దెబ్బతిని వాపు, నొప్పి రావచ్చు. మూత్రపిండాల్లో రాళ్లు ఉన్నప్పుడు కూడా వృషణాల నొప్పి వచ్చే అవకాశం ఉంటుంది. వృషణాల్లో ఎర్పడే ట్యూమర్స్ కూడా వాపు, నొప్పికి కారణమవుతుండవచ్చు. ఇంగ్వినల్ హెర్నియా వల్ల కూడా వృషణాల్లో నొప్పి వస్తుండవచ్చు. వైరల్ ఇన్‌ఫెక్షన్ల వల్ల కూడా వృషణాల్లో నొప్పి వస్తుండవచ్చు. కాబట్టి ముందుగా కారణం తెలుసుకుని చికిత్స అందించాలి. కారణం తెలుసుకోవడం కోసం రక్తపరీక్షలు, స్కానింగ్, సీటీస్కాన్ వంటి పరీక్షలు అవసరమవుతాయి.

**హోమియో చికిత్స**

హోమియో మందులు మూల కారణాన్ని తొలగిస్తాయి. ఫలితంగా సమస్య శాశ్వతంగా తొలగిపోతుంది. శారీరక లక్షణాలు, మానసిక లక్షణాలు, వ్యాధిని పరిశీలించి చికిత్స అందిస్తే ఫలితాలు బాగుంటాయి. ఎలాంటి సైడ్‌ఎఫెక్టులు ఉండవు.

# మెడ, భుజం నొప్పి వేధిస్తోందా?

బిజీ జీవనం, వ్యాయామం కొరవడటం, ఎక్కువ గంటలు కూర్చుండి పనిచేయడం, ఎక్కువ దూరం టూ వీలర్‌లపై ప్రయాణించడం వంటి కారణాల వల్ల మెడ నొప్పి, భుజం నొప్పితో బాధపడే వారి సంఖ్య పెరుగుతోంది. ద్విచక్ర వాహనం ఎక్కువగా నడిపే వారిలో, సాఫ్ట్‌వేర్ ఉద్యోగుల్లో మెడనొప్పి ఎక్కువగా ఉంటుంది. ఎముకల్లో అరుగుదల, కార్టిలేజ్ తగ్గడం వలన, ఎముకల బలం, సాంద్రత తగ్గుతుంది. ఫలితంగా కండరాలనొప్పి, మెడ తిప్పలేకపోవడం, చేతులు లాగడం జరుగుతుంది. మెడ నుంచి భుజాలు, చేతులకు నొప్పి, తిమ్మిర్లు వ్యాపిస్తాయి. చేతి కండరాలు బలహీనపడటం, కళ్లు తిరగడం ఉంటుంది.

**భుజంనొప్పితో** బాధపడే వారి పరిస్థితి కూడా దయనీయంగా ఉంటుంది. సాధారణంగా గాయాల బారినపడినపుడు భుజం ఎముక దగ్గర ఉండే లిగమెంట్ చిరిగిపోతుంది. ఫలితంగా షోల్డర్ జాయింట్ డిస్‌లోకేట్ అవుతుంది. కొందరిలో రెండు ఎముకల మధ్య గ్యాప్ తగ్గిపోతుంది. ఫలితంగా ఎముక రాపిడికి గురై తీవ్రమైన నొప్పి ఏర్పడుతుంది. భుజం పైన నొప్పి ఉండటంతో పాటు చేతివైపు కూడా నొప్పి ఉంటుంది. చేయిపైకి లేపాలని చూసినపుడు నొప్పి వస్తుంటుంది. ఆ వైపు పడుకోవాలని చూసినా నొప్పి వస్తుంటుంది. ఈ సమస్యను రొటేట్ కఫ్ టేర్ అంటారు. రిపీటెడ్ మూవ్‌మెంట్స్ చేసే వారిలో టెన్నిస్ ఎల్బో సమస్య కనిపిస్తుంది. భుజం నొప్పికి ఇది కూడా కారణమే.

**హోమియో వైద్యం**

ఏ కారణం చేత మెడ, భుజం నొప్పి వస్తున్నా హోమియో మందులు పరిష్కారాన్ని చూపుతాయి. నొప్పి నివారణ మాత్రలు తాత్కాలిక ఉపశమనాన్ని మాత్రమే ఇస్తాయి. కానీ హోమియో వైద్యం శాశ్వత పరిష్కారాన్ని చూపుతుంది.



# అనుకోకుండా ఒకరోజు

టి. శ్రీజ్యోత్స్న

**'అత్తయ్యగారూ, ఈ పూట వంట ఏం చెయ్యమంటారు?' అడిగింది సరోజ. కూరలకోసం ఒకచేత్తో ఫ్రిజ్‌డోర్ తెరుస్తూ, మరోచేత్తో చల్లారిన కాఫీ గొంతులో పోసుకుంటూ'.**

**'ఏదో ఒకటి చేసేద్దూ...' బుల్లితెరమీద నుండి తన దృష్టి కించిత్తుకూడా పక్కకి మరల్చకుండా భక్తి టి.వి.లో వస్తున్న ప్రవచనామృతాన్ని, వేడి వేడి కాఫీరుచిని ఏకకాలంలో ఆస్వాదిస్తూ తన్మయంగా చెప్పింది హాల్లో సోఫాలో కూర్చున్న సావిత్రమ్మ.**

'కాస్త పుల్లగా, నోటికి రుచిగా ఉండేలా నిమ్మరసం పిండి, కొత్తిమీరకారం చెయ్యమ్మా సరోజా' అన్నారు ఆనాటి వార్తాపత్రిక వంటలపేజీలో 'కొత్తిమీరతో కోటి వెరైటీలు' శీర్షిక చదువుతున్న రంగనాథం గారు.

'బాక్సులో పట్టుకెళ్ళేలా ఉండాలి సుమా' అన్నాడు అప్పటికే కాఫీతాగటం పూర్తిచేసి తల్లిదండ్రుల్లో ఎవరైనా టి.వి. కానీ, పేపరు కానీ వదిలిపెట్టక పోతారా అని చూస్తున్న ప్రభాకరం.

అన్నీవిని కూరలు తీసుకుని వంటింట్లోకి వెళ్ళింది సరోజ. అప్పటికే ఐదారు కూతలు వేసిన కుక్కరు కట్టేసి, కూర తరిగి మూకుడులో వేసింది. మిక్సీలో కొత్తిమీరకారం వేసి, ఉప్మా కలియబెట్టింది. అప్పటికే ఆరున్నర దాటిపోయింది. అమ్మో స్కూలు టైమైపోతోంది. పిల్లల్ని లేపాలి అనుకుంటూ బెడ్‌రూమ్‌లోకెళ్ళింది సరోజ.

పెద్దకొడుకు రవి, తల్లి పలకరిస్తున్నా పట్టించుకోకుండా పొద్దున్నే వాట్సప్‌లో స్నేహితులకు 'గుడ్ మార్నింగ్' మెసేజ్ పెట్టేపనిలో బిజీగా ఉన్నాడు.

అప్పటికే తలస్నానంచేసి జుట్టు ఆరబెట్టుకుంటున్న పెద్ద కూతురు లావణ్య, జుట్టువది





లేస్తే బాగుంటుందా? క్లిప్ పెట్టుకుంటే బాగుంటుందా? అల్లుకుంటే బాగుంటుందా? అని తెల్సుకోవటానికి రకరకాల ఫోజుల్లో సెల్ఫీలు తీసుకుంటోంది.

రవినీ, లావణ్యనీ అలా చూసి చిర్రెత్తిన సరోజ 'ఇలా పిచ్చి కాలక్షేపం చెయ్యకపోతే, కాస్త పిల్లల్ని లేపవచ్చు కదా!' 'రాజూ లతా లేవండి' అంటూ వాళ్ళిద్దరినీ మంచమ్మీద నుండి లేవదీసి బ్రష్ చేసుకోవటానికి బాత్‌రూమ్ దాకా లాక్కెళ్ళింది.

'మమ్మీ, నాక్కొంచెం హార్లిక్స్ కలిపియ్యి" అని రవి అనగానే 'నాక్కూడా మమ్మీ' అంటూ వంత పాడింది లావణ్య. 'వంటింట్లోకొచ్చి మీరే కలుపుకుని తాగండి. అసలే ఇవేళ ఆలస్యమయ్యేటట్టుంది' అంటూ వంటింట్లోకి నడిచింది సరోజ. చిన్నపిల్లలు ఇద్దరికీ, తనకూ, భర్తకూ లంచ్ బాక్సులు సర్దేటప్పటికి ఏడున్నర అయ్యింది.

"టీవీలో వచ్చే అడ్వర్టైజ్‌మెంట్లను అనుకరిస్తూ పిల్లలు గదిలో గోల చేస్తున్నారు. ఆ గోల భరించలేక పరుగెత్తుకెళ్ళింది సరోజ. ఆ రోజు శనివారం కావటంతో వైట్ యూనిఫారమ్ తీసి మంచంమీద పెట్టింది సరోజ ఇంతకుముందు. 'విప్రో సేఫ్ వాష్‌నే వాడండి' అని రాజు తన షర్టు చూపిస్తూ గంతులు వేస్తుంటే, స్నానం చేశాక చుట్టుకున్న టర్కీటవల్‌తోనే గదంతా తిరుగుతూ తన స్కర్ట్, షర్ట్ చూపిస్తూ ట్రిపుల్ ఎక్స్‌నే వాడండి అని రవికి పోటీగా అరుస్తోంది లత. 'సిగ్గు లేకుండా ఏమిటే ఆ తిరగడం?' అంటూ లతను గట్టిగా గదిమింది సరోజ.

'సిగ్గా! అంటే ఏమిటి మమ్మీ?'

లత ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో అర్థంకాక, 'సాయంకాలం తీరిగ్గా చెప్తాలే, ముందు నడు, జడలు వేస్తా' అంటూ హాల్లో కూర్చోపెట్టి జుట్టు విప్పింది. కొబ్బరి నూనె రాద్దామని చేతిలోకి తీసుకొని రాయబోతుంటే, 'ఫైవ్‌ప్రాబ్లమ్స్, వన్ సొల్యూషన్... ఫలానా షాంపూనే వాడండి' అంటూ టీవీ ప్రకటనలో కన్పిస్తున్న సెలబ్రిటీ హీరోయిన్‌ను అనుకరిస్తూ సరోజ చేతిలోజుట్టు ముందుకు లాగింది లత. దాంతో చేతిలోనూనె తొణికింది. ఒళ్ళుమండిన సరోజ లతనెత్తిమీద మొట్టికాయవేసి, 'అత్తయ్యగారూ, కొంచెం ఆ టీవీ తగ్గిద్దురూ' అంటూ ఎలాగో అలా జడలు వేశాననిపించి, లతను, రాజుని ఆటో ఎక్కించింది.

తిరిగి లోపలికి వస్తుంటే చెవుల్లో ఇయర్ ఫోన్స్ పెట్టుకొని సెల్‌ఫోన్లో పాటలు వింటూ లావణ్య, టీవీలో ఏదో కార్యక్రమాన్ని ఉత్కంఠభరితంగా చూస్తూ రవి ఉప్మా తింటూ కనిపించారు.

"బాబోయ్ ఎనిమిది దాటిపోయింది. తొమ్మిదింటికల్లా బస్ స్టాప్‌లో ఉండాలి, లేకపోతే బస్సు వెళ్ళిపోతుంది' అనుకుంటూ హ్యాండ్‌బ్యాగ్ భుజాన వేసుకుని 'అత్తయ్యగారూ, తలుపులు జాగ్రత్తగా వేసుకోండి. పనిమనిషివస్తే చూసుకోండి' అని గుమ్మం దాటబోతుంటే 'అమ్మాయ్, దీపావళి సేల్ పెట్టారట. రెండుచీరలు కొంటే ఒకటి ఉచితం! నువ్వు వచ్చేదారిలోనే, వచ్చేటప్పుడు ఒకసారి చూసిరా' అంది సావిత్రమ్మ టీవీలో ఆ ప్రకటన చూస్తూ.

**ఆ ఇంటికెళ్ళి చూడండి. ఎవరిగోల వారిదే. హడావుడి చాకిరీతో ఉద్యోగానికి పరుగెత్తే తల్లి, సీరియల్స్ చూడ్డంలో తలమునకలయ్యే బామ్మ, టీవీలో యాడ్స్ అనుకరిస్తూ అల్లరితో కాలక్షేపం చేసే పిల్లలు, టెక్నాలజీలో మునిగి తేలిపోయే ఎదిగిన పిల్లలు, ఆఫీసు ఫైళ్ళతో కుస్తీపట్టే తండ్రి.... అంతా రొటీన్! ఇంకా చెప్పాలంటే ఆ ఇంట్లో టీ.వీ.దే డామినేషన్! కానీ అనుకోకుండా వాళ్ళింట్లో ఒకరోజు ఏం జరిగిందంటే...?**

'అలాగేలెండి' అంటూ పరుగులాంటి నడకతో ఇంట్లో నుండి బైటపడింది సరోజ.

•••

రాత్రి ఎనిమిది దాటుతోంది. బస్సుదిగి ఇంటి దారి పట్టింది సరోజ. ఆమెకు నలుగురు పిల్లలు. పెద్దవాడు రవి బి.టెక్., పెద్దమ్మాయి లావణ్య ఇంటర్మీడియట్ చదువుతున్నారు. రాజు, లత ఇద్దరూ కవలపిల్లలు. నాల్గవతరగతి చదువుతున్నారు. ప్రతిదానికీ ఒకరితో ఒకరు పోటీపడు తుంటారు. రవి, లావణ్య నేటితరం యువత ప్రతినిధులు. ఫ్రెండ్స్, సినిమాలు, సెల్‌ఫోనులు లేటెస్ట్ ఫ్యాషన్ దుస్తులు ధరించటం...ఇవీ వాళ్ళ ప్రాధాన్యాలు. ఆఫీసు, ఫైళ్ళు, పేపరు చదవటం, టీవీ చూడటంతప్ప సరోజభర్త ప్రభాకరం ఇంటి విషయాలు పెద్దగా పట్టించుకోడు. సరోజపై గట్టి నమ్మకం. ఇంక అత్తగారు సావిత్రమ్మ మంచిదే. పొద్దున్నే లేచి ప్రవచనాలు ఎంత శ్రద్ధగా వింటుందో, అంతే శ్రద్ధగా సాయంత్రం తెలుగు సీరియల్స్‌కూడా చూస్తూ ఉంటుంది. కోడలితో ఆ సీరియల్స్ గురించి చర్చిస్తూ ఉంటుంది. పైగా ఆ సీరియల్స్‌లో హీరోయిన్లు, వివిధకార్యక్రమాల్లో యాంకర్లు కట్టుకునే చీరలు గమనిస్తూ ఉంటుంది. 'నువ్వు కూడా అలాంటి చీరలు కొనుక్కో, అలా ఫ్యాషన్‌గా బ్లౌజులు కుట్టించుకో' అంటూ ఉంటుంది. ఆవిడకి ప్రభాకరం ఒక్కడే కొడుకు. కోడలైనా, కూతురైనా ఆమెకు సరోజే. మామగారు రంగనాథం భోజనప్రియుడు. రుచికరంగా వండిపెట్టి, నాలుగు కబుర్లు చెబితేచాలు సంతోషపడిపోతాడు.

ఇంటిదగ్గర పిల్లలు ఏం చేస్తున్నారో, హోం వర్కు చేసుకుంటున్నారో లేదో, లావణ్య, రవి ఏమన్నా పట్టించుకుంటున్నారోలేదో, అందరూ టీవీకి అతుక్కుపోయారేమో, వంట ప్రయత్నమేమైనా మొదలుపెట్టారో లేదో అనుకుంటూ గేటు తీసి లోపలికి నడిచింది సరోజ.

'అమ్మాయ్, ఇంత ఆలస్యమైందేమిటి? పాపం, బస్సులు దొరకలేదులా ఉంది. అలసిపోయినట్టున్నావు. వెళ్ళి ముఖం కడుక్కురా, వేడిగా కాఫీ

# వస్తాడు నా రాజు...

ప్రియాంక సిస్టర్‌గా బాలీవుడ్‌లోకి అడుగుపెట్టినా, అక్క కన్నా ఎక్కువ గాసిప్పులు సొంతం చేసుకుంది. మొన్న మొన్నటిదాకా పరిణీతి ఎవరినో ప్రేమిస్తోందనే పుకార్లు బాగా షికారు చేశాయి. వాటికి ఫుల్‌స్టాప్ పెట్టాలనుకున్న పరిణీతి ఓ ఇంటర్వ్యూలో తన మనసులోని మాట బయట పెట్టేసింది. ఇప్పటి వరకూ తను ఎవరినీ ప్రేమించలేదనీ, ఎవరితోనూ డేటింగ్ చేయలేదనీ స్పష్టం చేసింది. తన మనసును అర్థం చేసుకునే వాడి కోసం తనూ ఎంతగానో ఎదురు చూస్తున్నాననీ అంటోంది. తనను ప్రేమించేవాడి కోసం తన గుండె తలుపులు తెరిచే ఉంచానని చెబుతోంది. అయితే బాలీవుడ్‌లో ఓ దర్శకుడితో పీకల్లోతు ప్రేమలో మునిగిపోయిందనీ, అతగాడి దయవలనే వరుస ఆఫర్లు అందుకుంటోందన్న పుకార్లను మాత్రం ఎక్కడా ప్రస్తావించకుండా జాగ్రత్త పడిందట!

ఇస్తా' అంటూ సావిత్రమ్మ గుమ్మంలో ఎదురవ్వగానే ఆశ్చర్యపోయింది సరోజ. 'ఈ పాటికి టీవీ సీరియల్ చూస్తూ ఉండాలికదా అత్తగారు' అనుకుంటూ ముఖం, కాళ్ళు, చేతులు కడుక్కునివచ్చి ఆవిడ ఇచ్చిన వేడికాఫీ రుచిని ఆస్వాదిస్తూ, 'ఇదేంటి? ఇల్లంతా ఇంత నిశ్శబ్దంగా ఉంది, పిల్లల్లేరా?' అనుకుంది. వాళ్ళ గదిలోకి అడుగుపెట్టిన సరోజ కరెంటుషాక్ కొట్టినట్టు నిలబడిపోయింది. రాజు, లత ఇద్దరూ స్టడీ టేబుల్ దగ్గర కూర్చుని హోంవర్క్ చేసుకుంటున్నారు. రవి చదువుకుంటున్నాడు లావణ్య ఎక్కడుందీ? అనుకుంటూ బాల్కనీలోకి తొంగిచూచిన సరోజకి, అక్కడ పడక కుర్చీలో కూర్చుని భాగవత పద్యాలు గొంతెత్తి పాడుకుంటున్న రంగనాథం గారు, పక్కనే కూర్చుని విని ఆనందిస్తున్న ప్రభాకరం కనిపించారు. 'ఆహా! ఏమి నా అదృష్టం! వాతావరణం ఇంతప్రశాంతంగా ఉంది' అనుకుంటూ వంటింట్లోకి వెళ్ళింది సరోజ. లావణ్య గిన్నెలు సర్దుతూ కన్పించింది. 'నువ్వేంటి ఇక్కడ వంటగదిలో?' ఆశ్చర్యపోయింది సరోజ. ఎందుకంటే లావణ్య ఎప్పుడూ వంటగదిలోకివచ్చి అంతకుదురుగా పని చేయదు.

'వంటైపోయిందే సరోజా! లావణ్య కూరలు తరిగిస్తే నేను చేసేశాను. పద, అందరం కలిసితిందాం. అందరినీ పిలవ్వే లావణ్యా' లోపలికివస్తూ చెప్పింది సావిత్రమ్మ.

అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర చేరారు. లావణ్య అందరికీ కంచాలు, మంచినీళ్ళ గ్లాసులు పెట్టింది. 'నేనూ పెడతాను' అంటూ వచ్చింది లత. 'నువ్వు కూడా కూర్చోవే అమ్మాయ్, నేను వడ్డిస్తాను' అంటూ సావిత్రమ్మగారు వడ్డిస్తుంటే మధ్య మధ్యలో లావణ్య సహాయం చేస్తోంది. వీళ్ళందరికీ ఇంత పొత్తు ఎలా కుదిరిందబ్బా! రోజూ లాగా టీవీ దగ్గర ఒకరు, ల్యాప్‌టాప్‌దగ్గర ఒకరు, బెడ్‌రూమ్‌లో ఒకరు తినకుండా అందరూ ఇక్కడే కూర్చున్నారేమిటబ్బా' అనుకుంటూ ఆ మాట మనసులో దాచుకోలేక అడిగేసింది సరోజ.

'ఓహో! అదా? ఇవాళ టీవీ లేదుగా!' అంది లత.

'లేకపోవడమేమిటి?' అర్థంగాక అడిగింది సరోజ.

టీవీ పిక్చర్ ట్యూబ్ పాడైతే రిపేరుకిచ్చాను. అది బాగవడానికి రెండురోజులు పడుతుందన్నాడు షాపు వాడు' అన్నాడు ప్రభాకరం.

'ఇదా! అసలు సంగతి!' అనుకుంది సరోజ మనసులో.

కొడుక్కి, మనవలకి కొసరి కొసరి వడ్డించింది సావిత్రమ్మ. 'చూశార్రా, మీ నాయనమ్మకి మీరంటే ఎంతప్రేమో, రోజూ ఈ ప్రేమంతా ఎక్కడ దాచిపెడుతోందో అడగండి' ఛలోక్తులు విసిరారు రంగనాథంగారు.

తొమ్మిదిన్నరకల్లా భోజనాలు ముగించి అందరూ బాల్కనీలో చేరారు. 'సిగ్గంటే ఏమిటో సాయంకాలం తిరిగ్గా చెప్తానన్నావుకదా మమ్మీ' అంటూ గుర్తుచేసింది లత. 'అదేమిటే, సిగ్గుపడటం అంటే ఏమిటో తెలియదా' ఆశ్చర్యపోయింది సావిత్రమ్మ.

ఇదే మంచి అదను అనుకుంది సరోజ. 'అత్తయ్యగారూ, మీరు అన్ని టీవీ సీరియల్స్ చూస్తారు కదా! మీ మనమరాలు కూడా మీ పక్కనే కూర్చుంటూ ఉంటుంది. ఆ సీరియల్స్‌లో ఆడపిల్లలు సిగ్గుపడే దృశ్యం ఏదైనా ఉంటే దానికి గుర్తుచేద్దురూ, మీకు పుణ్యముంటుంది. దానికెలా చెప్పాలో అర్థం కావటంలేదు' అంది.

నిజమే సరోజా, మంచి ఆలోచన చెప్పావు అంటూ గడ్డం కింద చెయ్యి ఆనించి చాలాసేపు ఆలోచించింది సావిత్రమ్మ. కానీ ఏమీ తట్టలేదు. 'అబ్బే! లాభంలేదే, ఏమీ గుర్తుకురావటం లేదు' అందావిడ. గుర్తుకు రావడానికి అసలు ఆడపిల్లలు సిగ్గుపడటం చూపిస్తే కదా! ఆధునికత మరీ ముదిరిపోయింది. ఆడ లక్షణమే మరచిపోయారు అంది కసిగా సరోజ. 'నువ్వు అన్నది నిజమే సరోజా, 'స్త్రీకి సిగ్గే సింగారం' అన్నారు. కానీ ఈరోజుల్లో ఆ సహజ సింగారమేదీ? కట్టుకోబోయే మొగుడినే అరేయ్, ఒరేయ్ అంటున్నారు. ఇంక ఆడవిలన్ పాత్రలకి కొదవేలేదు సీరియల్స్‌లో' అంది సావిత్రమ్మ.

మరెందుకోయ్? ఆ సీరియల్స్ చూస్తావు. అలాంటివన్నీ చూసిచూసి నీకా లక్షణాలన్నీ ఒంటబడతాయేమో, సీరియల్స్‌లో అత్తగారిలా తయారవుతావేమోనని భయమేస్తూ ఉంటుంది. అవన్నీ తగ్గించి మనవలకి కాస్త మంచి లక్షణాలు నేర్పించవచ్చు కదా!' అన్నారు రంగనాథంగారు అత్తాకోడళ్ళ సంభాషణలో తల దూరుస్తూ.

'అబ్బా, బామ్మా, ఇంతకీ సిగ్గంటే ఏమిటో చెప్పలేదు మీరిద్దరూ' మళ్ళీ గోల చేసింది లత.

'సావిత్రి, జమున, సరోజాదేవి నటించిన పాత సినిమాలు దీనికి చూపిస్తే అర్థమవుతుందేమో' సాలోచనగా అంది సావిత్రమ్మ.

'అంతదాకా ఎందుకోయ్? నువ్వే చూపించొచ్చుకదా' రంగనాథంగారు ఆ మాట అనగానే 'ఛీ పోదురూ, మరీ పిల్లల ముందు ఈ మాటలు' అంటుంటే సావిత్రమ్మగారి ముఖం ఎర్రగా కందిపోయింది.

'లతా చూడమ్మా, ఇదేనమ్మా సిగ్గంటే' అని రంగనాథంగారు అనగానే అంతవరకు ఎంతో ఆసక్తిగా వాళ్ళ సంభాషణ వింటున్న లావణ్య, రవి, ప్రభాకరంతో సహా అందరూ గట్టిగా నవ్వేశారు.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌తో
## రోగ నివారణ సులభం - రోగనిరోధక వ్యవస్థ పటిష్టం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ప్రస్తుత చల్లని వాతావరణంలో చాలా మంది అనేక వ్యాధుల బారిన పడుతుంటారు. వాతావరణానికి తగ్గట్లుగా ఆహారనియమాలు పాటించటంతో పాటు, జీవన విధానంలో మార్పులు చేసుకున్నప్పటికీ అకస్మాత్తుగా ఏర్పడే వాతావరణ మార్పులకు కొన్ని సార్లు శరీరం సిద్ధంగా లేకపోవడం మరియు ఆ సమయంలోనే పరాన్నజీవులు శరీరంపై దాడి చేయడం వలన శరీర రోగనిరోధక శక్తి తగ్గిపోవడం - తద్వారా వ్యాధులకు గురికావడం జరుగుతుంది. అధిక మానసిక ఒత్తిడి వలన కూడా శరీర రోగనిరోధక వ్యవస్థ అసమతుల్యతలకు గురి అవుతుంది. ముఖ్యంగా మనం జబ్బు పడుతున్నామంటే మన శరీర రోగనిరోధక శక్తి తగ్గిపోవడమే అందుకు ప్రధాన కారణం. కాబట్టి ఈ రోగనిరోధక వ్యవస్థ (immune system) ఏ విధంగా పని చేస్తుంది? హోమియో వైద్యవిధానం ద్వారా ఇది ఏ విధంగా బూస్ట్ చేయబడుతుంది? అనే విషయాలను ఇప్పుడు తెలుసుకుందాం.




సాధారణంగా రోగనిరోధక వ్యవస్థ అనేది - మన శరీరంలోని వివిధ అవయవాలూ, వాటి ప్రక్రియల సమ్మేళనంగా ఉంటూ - మనకు వ్యాధులను కలిగించే బ్యాక్టీరియా, వైరస్ మరియు ఫంగస్ మొదలైన వాటి నుండి శరీరానికి రక్షణ కల్పించే ఒక కీలకమైన వ్యవస్థ. ఇది కొంతవరకు వారసత్వ రీత్యా ఏర్పడితే, మరికొంతవరకు మనం అవలంబించే జీవన విధానాల ద్వారా ఏర్పడటం జరుగుతుంది. ఈ రోగనిరోధక వ్యవస్థ సహజంగా మన శరీర కణజాలమంతటా వ్యాపించి ఉంటుంది. ఉదా: చర్మం క్రింది భాగం, బోన్ మ్యారో, లింఫ్ గ్రంథులు, రక్తం మరియు ప్లీహం మొదలైనవన్నీ రోగనిరోధక వ్యవస్థ ప్రక్రియలో ప్రధాన భూమిక వహిస్తాయి. సాధారణంగా మన శరీరంలో చాలా రకాల బ్యాక్టీరియాలు, వైరస్‌లు మొదలైనవి మనతోపాటు సహజీవనం సాగిస్తాయి. మనలోని రోగనిరోధక వ్యవస్థ సమతుల్యంగా ఉన్నంతవరకు వీటి ప్రభావం శరీరంపై ఉండదు. పైగా ఎప్పటికప్పుడు వీటి నుండి ఏర్పడే టాక్సిన్స్‌ను బయటకు పంపివేస్తుంది. ఏ కారణం చేతనైనా ఈ రోగనిరోధక వ్యవస్థ అసమతుల్యతకు గురి అయితే అవి (బ్యాక్టీరియా, వైరస్ మొ॥వి) మన శరీరంపై దాడి చేసి, వ్యాధులను కలుగజేస్తాయి. ఈ క్రమంలో రోగనిరోధక వ్యవస్థ మన ఆరోగ్యాన్ని తనంతట తానుగా (స్వీయ రీతిన) సరిచేసుకునే ప్రక్రియ కారణంగా శరీరంలో ఇన్‌ఫ్లమేషన్ ఏర్పడుతుందనే (ఉదా: జలుబు, టాన్సిలైటిస్ మొ॥వి.) సంగతి చాలామందికి తెలిసిన విషయమే.

సరైన పోషకాహారం ఆరోగ్యానికి చాలా అవసరం, అలాగే నిద్ర, విశ్రాంతి, ఉద్యోగం, వ్యాయామం మరియు నీరు మొదలైనవి మన ఆరోగ్యం నిలిపి ఉంచటంలో కీలక పాత్ర పోషిస్తాయి. కానీ ఇవన్నీ మన శరీరానికి అవసరమైన మోతాదులో అందినప్పుడే ఆరోగ్యం సమతుల్యంగా ఉంటుంది. ఉదా: ఎక్కువ మోతాదులో ఆహారం తీసుకోవడం వలన స్థూలకాయం మరియు తక్కువ మోతాదులో తీసుకుంటే పోషకాహార లోపం ఏర్పడుతుంది. అదేవిధంగా రోగనిరోధక శక్తి శరీరంలో ఉండవలసిన దానికంటే ఎక్కువ ఉత్తేజితంగా ఉన్నట్లయితే అలాంటి పరిస్థితి కొన్ని రకాల ఆటో ఇమ్యూన్ వ్యాధులకు (ఉదా: రుమటాయిడ్ ఆర్థరైటిస్) దారి తీస్తుంది. మనకు ఈ వ్యాధులు తలెత్తినప్పుడు మనలోని రోగనిరోధక వ్యవస్థ తన సొంత కణాలపైనే దాడి చేయడం జరుగుతుంది. కొన్ని సందర్భాలలో రోగనిరోధక శక్తి శరీరంలో తక్కువగా ఉన్నట్లయితే జలుబు వంటి సమస్యలు ఏర్పడతాయి. ఈ తరహా ఇబ్బందులు కొన్నిసార్లు తీవ్రమైన ఆరోగ్య సమస్యలకు దారి తీస్తాయి.

ఇతర వైద్య విధానాలలో కేవలం వ్యాధి లక్షణాలను మాత్రమే తగ్గించడం వలన వ్యాధి పూర్తిగా అణిచివేయబడి, వ్యాధి మూలాలు మాత్రం శరీరంలో అలాగే ఉండిపోవటం జరుగుతుంది. తద్వారా వ్యాధి మళ్ళీ తిరగబెట్టేదిగా ఉంటుంది. అది శరీరం లోపల నుండి పూర్తిగా తొలగించబడాలంటే మనం ప్రకృతి సిద్ధమైన వైద్య విధానాన్ని పాటించడం అవసరం. అలాంటి వాటిలో హోమియోపతి ఒకటి. ఇది ప్రకృతి సిద్ధమైన 'law of similars' అనే సిద్ధాంతంపై పనిచేస్తుంది. వ్యాధిని నివారించే ఔషధాలు ఆరోగ్యంగా ఉన్న వ్యక్తులపై ఉపయోగించినప్పుడు, అవి ఆ వ్యాధి లక్షణాలను కనబరుస్తాయి. దీనినే 'law of similars' అని అంటారు.
ఈ ఔషధాలను తక్కువ మోతాదులో ఆల్కహాల్ ద్రావకంలో గానీ లేదా నీటిలో గానీ విలీనపరచి ఎక్కువసార్లు కుదించడం ద్వారా దాని యొక్క ప్రాణాధార శక్తి (vital force) పెరిగి, అవి అసమతుల్యతలకు గురి కాబడిన రోగనిరోధక శక్తికి బలం చేకూర్చడం జరుగుతుంది. ఇలా బలాన్ని పొందిన రోగనిరోధక వ్యవస్థ తనంతట తానుగా వ్యాధిని సమూలంగా నిర్మూలించగలుగుతుంది. తద్వారా ఆ వ్యాధి మళ్ళీ తిరగబెట్టకుండా మరియు ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా పూర్తిగా నయం కావటం జరుగుతుంది.

హోమియోపతి విధానంలో వ్యాధికి మాత్రమే కాకుండా - వ్యాధితో బాధపడుతున్న వ్యక్తికి సరైన చికిత్స అందించడం జరుగుతుంది. ఇది కేవలం ఆ రోగిని వ్యక్తిగతీకరించడం (law of individualisation) వలన మాత్రమే సాధ్యమవుతుంది. ఎలా అంటే ప్రతి వ్యక్తికీ ఒక ప్రత్యేకత ఉంటుంది. ఏ ఇద్దరు వ్యక్తులూ ఒకే విధంగా ప్రవర్తించలేరు. అలాగే అనారోగ్య పరిస్థితులలో కూడా ఒక్కో వ్యక్తి కొన్ని ప్రత్యేక లక్షణాలను మానసికంగా గానీ, శారీరకంగా గానీ కనబరచటం జరుగుతుంది. ఇలాంటి ప్రత్యేక లక్షణాలను గుర్తించడాన్నే 'law of individualisation' అంటారు. దీని ద్వారా వ్యాధి మూలాలపై సమగ్ర అధ్యయనం జరిపి, ఆ వ్యక్తికి సరిపడిన ఔషధం (constitutional remedy) అందించడం ద్వారా రోగనిరోధక వ్యవస్థ బలపడి వ్యాధి సంపూర్ణంగా నయం కాబడుతుంది. ఇతర వైద్య వ్యవస్థల మాదిరిగా కాకుండా హోమియోపతి ప్రక్రియలో జన్యుపరమైన వ్యాధులను కూడా నయం చేయడం జరుగుతుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** కేవలం హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా అనుభవజ్ఞులైన వైద్య బృందంచే అనారోగ్యానికి గురి కాబడిన వ్యక్తి సమస్యపై పూర్తి స్థాయి అధ్యయనం జరిపి, తద్వారా వ్యాధి మూలాలను గుర్తించిన అనంతరం అందించబడే చికిత్స ద్వారా డయాబెటిస్, కీళ్ళ సమస్యలు, హార్మోన్ సమస్యలు, సంతానలేమి సమస్యలు, థైరాయిడ్ మరియు చర్మసమస్యలు మొదలైన వ్యాధులన్నింటినీ సమూలంగా మరియు ఇక మళ్ళీ జీవితంలో మరొకసారి తిరగబెట్టని విధంగా సంపూర్ణంగా నయం చేయుటం జరుగుతుంది.



# నాన్నకు ప్రేమతో....

ఈ టైటిల్ వింటే ఎన్టీఆర్ సినిమా గుర్తు కొస్తుంది కదూ! త్రిష చేస్తున్న పని చూస్తున్నా ఈ టైటిలే గుర్తుకు వస్తుంది. ఎలాగంటే... గతంలో త్రిష ఫాదర్ ఓ స్టార్ హోటల్‌లో పని చేసేవారట! అప్పట్లో ఆయన కూడా ఓ హోటల్ పెట్టాలని కలలుకనేవారట! ఆ కల తీర కుండానే ఆయన చనిపోయారు. ఇప్పుడు తండ్రి కోరికను తీర్చడానికి త్రిష నడుం కట్టింది. తండ్రి జ్ఞాపకార్థం బెంగళూరులో ఓ స్టార్ హోటల్ నిర్మాణానికి సన్నాహాలు చేస్తోంది. భారీ ఎత్తున నిర్మించబోతున్న ఈ హోటల్‌ని త్రిష మాత్రమే నిర్మిస్తోందా? లేక ఎవరినైనా భాగస్వాములుగా చేర్చుకుందా? అన్న విష యాలు తెలియాల్సి ఉంది.

'బామ్మా తాతయ్యా! మీరిద్దరూ అన్నీ లతకే చెబుతున్నారు, నాకేమీ చెప్పడం లేదు' బుంగ మూతి పెట్టాడు రాజు.

'నీకోసం బోలెడన్ని కథలు దాచానురా చెప్ప డానికి. మరి నువ్వేమో రోజూ టీవీలో కార్టూన్ ఛానల్ చూస్తూ కూర్చుంటావుగానీ నాతో మాట్లా డవు' అని రంగనాథం గారు అనగానే 'ఇప్పుడు చెప్పు తాతయ్యా టీవీ లేదుకదా' అన్నాడు రవి. నాక్కూడా అంటూ పక్కనే చేరింది లత.

తాతయ్య ఒడిలో ఒకరు, బామ్మ ఒడిలో ఒకరు కథలు వింటూ నిద్రపోయిన పిల్లల ముఖాల్లో ఎన్నడూ లేనంత సంతృప్తి కన్పించింది సరోజకు. సరోజా, నువ్వు కూడా వెళ్ళి పడుకో, పొద్దుపోయింది. వంటిల్లు పొద్దున్నే కడుక్కోవచ్చులే. రేపు సెల వేగా' అంది సావిత్రమ్మ.

'ఇంటికి కావలసినవేవో కొనాలంటున్నావు కదా, రేపు వెళ్దాంలే బైటికి' అన్నాడు ప్రభాకరం. 'అమ్మో! ఈ పూట నా జన్మ తరించింది' అను కుంది సరోజ.

•••

అందరం తీరిగ్గా ఉన్నాం కదా గుడికి వెళ్దాం అన్నది సావిత్రమ్మ. సరేనంటూ అందరూ తయార య్యారు. లతకి పట్టుపరికిణీ జాకెట్టువేసి, చక్కగా జడవేసి పూలుపెట్టింది సావిత్రమ్మ. బామ్మలాగా సిగ్గుపడటానికి ప్రయత్నిస్తున్న లతని చూసి 'బంతి పూలజానకీ ఇంత సిగ్గుదేనికీ...' అంటూ రాజు పాట అందుకున్నాడు. 'ఛీ అదేం పాటరా.. ఆపు' అంది సరోజ చిరాగ్గా.

అందరూ దగ్గరలో ఉన్న రామాలయానికి వెళ్ళారు. పండుగ రోజు కాకపోవడంతో నిశ్శబ్దంగా హాయిగా ఉంది. తనివితీరా దైవదర్శనం చేసుకొని మంట పంలో కూర్చున్నారు అందరూ. ఆ దేవాలయ ప్రాంగణంలో కన్పిస్తున్న బావిని చూడగానే సావి త్రమ్మకి ప్రభాకరం చిన్ననాటి సంఘటన గుర్తొ చ్చింది. రామాపురంలో వాళ్ళింటి దొడ్లో నూతి చప్టా దగ్గర సాయంకాలం పనిమనిషి సీతమ్మ పని ముగించగానే కాసేపు కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుతూ ఉండేది. సావిత్రమ్మకూడా ఆ కబుర్లు ఎంతో ఆసక్తికరంగా వినేది. సీతమ్మ కొడుకు పాపయ్య 15 ఏళ్ళవాడు. నూతి అంచుమీద చాలా నేర్పుగా డాన్స్ చేస్తుండేవాడు. ఒకరోజు ఇలాగే పాపయ్య డాన్స్ చేస్తుంటే నేనూ చేస్తానంటూ అతన్ని అనుకరించబోయి నూతిలో పడిపోయాడు ప్రభాకరం. అందరూ కంగారుపడ్డారు. పాపయ్యే నూతిలోకి దిగి ప్రభాకరాన్ని రక్షించాడు. చేంతాడు కట్టిన బకెట్టు నూతిలోకి దింపితే దాన్ని పట్టు కొని ప్రభాకరాన్ని పైకి లాక్కొచ్చాడు పాపయ్య. అప్పటికి ప్రభాకరం వయస్సు పదేళ్ళు. సావి త్రమ్మ ఇదంతా చెబుతుంటే పిల్లలు ఎంతో ఆస క్తిగా విన్నారు. 'ఓహో....సాగరసంగమంలో కమల్ హాసన్‌లా అన్నమాట అంది లత.. మరి చేంతాడు అంటే ఏంటి బామ్మా? అని ప్రశ్నించిన రవికి సావిత్రమ్మ సమాధానం చెప్పింది.

చూశావురా ప్రభాకరం, పిల్లలతో కుటుంబంతో మనం కలిసి ఇలా గడిపితే తెలియని ఎన్నో విష యాలు వాళ్ళు తెలుసుకుంటారు. నిన్న సాయంత్రం నుండి ఇల్లు చూడు ఎంత ప్రశాంతంగా ఉందో ఒకరిమాట ఒకరు చక్కగా వింటున్నారు. ఒకరి అనుభవాలు ఒకరు పంచుకుంటున్నారు. ఇదంతా టీవీ లేకపోవడంవల్లే! అది రిపేరుకెళ్ళడం వల్లనే కదా మనం ఇలా హాయిగా గడపగలుగుతున్నాం! అన్నారు రంగనాథంగారు.

'అవును నాన్నా, మీరన్నది నిజమే. ఇలా గడిపి ఎన్నేళ్ళయిందో!'

'టీవీ, కంప్యూటర్, సెల్‌ఫోను ఇవన్నీ చెడ్డవని నేను అననురా. సాంకేతిక పరిజ్ఞానానికి అబ్బుర పడి మేము కూడా వాటిని ఉపయోగించటం నేర్చుకుంటున్నాం. ఆధునిక నాగరికతకు అలవాటు పడుతున్నాం. కానీ మా తరంనుండి నేర్చుకోవల సిన సంస్కృతీ, సంప్రదాయాలు, వారసత్వవిలు వల్ని నేటితరం నేర్చుకోవటంలేదు. ఏదైనా చెప్పా లని ప్రయత్నించినాగానీ చాదస్తంగానే భావిస్తు న్నారు. సమాజంలో వచ్చే కొత్త పరిజ్ఞానం, మార్పు లతోపాటు, మన జాతిమూలాలు కూడా పిల్లలకు తెలియాలిరా. వాటికోసం కొంత సమయం కేటా యించండి. పాతవన్నీ బంగారమనీ, కొత్తవన్నీ పనికి రానివనీ మేమేం చెప్పం. పాతకొత్తల మేలు కలయికతోకూడిన విలువల్ని నేటి తరానికి అందిం చాలి. ఏమంటావురా?' అన్నారు రంగనాథం.

'నిజమే నాన్నా, ఇకనుండి నేనుకూడా టీవీ., సెల్‌ఫోన్, ల్యాప్‌టాప్ పక్కనపెట్టి పిల్లలకోసం కొంత సమయం కేటాయిస్తాను' అన్నాడు ప్రభా కరం.

"నేనుకూడా సరోజా, ముందు ఆ దిక్కు మాలిన సీరియల్స్ చూడటం మానేస్తాను. మన మలు, మనమరాళ్ళతో సరదాగా గడుపుతాను. నీక్కూడా పనిలో చేదోడు వాదోడుగా ఉంటాను".

'హమ్మయ్య! నువ్వు మారటం నాకెంతో సంతో షంగా ఉంది' అన్నారు రంగనాథంగారు.

'మేంకూడా మారతాం తాతయ్యా' అన్నారు రవి, లావణ్య, లత, రాజు.

'ఆహా! ఇలాంటి రోజొకటి జీవితంలో చూస్తా నని నేనెప్పుడూ అనుకోలేదు. అనుకోకుండా ఈరోజు ఎంత ఆహ్లాదంగా గడిచింది' యాంత్రికమైన దిన చర్యతో విసిగిపోయిన సరోజముఖంలో కోటి పున్న ముల వెలుగుచూసి ఇంక నేనెందుకిక్కడ' అను కుంటూ నీలిమబ్బుల చాటుకు తప్పుకున్నాడు నిండు చంద్రుడు.

నవ్య








## గ్రాడ్యుయేట్ శునకం

యూనివర్సిటీ నుంచి డిగ్రీ అందుకోవడమంటే మాటలు కాదు. మాటలు వచ్చిన మనుషులే డిగ్రీ అందుకోవడం ఓ గొప్ప విజయంగా భావిస్తుంటే... మరి మాటలు రాని శునకం డిగ్రీ అందుకుంటే ఇంకెంత గొప్ప విజయంగా భావించాలి! అదీ ప్రఖ్యాత ఓక్లహామా యూనివర్సిటీ నుంచి. ఇది జోక్ కాదు. నిజంగా నిజం. శామ్సన్ అనే శునకం ఓక్లహామా యూనివర్సిటీ నుంచి సర్వీస్ డాగ్‌గా డిగ్రీపట్టా అందుకుంది. రెండేళ్ళపాటు థెరపీ డాగ్‌గా ఈ యూనివర్సిటీలో శిక్షణ తీసుకుని, ఎంచక్కా సర్టిఫైడ్ సర్వీస్ డాగ్‌గా పట్టా అందుకుంది. అంతేకాదు, స్నాతకోత్సవంరోజు టోపీ, గౌన్ వేసుకోవడమే కాకుండా, 300 మంది విద్యార్థులతో పాటు పట్టా అందుకుని, అతిథులకు షేక్ హ్యాండ్ కూడా ఇచ్చింది. గ్రాడ్యుయేట్ శునకంగారు ఇక బైటి ప్రపంచంలో తమ సేవలను అందించవచ్చు! బాగుంది కదూ!

## టెడ్డీబేర్ గుర్రం

టెడ్డీబేర్... టెడ్డీబేర్... అంటూ పిల్లలు రైమ్ పాడుతుంటారు. అలాగే తమకు ఎంతో ఇష్టమైన టెడ్డీబేర్‌ని నిద్రలో కూడా తమతోనే ఉంచుకుంటారు. ఆ టెడ్డీబేర్ పక్కన లేకుండా కొందరు పిల్లలు అస్సలు నిద్రపోరు. పిల్లలే కాదండీ, ఓ గుర్రం కూడా పక్కన టెడ్డీ బేర్ లేకుండా నిద్రపోవటం లేదు. వినడానికి విచిత్రంగా ఉందికదూ!



ఇంగ్లండ్‌లోని డార్ట్‌మూర్ నేషనల్‌పార్క్‌లో గుర్రం పేరు బ్రీజ్. అది పుట్టిన కొన్ని గంటలకే తల్లి గుర్రం చనిపోయింది. అప్పట్నుంచీ బ్రీజ్ దిగాలుగా ఉండేది. అది గమనించిన సిబ్బంది, దానికి బటన్స్ అనే టెడ్డీబేర్‌ని తోడుగా ఇచ్చారు. ఇక దాంతో ఆడుతూ పాడుతూ, దాంతోనే కలిసి నిద్రపోతూ తన దిగులు మర్చిపోయి ఉత్సాహంగా ఉండసాగింది బ్రీజ్. అసలు బటన్స్ లేకుండా ఒక్కక్షణం కూడా ఉండదు బ్రీజ్. ఇప్పుడు బ్రీజ్‌కి మూడు సంవత్సరాలు. అయినా కూడా దానికి బటన్స్ తోడిదే లోకం!

జూ నిర్వాహకులు బ్రీజ్, బటన్స్ చిన్నప్పటి ఫోటోలు, ప్రస్తుత ఫోటోలు సోషల్‌మీడియాలో పెట్టారు. వాటికి మంచి స్పందన వస్తోంది. ట్వీట్లు, కామెంట్లతో నెటిజన్లు గుర్రం, టెడ్డీబేర్‌ల చక్కని స్నేహాన్ని అభినందిస్తున్నారు.

## సమాధుల నగరం

ఫొటోలో చూస్తున్నారుగా! ఎటువైపు చూసినా కనుచూపుమేర సమాధులేతప్ప మరేమీ కనిపించవు. ప్రపంచంలోకెల్లా అతిపెద్ద శ్మశానం ఇదే. ఎంత పెద్దదంటే, ఇక్కడ 50 లక్షల మందిని సమాధి చేశారంటే నమ్ముతారా! ఇరాక్ రాజధాని బాగ్దాద్‌కు 150 కిలోమీటర్ల దూరంలో ఉన్న నజాఫ్ పట్టణంలో ఈ సమాధిని మనం చూడవచ్చు. దీనిని వాదీ-ఉల్-స్సలామ్ అంటే శాంతిలోయ అని పిలుస్తారు. దీనిని 1400 సంవత్సరాల క్రితం నిర్మించారు. ఈ శ్మశానం మొత్తం 1485.5 ఎకరాల్లో విస్తరించి ఉంది. అంతేకాదండోయ్...ఇక్కడ ఎన్నో ఏళ్ళనాటి సమాధులు కూడా ఉన్నాయట. అంతటి పురాతన చరిత్ర ఉంది ఈ శ్మశానానికి! ఇక్కడ ఏటా ఐదులక్షల సమాధుల చొప్పున నిర్మిస్తారని ఒక అంచనా. కొత్త సమాధులు కట్టేకొద్దీ పాతవి ధ్వంసమవుతూంటాయి. అయినా సరే ఇప్పుడక్కడ 50 లక్షల సమాధులున్నాయట!



అప్పుడప్పుడే మాటలు నేర్చుకునే పసిపిల్ల మాటలు చిలకపలుకుల్లా ఉంటాయి. అదే బిడ్డ ఏ పద్యమో, శ్లోకమో పాడితే ఇంటిల్లపాదీ సంబరపడిపోతుంది. మరి నాలుగేళ్ళ వయసులోనే ఓ పసికూన ఏడేడు భాషల్లో అనర్గళంగా మాట్లాడేస్తుంటే...! అందరూ నోళ్ళు వెళ్ళబెట్టాల్సిందే కదా!

రష్యాకి చెందిన బెల్లా దెవ్యాట్కిన తన భాషా ప్రావీణ్యంతో పిట్ట కొంచెం కూత ఘనం అనిపించుకుంటోంది. ఏడు భాషల్లో అనర్గళంగా మాట్లాడుతూ బెల్లా ఇంటర్నెట్ సంచలనంగా మారింది. ఓ రష్యా ఛానల్ నిర్వహించిన 'అమేజింగ్ పీపుల్ టాలెంట్ షో'లో బెల్లా తన భాషాపటిమ ప్రదర్శించి ప్రేక్షకులను ఆశ్చర్యంలో ముంచెత్తింది. రష్యన్‌తోపాటు ఇంగ్లీష్, ఫ్రెంచ్, జర్మన్, స్పానిష్, చైనీస్, అరబిక్ భాషల్లో గలగలా మాట్లాడేస్తూ వ్యూవర్‌షిప్‌ను విస్మయపరిచింది. జడ్జిలు ఏ భాషలో ప్రశ్నిస్తే, ఆ భాషలోనే ఈ కూన చెప్పిన సమాధానాలు ఔరా! అనిపించాయి.

## పసికూన బహుభాషా ప్రావీణ్యం!



బెల్లా సాధించిన ఈ ఘనతకు కారణం ఆమె తల్లే! ఆమెకు స్వయంగా ఇంగ్లీష్ నేర్పడంతోపాటు అన్య భాషా మహిళలను కూడా ఆయాలుగా నియమించి అనర్గళంగా మాట్లాడేందుకు దోహదపడింది ఆమె తల్లి! భాష నేర్పించడంతోపాటు సామాజిక, ప్రపంచ విషయాలను కూడా తమ తమ భాషల్లో ఆయాలు బెల్లాతో చర్చిస్తారట. దీనివల్ల బెల్లా ఏడు భాషల్లో ప్రావీణ్యం సంపాదించగలిగింది. ఇటీవల టాలెంట్ షో ఆడిషన్స్‌లో పాల్గొని తన ప్రతిభను ప్రదర్శించిన వీడియో ప్రస్తుతం వార్తల్లో, సోషల్‌మీడియాలో హల్‌చల్ చేస్తోంది.

-నర్మద వాసిరెడ్డి

# మహానంది




-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**దమనకుడు వణుకుతున్న శరీరాన్ని అదుపులో పెట్టుకునే ప్రయత్నం చేస్తూ, పైకి లేవబోతూ చేతుల్ని నేలమీద ఆన్చి, అప్రయత్నంగా మూలిగాడు. చేతుల సహాయంతో అతను లేవలేడని నందికి తెలుసు.**

**"నీ చేతులకి 'నంది గ్రహణం' సోకింది. కనీసం ఒక్కవారం పాటు అవి పనిచేయవు. పాదాల బలంతో లేచి, పిక్కబలం చూపించు!" నంది ఎగతాళిగా అన్నాడు.**

దమనకుడు ఎర్రగా దెబ్బతిన్నట్టు చూశాడు. ముందు మోకాళ్ళ సహకారంతో శరీరాన్ని పైకి లేపాడు. గోడకు వీపు ఆన్చి అతి కష్టం మీద శరీరాన్ని పైకి లేపాడు. నందివైపు చూడకుండా బలహీనంగా కదిలాడు. తన 'పాద పీడనాన్ని' రుచి చూసిన కాలిమీద బరువు పడకుండా కుంటుతూ నడుస్తున్న దమనకుడి వైపు ఒకసారి చూసి, నంది గోడకు ఆనుకుని నిలుచున్న సరస్వతి వైపు చూపులు మళ్ళించాడు. సరస్వతి ఇప్పుడు చీర కట్టుకుని ఉంది. ఒంటినిండా పైట కప్పుకుంది. ఆమె ఎద ఇంకా అలలాగా స్పందిస్తూనే ఉంది.. తనవైపు చూడకుండా తల వాల్చుకుని, శరీరం ఈడ్చుకుంటూ వెళ్తున్న దమనకుడిని ఆమె రెప్పపాటు లేని అగ్ని గోళాల్లాంటి కళ్ళతో చూస్తోంది.

"సరస్వతీ, ఆ ఆబోతు చెంప పగలకొడ్తావా?" నంది ప్రశ్నించాడు.

సరస్వతి మెల్లగా తలతిప్పి నందివైపు చూసింది. ఆమె పెదవులు కదిలాయి. "ఆ నీచుడిని ఈ చేతుల్తో ముట్టుకోను! అక్కచేత వాతలు పెట్టిస్తాను!"

నంది నవ్వుతూ ఆమె దగ్గరగా నడిచాడు. గుమ్మం వద్దకు చేరిన దమనకుడు ఆగి, తిరిగి చూశాడు. చెమటతో తడిసిన అతని ముఖం జిడ్డు జిడ్డుగా ఉంది. కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. నందివైపు తదేకంగా చూశాడతను.

"ఇంతటితో కథ ముగిసిపోలేదు. నీ అంతు చూస్తాను!" దమనకుడు పళ్ళు కొరుకుతూ అని, గుమ్మం దాటాడు.

నంది సరస్వతి వైపు చూశాడు. "ఇలా ఎన్నిసార్లు ప్రయత్నించాడు?"

"ఇదే మొదటిసారి. ఈ జాడ్యం ఇప్పుడే పట్టుకుంది!" సరస్వతి పళ్ళు కొరుకుతూ అంది.

"నువ్వు జాగ్రత్తగా ఉండాలి..."

"నువ్వున్నావుగా అన్నా..?" సరస్వతి గాద్గదికంగా అంది, నంది ముఖంలోకి చూస్తూ.

నంది అప్రయత్నంగా ఆమె భుజం మీద చెయ్యి వేశాడు. సరస్వతి నంది ఎదమీద తలవాల్చి బలహీనంగా ఏడుస్తూ ఉండిపోయింది. నంది ఓదార్పుగా ఆమె తల నిమురుతున్నాడు.

•••

సరస్వతి ఏడుస్తూ చెప్పిందంతా భజరంగి మౌనంగా విన్నాడు. అతని ముఖం జేవురించింది. కళ్ళ కొసల్లో ఎర్రజీర ప్రత్యక్షమైంది. వేడి నిట్టూర్పు

### జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడు. మహారాజు న్యాయ విచారణ జరిపి అతణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు. అతడి కుటుంబాన్ని కూడా రాజద్రోహ పరివారంగా ప్రకటించాడు. అతడి కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రంచేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగురాజ్యంలో కట్టెలు కొట్టి బతికే భజరంగి ఇంట్లో ఆశ్రయం పొందుతాడు నంది. మరదలిపై పశుత్వం ప్రదర్శించబోయిన భజరంగి అల్లుడికి దేహశుద్ధి చేస్తాడు నంది. ఆ తర్వాత......

ద్వారా ఆగ్రహాన్ని నిగ్రహించుకుంటూ దగ్గరగా వెళ్ళి కూతురిని అక్కున జేర్చుకున్నాడు. వణుకుతున్న అతని వేళ్ళు సరస్వతి వీపుని నిమురుతున్నాయి.

“నిన్ను ముట్టుకున్న ఆ దౌర్భాగ్యుడి చేతుల్ని నరికివేయాలి. కానీ...కానీ... ఆ చేతులకి ఈ చేతుల్తో ఒక కూతుర్ని అందించాను తల్లీ...” భజరంగి బొంగురుగా అన్నాడు. “భయపడకమ్మా...ఈ క్షణం నుండీ నిన్ను కంటికి రెప్పలా కాపాడుకుంటాను!”

“నాన్నా...” సరస్వతి గాద్గదికంగా అంది.

భజరంగి కూతుర్ని సున్నితంగా ఎడంగా జరిపాడు. బుగ్గల్ని తడిపేస్తున్న ఆమె కన్నీటి కాలువల్ని ఉత్తరీయం కొసతో తుడిచాడు. ధైర్యంగా నిలుచున్న నంది వైపు చూశాడు. నాయనా నందీ, నీకు రుణపడిపోయే సహాయం చేశావు. ఆ దేవుడే నిన్ను నా కన్నతల్లిని కాపాడ్డానికి పంపించాడనిపిస్తోంది.”

నంది తదేకంగా భజరంగిని చూశాడు. “అలా అనకండి పెదనాన్నా...నా స్థానంలో ఎవరున్నా సరస్వతిని ఆదుకునేవారు. మీకు తెలియదని కాదు కానీ, అనుక్షణమూ రక్షణ కవచంలా ఎవ్వరమూ ఉండలేము. ఆలస్యం చేయకుండా...”

“అమ్మాయికి వివాహం జరిపించేస్తాను.”

“మంచి నిర్ణయం. అదే సరస్వతికి ‘శ్రీరామరక్ష’. నువ్వు జాగ్రత్తగా ఉండాలమ్మా అంటే, ‘నువ్వున్నావుగా అన్నా!’ అంది సరస్వతి. నేను సర్వాంతర్యామిని కాను కదా! శాశ్వతంగా ఇక్కడ ఉండలేను కదా! పైగా దమనకుడిని శాశ్వత ప్రాతిపదికన దండించే అవకాశం లేదు. అతను మీ కుమార్తె పెనిమిటి..”

“ఔను...అదే నా దౌర్భాగ్యం” భజరంగి బరువుగా నిట్టూర్చాడు.

“అది దమనకుడి బలం; మీ బలహీనత! మీరు అతని వీపుమీద వాత పెడితే అక్కయ్య లక్ష్మివీపు మీద గాయమవుతుంది!”

భజరంగి అవునన్నట్టు తలాడించాడు. “లక్ష్మికి ప్రసవం అయ్యేదాకా తన ఇంట్లోనే ఉంచుకుంటానంది లక్ష్మి పిన్ని. సరస్వతిని అక్కడ వదిలేస్తాను. ఆ ఇంట నిండు జనం ఉన్నారు. ఇక్కడ ఒంటరిగా ఉండటం అమ్మాయికి క్షేమం కాదు. దమనకుడిది పాము పగ..” భజరంగి అన్నాడు.

“నాన్నా...మీ భోజనం...” సరస్వతి అంది.

భజరంగి నవ్వాడు. “నువ్వు మూడేళ్ళ పిల్లగా ఉన్నప్పుడే మీ అమ్మ పోయింది. అప్పట్నుంచీ వంట ఎవరు చేశారమ్మా! మీ నాన్నేగా! వెళ్దాం సిద్ధంకా!”

సరస్వతి అరుగుమీద నుండి ఇంట్లోకి వెళ్ళింది. భజరంగి నంది వైపు చూశాడు.

“ఆ మదించిన జంతువు ఎక్కడ నాయనా?”

“ఎందుకైనా మంచిదని ఒక కాలు కుంటేలా చేశాను. రెండు చేతులనూ ‘గాధేయముష్టి’లో ఇరికించాను. ఫలితంగా కొన్ని దినాలపాటు బలమైన పనులు చేయలేడు...”

“గాధేయముష్టి... ఎప్పుడూ వినలేదు... ఏమిటి నందీ అది?” భజరంగి ప్రశ్నించాడు.

“నా పితామహులు నేర్పించిన పట్టు అది. పిడికిలితో బిగించి పట్టుకోవడం అన్నమాట. ‘గాధేయం’ అంటే ఉడుము పిల్ల. గాధేయముష్టి అంటే ‘ఉడుం పట్టు’ అని అర్థం. ఆ పట్టునీ, దాని నామధేయాన్నీ సృష్టించింది మా తాతగారే!”

“బాగుంది...అయితే దమనకుడు..”

“కుంటుతూ ఆవరణ దాటివెళ్తుంటే చూశాను” నంది అన్నాడు. “ఎక్కడికైనా అలిగి వెళ్ళిపోయి ఉంటాడా పెదనాన్నా?”

భజరంగి చిన్నగా నవ్వాడు. “అల్లుడి అలక అలక కాదు. ఇంటల్లుడి అలక ఆకలి వేసేదాకే! తోక ఆడించుకుంటూ విస్తరి వేసే వేళకి సిద్ధమవుతాడు!”

“నేను బండి తీసుకువస్తాను” నంది అరుగు వద్ద నుండి గుర్రం ఉన్న వైపు వెళ్ళాడు.

కాసేపట్లో భజరంగీ, సరస్వతీ, అశ్వ శకటం మీద కూర్చున్నారు. నంది నొగలి మీద కూర్చుని, అశ్వాన్ని అదిలించాడు. బండి ఆవరణ ప్రధాన ద్వారం వైపు వేగంగా వెళ్తోంది.

ఆవరణలో ఉన్న గంగరావి చెట్టు చాటున దాక్కున్న దమనకుడు చాటు నుండి వెలికి వచ్చి, ఎర్రటి కళ్ళతో బండి వైపే చూస్తున్నాడు.

●●●

విస్తర్లు వేసే వేళకు ఇల్లరికం అల్లుడు సిద్ధమవుతాడన్న భజరంగి ఊహ తప్పుగా తేలిపోయింది! సరస్వతిని పిన్ని ఇంట్లో దిగబెట్టి వచ్చాక, భజరంగి అనుకున్నట్టు దమనకుడు ఇంట్లో గానీ, ఆవరణలో గానీ లేడు. ఆ రాత్రి కూడా దమనకుడు ఇంటికి రాలేదు. చప్పుడు చేయకుండా, అర్ధరాత్రి దాటాక, అతను నిద్రించే శయ్యా కుటీరంలో చూశాడు భజరంగి. దమనకుడు లేడు!

మరునాటి మధ్యాహ్నం భోజన సమయంలో నంది తన సందేహాన్ని భజరంగి ముందు వ్యక్తం చేశాడు.

“పెదనాన్నగారూ...నేను మీ అల్లుడిపట్ల అతిగా స్పందించానా?”

“ఎందుకు నందీ ఆ సందేహం?”

“సోదరి లక్ష్మికి నేను నష్టమూ, కష్టమూ కలిగించానేమో అనిపిస్తోంది. దమనకుడి మీద అతిగా బలప్రయోగం చేశానేమో అనిపిస్తోంది. ఆమె నిండు చూలాలు. భర్త ఆగ్రహావేశాలతో, అవమానంతో దూరంగా వెళ్ళిపోతే ప్రథమ నష్టం; ప్రధాన నష్టం రెండూ ఆమెకే. ఆమెకు పరోక్షంగా నేను అన్యాయం చేశానేమో అనిపిస్తోంది...”

భజరంగి చిన్నగా నవ్వాడు. “నువ్వు కల్పించుకోకపోయి ఉంటే, సరస్వతికి ప్రత్యక్షంగా అన్యాయం జరిగిపోయి ఉండేది. నా చిట్టితల్లి ఇప్పటికి ఆత్మహత్య చేసుకుని ఉండేది! లక్ష్మికి జరిగిన అన్యాయం, కష్టం, నష్టం అన్నీ తాత్కాలికాలే. సర



స్వతికి శాశ్వత నష్టం జరిగి ఉండేది! నువ్వు సరస్వతికి మానరక్షణ చేశావు; ప్రాణరక్షణ చేశావు. లక్ష్మి నిన్ను అపార్థం చేసుకోదు."

●●●

భజరంగి విశ్లేషణ యదార్థమే అని ఆ మరునాడు తేలిపోయింది. మరునాటి సాయంత్రం భజరంగి ఇంటి ముందు ఒక బండి ఆగింది. నొగలి మీద లక్ష్మి తమ్ముడు ఉన్నాడు. అందులోంచి అతని జ్యేష్ఠ పుత్రిక లక్ష్మి దిగింది.

భజరంగి ఆదరాబాదరా వెళ్ళి కూతురి చెయ్యి పట్టుకున్నాడు. "ఏం జరిగింది తల్లీ? అకస్మాత్తుగా వచ్చావు?"

"ఇంట్లోకి వెళ్దాం నాన్నా..." అంటూ ఇంటివైపు నడవసాగింది. "నంది ఎక్కడ నాన్నా?"

"ఏమ్మా?"

"ఒకసారి రమ్మను నాన్నా.." అంటూ లక్ష్మి ఇంట్లోకి వెళ్ళింది.

కాసేపట్లో భజరంగీ, నందీ లక్ష్మి ఎదురుగా కూర్చున్నారు.

"అమ్మా....నేను.." నంది ఏదో చెప్పబోయాడు.

"మంచిపని చేశావు. నాకు అన్నీ తెలుసు. చెల్లెలు చెప్పింది..." లక్ష్మి అతన్ని వారిస్తూ అంది.

నంది మౌనంగా చూశాడు.

"లక్ష్మీ..ఏం జరిగింది? దమనకుడు..." భజరంగి అన్నాడు.

"పిన్ని ఇంట్లో ఉన్నాడు నాన్నా. తన గురించి బాధపడకండి. నా భర్త నందిమీద పగబట్టాడు. నువ్వు ఆరోజు రాత్రి నాకూ, చెల్లికీ చెప్తుంటే విన్నట్టున్నాడు. నంది కామరూప రాజ్యం నుండి బహిష్కరించబడిన అపరాధి అని అతనికి తెలుసు..."

"నంది శిక్షకూ, దమనకుడు పగబట్టడానికీ సంబంధం ఏమిటమ్మా? తెలిస్తే ఏం? నంది ఆ విషయాన్ని దాచుకుని తన గురించి కల్పిత కథలు చెప్పలేదే?" భజరంగి అన్నాడు.

"నన్ను చెప్పనీ నాన్నా...నందిని ప్రత్యేకంగా హెచ్చరించడానికి తమ్ముణ్ణి తీసుకుని అతి రహస్యంగా వచ్చాను. నంది త్వరగా ఇక్కణ్ణుంచీ, ఈ రాజ్యం నుండీ వెళ్ళిపోవాలి..."

భజరంగీ, నందీ లక్ష్మివైపు ప్రశ్నార్థకంగా చూశారు.

"చోరుల్ని పట్టుకునే ఉద్యోగం కొంతకాలం పాటు నీ అల్లుడు వెలగబెట్టాడుగా నాన్నా? నేరాలు చేసి, ఇతర దేశాల నుండి మన రాజ్యంలోకి ప్రవేశించే వ్యక్తులు చోరులుగా, నేరస్థులుగా పరిగణింపబడతారట. నందిని మహా చోరుడుగా చిత్రించి, తనకు పరిచయం ఉన్న సంబంధిత రాజోద్యోగికి అప్పగించే పథకం వేశాడు నా భర్త. మన పట్టణంలో ఉన్న ప్రతినిధితో మాట్లాడుతూ ఉంటే విన్న యువతి నాకు చెప్పింది. ఆ యువతి, ఆ ప్రతినిధి కూతురు; నా స్నేహితురాలు. మన పుష్పగిరి రాజధానిలో ఉన్న చోర పర్యవేక్షక అధికారికి నీ అల్లుడు స్వయంగా విన్నవించి, నందిని పట్టించే ఆలోచనలో ఉన్నాడు. స్వయంగా పట్టిచ్చిన వ్యక్తికి బంగారు నాణేలు బహుమతిగా ఇస్తారటగా!"

**మరదలిపై అత్యాచారయత్నం చేసిన దమనకుడు నంది చేతిలో పరాభవం చవిచూశాడు. రోషంతో కుతకుతలాడిపోయిన దమనకుడు, నందిని పొరుగురాజ్య బహిష్కృతుడనీ, దొంగగా ముద్రవేయించుకున్నవాడనీ కనిపెట్టాడు. తమ రాచభటులకు ఆ విషయం తెలియజెప్పి నందిని ఖైదు చేయించే పనిలో పడ్డాడు. మరి అప్పుడు నంది ఏం చేశాడు? భటులు అతణ్ణి ఖైదు చేశారా?**

"ఇది అన్యాయం...నంది దొంగ కాదు; దొంగతనం చేయలేదు!" భజరంగి ఆవేశంగా అన్నాడు.

లక్ష్మి మౌనంగా నందివైపు సాభిప్రాయంగా చూసింది.

నంది గొంతు సవరించుకుని, భజరంగి వైపు చూశాడు. "పెదనాన్నగారూ, నా మీద అపరాధి అనే ముద్ర ఉంది. రాజద్రోహ నేరం నా మీద మోపబడింది. శిక్ష విధించబడింది. శిక్ష కార్యరూపం ధరించింది. నేను శిక్ష అనుభవిస్తున్నాను. అందులో ఎలాంటి సందేహమూ లేదు! రాజ్యభ్రష్టుడైన ఒక అపరాధిని మరొక రాజు మన్నిస్తాడన్న నమ్మకం లేదు. ఈ చేదు నిజాన్ని నేను అంగీకరిస్తున్నాను. మీరూ అంగీకరించాల్సిందే..."

"నందీ..."

"శిక్షకు నేను భయపడను. ఎవరో శిక్షిస్తారన్న భయంతో పారిపోయేవాణ్ణి కాను. కానీ నా మీద రెండు బాధ్యతలున్నాయి. దేశభక్తుడైన నా తండ్రి దేశద్రోహం, రాజద్రోహం నేరాల కింద యావజ్జీవ కారాగారవాస శిక్ష అనుభవిస్తున్నాడు. ఆయన కన్నబిడ్డ అయిన నేరానికి నా చెల్లెలు అంతఃపురంలో శౌచాలయ పరిచారికగా శిక్ష అనుభవిస్తోంది. మా ముగ్గురికీ విధించబడిన శిక్షలకు కాలపరిమితి లేదు! అవి శాశ్వత శిక్షలు. మరణించేదాకా నాన్న కారాగారంలోనే ఉండాలి. అక్కడే మరణించాలి. చెల్లెలు శౌచాలయాలను శుభ్రం చేస్తూ వయసు మీదపడి, పండి రాలిపోవాలి. నేను జన్మభూమికి దూరంగా కాందిశీకుడిలా జీవించి మరణించాలి. కనీసం నాకు స్వాతంత్ర్యం ఉంది. దానిని నేను ఉపయోగించుకోవాలి. సద్వినియోగం చేసుకోవాలి. నా తండ్రి రాజద్రోహి కాడనీ, దేశద్రోహి కాడనీ నిరూపించాలి. తండ్రినీ, సోదరినీ బంధవిముక్తులను చేయాలి. నా రాజ్యంలోకి అడుగుపెట్టకుండా ఆ కార్యాలు సాధించాలి.

ఆ కార్య సాధన కోసం ప్రాథమికంగా నాకు ఉన్న స్వాతంత్ర్యాన్ని నేను కాపాడుకోవాలి. అసాధ్యంగా కనిపిస్తున్న కార్యాన్ని సాధించడానికి మార్గాలను అన్వేషించాలి. దమనకుడి పగకు బలైపోయి, పుష్పగిరి రాజ్య కారాగారంలో ఇరుక్కుపోవడం నాకు ఇష్టం లేదు..."

"నందీ..నీ లక్ష్యాలు, బాధ్యతలు నాకు తెలియకపోయినా, నువ్వు కారాగారం పాలు కాకూడదన్న ఆలోచనతో వచ్చాను. నా చెల్లిని కాపాడిన నీ రుణం తీర్చుకోవాలనుకున్నాను. రేపు ఉదయమే నా భర్త పుష్పగిరి సంస్థానానికి ప్రయాణం కట్టబోతున్నాడు. ఆలోపు నువ్వు ఇక్కణ్ణుంచీ మాయమైపోవాలి. నువ్వు నా చెల్లికి అన్నవు, నాకు తమ్ముడివి! క్షేమంగా వెళ్ళిపో! నీ లక్ష్యాన్ని సాధించు!" లక్ష్మి ఉద్రేకంగా అంది.

నంది కూచున్న చోటు నుండి లేచాడు. లక్ష్మి దగ్గరగా అడుగులు వేశాడు. తలవాల్చి, కిందికి చూశాడు. లక్ష్మి తల పైకెత్తి అతన్నే చూస్తోంది.

"నా చెల్లెలు దీపాంకురను చూసి ఇంతకాలం గర్వించాను. ఇప్పుడు అక్క లక్ష్మిని చూసి గర్విస్తున్నాను. సూర్యోదయంతో నా ప్రస్థానం ప్రారంభిస్తాను; నా సోదరీమణి దీవెనలతో!" అంటూ నంది కిందకి వంగి లక్ష్మి పాదాలకు నమస్కరించాడు.

లక్ష్మి రెండు చేతుల్నీ నంది శిరస్సుమీద ఉంచి, ఆప్యాయంగా తల నిమిరింది. "నువ్వు జయించాలి నందీ!"

"జయించాక, ఆ శుభవర్తమానం మాకు తెలియజేయాలి నాయనా!" భజరంగి అన్నాడు.

"ఆశ్రయం ఇచ్చారు. ఆకలి తీర్చారు. ఆదరించారు. మీ ఆశీస్సుల బలంతో నా ప్రయత్నంలో విజయం సాధిస్తాను. విజయం సాధించి, మీకు విన్నవిస్తాను!" నంది నిలుచుని, ఇద్దర్నీ కలియజూస్తూ అన్నాడు.

●●●

నంది దారికి దూరంగా, దట్టంగా ఉన్న ముళ్ళపొదల చాటున ఉన్న వటవృక్షం కింద మేలుకున్నాడు. ఆకుల్లోంచీ దూరుతున్న సూర్యకిరణాలు వెచ్చటి సూదుల్లా గుచ్చుకుంటున్నాయి. రాత్రి పడుకునే ముందు తన దాహం తీర్చిన చెరువువైపు వెళ్ళాడు. ధరించిన వస్త్రాలను తీసి, నీళ్ళల్లో శుభ్రం చేసి ఎండలో ఆరవేశాడు. స్నానాది కార్యక్రమాలు ముగించి, భజరంగి ఇచ్చిన మూట విప్పాడు. అందులో మూడు జతల దుస్తులున్నాయి.

బయలుదేరే ముందు భజరంగి చిన్న మూటను అందించాడు. "కుట్రపు వాడు రాత్రి ఇచ్చాడు. అతనికి నిన్నొకసారి వీధిలో చూపించానులే. మనిషిని



## అడుక్కోదట

ఛాన్సులు ఇమ్మంటూ ఎవరినీ అడుక్కునే అలవాటు తనకు లేదని ఇలియానా స్పష్టం చేసింది. 'రుస్తుం' తరువాత ఇలియానా టాప్‌ప్లేస్‌లోకి వెళుతుందని అందరూ అనుకున్నారు. పాపం ఇల్లీ బేబీ కూడా అలాగే ఊహించుకుంది. ప్రస్తుత పరిస్థితి అందుకు భిన్నంగా ఉంది. పరిస్థితులను జీర్ణించుకోలేక నిజాలు దాచి పెట్టడానికి ఇలియానా పై విధంగా మాట్లాడిందని బాలీవుడ్ జనాలు అంటున్నారు. ఇలియానాకి అవకాశాలు రాకపోవడానికి మరొక కారణం కూడా చెబుతున్నారు. టాలీవుడ్‌లో రీ ఎంట్రీకి ఇలియానా శతవిధాల ప్రయత్నిస్తోంది. ఆమె ప్రయత్నాలు ఫలించి టాలీవుడ్‌కి జంప్ అయితే ఆమెకు అవకాశం ఇచ్చిన తాము ఇబ్బంది పడాల్సి వస్తుందని బాలీవుడ్‌లో పలువురు దర్శకనిర్మాతలు ఇలియానాను పక్కన పెట్టేస్తున్నారట! ఈ విషయాలు దాచి పెట్టి అవకాశాల కోసం ఎవరినీ అడుక్కోను, అడగనంటూ కల్లబొల్లి కబుర్లు చెప్పడం ఎందుకు? అంటున్నారు సినీ జనాలు.

చూస్తే కంటితో కొలతలు వేసేస్తాడు! కట్టుబట్టలతో వచ్చావు. నా కోసం కష్టం చేశావు. తీసుకో!" అన్నాడు.

పుష్పగిరి రాజ్యం పొలిమేర త్వరగా దాటే దగ్గరి దారి వివరించాడు, కొండగుర్తులు చెబుతూ! పాదాలంటి నమస్కరించిన తనను లేవనెత్తి గాఢంగా కౌగిలించుకున్నాడు. బలవంతంగా తన చేతిలో కొన్ని నాణేలు ఉంచాడు. "దారిలో తగిలే పల్లెటూళ్ళలో నీకు ఆప్యాయంగా, ఉచితంగా అన్నం పెడతారు జానపదులు. నగరంలో పూటకూళ్ళ గృహాల మీద ఆధారపడాల్సిందే! ఈ పైకం ఒకటి రెండు రోజులు నీ ఆకలి తీరుస్తుంది. తరువాత కాయకష్టం ఉంది; కడుపు నింపుతుంది!"

తడిగా మెరుస్తున్న కళ్ళతో తను భజరంగిని చూశాడు. "దైవం మానవ రూపంలో ఆదుకుంటాడన్నారు పెద్దలు. ఆ సత్యాన్ని మీరు రుజువు చేశారు పెదనాన్నా!" అన్నాడు.

"దైవం నీకు తోడుగా ఉంటాడు. ఈ రాజ్యం పొలిమేర దాటేదాకా అప్రమత్తంగా ఉండు. ముందుకు నడుస్తూ, వెనుక ఏర్పడే అడుగుజాడల్ని చెరిపేస్తూ వెళ్ళాలి నువ్వు!" భజరంగి నవ్వుతూ అన్నాడు. "అర్థమైందా?"

నంది చిరునవ్వు నవ్వాడు. "దొరకని దారిలో ప్రయాణం చేస్తాను. ఆనవాళ్ళు వదలకుండా అడుగులు వేస్తాను పెదనాన్నా!"

భజరంగి తన కళ్ళల్లోకి తిన్నగా చూశాడు. ఏదో ముఖ్యమైన విషయం చెప్పబోతున్నాడనిపించింది తనకి. "ప్రాణ భయం కలిగే అవకాశం ఉన్న సందర్భాలలో మనిషి అసత్యాలు పలకవచ్చు అన్నారు నవగ్రహాలలో ఒకరైన శుక్రుల వారు. నీ గతాన్ని గుండెల్లో దాచుకో! అందరికీ చెప్పుకోవల్సిన విషయం కాదది. నువ్వు ఆరోప్రాణంగా నమ్మిన వాళ్ళకీ, నిన్ను ఆరోప్రాణంగా భావించే వాళ్ళకీ మాత్రమే, అవసరమైతే చెప్పు!" అన్నాడాయన. ఆ మాట తన పాలిట ఒక సూక్తి అనిపించింది తనకి. భజరంగిని వీడ్కొని బరువెక్కిన హృదయంతో బయలుదేరాడు తను. తన ప్రయాణానికి అయిదునాళ్ళ వయసు! భజరంగి చెప్పిన ప్రకారం మరో రెండు దినాలలో తాను పుష్పగిరి రాజ్యాన్ని దాటి వెళతాడు.

భజరంగి ఇచ్చిన దుస్తులు ధరించాడు నంది. తన శరీరం కొలతలు తీసుకుని కుట్టినట్టు సరిపోయాయి; ఆశ్చర్యం కుట్రపువాడు నిజంగానే తన పనిలో ఆరితేరిన ఘటం! నంది ఆరవేసిన దుస్తుల్ని క్రొత్త దుస్తులతో బాటు మూటకట్టాడు. ఆకలి కరకరలాడుతోంది. త్వరగా తను ఏదో పల్లెటూరి పరిసరాలకు చేరుకోవాలి. పొలం పనులలో ఉండే కష్టజీవులు తన ఆకలి తీరుస్తారు! అది తన ఆశ మాత్రమే కాదు; అయిదురోజుల అనుభవం. దారి పక్కగా అడుగుల చప్పుడు వినిపించనంత దూరం ప్రయాణం సాగిస్తున్న తనకోసం పుష్పగిరి ఆశ్వికులు ఎవ్వరూ రాలేదు. మనిషి అడుగుల చప్పుడు వినిపించనంత దూరమైనా, గుర్రాల గిట్టల చప్పుడు వినిపిస్తుంది. దమనకుడు పుష్పగిరి రాజధానికి బయలుదేరే రోజే, ఉదయాన్నే తాను శివగిరిని విడిచిపెట్టాడు. దమనకుడు పుష్పగిరి చేరే సమయానికి తాను కొంత దూరం వెళ్ళిపోగలడు.

బయలుదేరే ముందు భజరంగికీ, తనకూ ఒక విషయం తెలిసి వచ్చింది. భజరంగి గుర్రం రంభ మాయమైంది! రాత్రి మూడవ జాములో కూడా అశ్వం తన స్థానంలో ఉండడం చూశానన్నాడు భజరంగి. నాలుగవ జాములో అంటే వేకువ సమయంలో గుర్రం అంతర్థానమైందన్నమాట. 'మన రంభ మాయం కాలేదు. అల్లుడుగారు అపహరించి తీసుకెళ్ళారు!' అన్నాడు భజరంగి. ఔను. కుంటుతూ రాజధాని నగరానికి ప్రయాణం చేయలేడుగా!

"భయం లేదు నందీ. ఎంత వేగంగా ప్రయాణం చేసినా, సాయంత్రానికి గానీ దమనకుడు రాజధాని చేరుకోలేడు! రాత్రికి రాత్రే భటులతో గుర్రాల మీద బయలుదేరినా, రేపు ఉదయానికి గానీ ఇక్కడికి చేరుకోలేడు. నీ కోసం గాలించడంలో కొంత కాలయాపన జరుగుతుంది" అన్నాడు భజరంగి తనతో. తను ఎటు వెళ్ళాడో చెప్పమని భటులూ, దమనకుడూ భజరంగిని సతాయిస్తారు. ఆ మాటే ఆయనతో అన్నాడు తను. "పుష్పగిరి రాజ్యానికి ఉత్తర దిశలో పొరుగురాజ్యం ఉంది. దక్షిణ దిశలో మరొక రాజ్యం ఉంది. నువ్వు దక్షిణ దిశలో ఉన్న పొరుగురాజ్యానికి వెళ్తున్నావు. ఆ నిజమే వాళ్ళకు చెప్తాను" అన్నాడాయన.

తను నివ్వెరపాటుతో చూశాడు.

భజరంగి మెరిసే కళ్ళతో చూస్తూ చిరునవ్వు నవ్వాడు. "నా మాటను ఇంటల్లుడు చచ్చినా నమ్మడు! నేను 'దక్షిణం' అంటే 'ఉత్తరం' వైపు తీసుకెళ్తాడు భటుల్ని. మరొక అవకాశమూ ఉంది. భటులు రెండు బృందాలుగా చీలిపోయి ఉత్తర, దక్షిణ దిశల్లో ప్రయాణం చేయొచ్చు! అందుకే చెప్పాను, అడుగుజాడల్ని చెరిపేస్తూ వెళ్ళమని!"

భజరంగి తెలివితేటలను లోపల్లోపలే మెచ్చుకుంటూ, నంది చెరువు దగ్గర్నుంచి నడక సాగించాడు. కాసేపు సూర్యుడి కింద ఎండలో, కాసేపు చెట్లకింద నీడలో అతని ప్రయాణం సాగుతోంది. క్రమంగా అతని పక్కనే నడుస్తున్న నీడ పొడవు తగ్గుతూ అతని దగ్గరగా జరుగుతోంది. దూరంలో పంట పొలాలు కనిపిస్తున్నాయి. పంట పండక ముందే తనకు అక్కడ ఆహారం లభిస్తుంది! నంది తనలో నవ్వుకున్నాడు. కర్షకులు పొలంలోనే తన ఆకలిని తీరుస్తారు! జానపదులు అమాయకులు. తన గురించి అడుగుతారు. వాళ్ళ కుతూహలానికి సమాధానం సిద్ధం చేసుకున్నాడు తను. తాను దేశాటన చేస్తూ అటుగా వచ్చాడు. సుదీర్ఘ పాదయాత్ర.

●●●

ఆకాశాన్ని అందుకోబోతున్నట్టు గాలిగోపురం,

నీలాకాశం నేపథ్యంలో మంచుకొండలా మెరుస్తోంది. ఆ శ్వేతగోపురం కంటపడగానే అక్కడికి పరిగెట్టాలని పిస్తోంది నందికి. అది పొరుగురాజ్యం పొలిమేర సూచిక! ఆ గోపురం కిందుగా అవతలివైపు అడుగు పెడితే చాలు, పుష్పగిరి ఆశ్విక భటులు తనను బంధించలేరు.

"శ్వేతగోపురం నుండి అయిదు గడియల ప్రయాణం చేస్తే నువ్వు రాజధాని నగరం చేరు కుంటావు నాయనా. ఆ రాజధాని చాలా పెద్ద నగరం. పల్లెల్లో, చిన్న పట్టణాల్లో నువ్వు అందరికీ సులభంగా తెలిసిపోతావు. నీ గురించి ఒకరికి తెలి సిన విషయం వినువీధి, వాడవాడా తెలిసిపోతుంది. నగరం నీకు శ్రేయస్కరం. చిన్నతోటలో సింహం అందరికీ సులభంగా అగుపిస్తుంది. అదే అరణ్య మైతే?" అన్నాడు భజరంగి. అవును! నగరమే తనకు క్షేమకరమైన స్థావరం. లక్షలాది తలల్లో తనొక తల! శతకోటి లింగాలలో తనొక లింగం! తన ఊరు అదే అన్నా ప్రజలు నమ్మేస్తారు! శ్వేతగోపురం దాటి తాను అయిదు గడియలు, అంటే కేవలం నూట ఇరవై నిమిషాలు ప్రయాణం చేస్తే చాలు! నగర వాసులలో నాగరికులలో కలిసిపోగలడు! నంది అడుగులు వేగంగా పడసాగాయి...

నంది ఊహించని విధంగా గోపురానికి అటు వైపున నలుగురు సాయుధ భటులున్నారు. ఇద్దరు భటులు నందికి అడ్డుగా ఈటెలు పెట్టారు. ఎత్తుగా బలంగా ఉన్న భటుడు ఎదురుగా వచ్చి, నందిని ఎగాదిగా చూశాడు.

"పేరు, ఊరు?" అన్నాడతను కీచుగా. పిట్ట ఘనం; కూత కొంచెం!

"శివనంది. ఊరు శివగిరి అన్నా!" నంది తడ ముకోకుండా అన్నాడు.

"పారిపోయి వచ్చావా?"

"పాదయాత్ర చేస్తున్నాను. దేశదేశాల్లోని ఆల యాల దర్శనం నా సంకల్పం..?"

"చిన్న వయసులో పెద్ద సంకల్పం! మూటలో ఏముంది?" భటుడు ప్రశ్నించాడు.

నంది మూట విప్పి, దుస్తుల్ని చూపించాడు. మరొక భటుడు నంది శరీరం తడిమి చూశాడు. "నిరాయుధుడే" అన్నాడు సహచరులతో.

"ఆత్మరక్షణకు ఆయుధం వద్దా?" కీచుకంఠం అడిగింది.

నంది ఆకాశంవైపు చేతులు జోడించాడు. "ఆ దేవుడే నాకు రక్ష!"

"వెళ్ళిరా!" అన్నాడు భటుడు. ఈటెలు ఎడంగా జరిగాయి.

నంది ముందుకు కదిలాడు.

నగరం వైపు నడుస్తున్న నందిలో ఆలోచనలు సంకుల సమరం సాగిస్తున్నాయి. శివగిరిలో ఆశ్రయం కల్పించే అదృష్టం భజరంగి రూపంలో తనకు ఎదురొచ్చింది. ఆ పట్టణంలో కాలం వెళ్ళదీస్తూ లక్ష్యసాధనకు మార్గం అన్వేషించాలనుకున్న తన సంకల్పం భగ్నమైంది. భజరంగి రూపంలో అంది వచ్చిన అదృష్టాన్ని దమనకుడి రూపంలో దాపు రించిన దురదృష్టం తరిమి వేసింది!

అడుగుపెట్టబోయే నగరంలో తనకు ముందు నిలువనీడ దొరకాలి. ధర్మసత్రాలు ఉన్నాయేమో అన్వేషించాలి. నెమ్మదిగా తగిన వ్యాపకం కోసం వెతకాలి. తను అసాధ్యాన్ని సుసాధ్యం చేస్తానంటూ శపథం చేశాడు. నాన్న చెరసాలలో, చెల్లి అంతఃపు రంలో ఉన్నారు. తను చెరసాలలోకి కాదు కదా, అంతఃపురంలోకి కాదు కదా, నగరంలోకే వెళ్ళలేడు! తండ్రినీ, చెల్లినీ వెలుపలకి తీసుకు రావాలి! కానీ తనవద్ద మంత్రదండం లేదు.

ముందు తను నిలదొక్కుకోవాలి. ఏం చేయాలో, ఎలా చేయాలో ఆలోచించాలి. ఒక విధంగా తన తండ్రికీ, చెల్లికీ లేని అదృష్టం తనకి ఉంది. అది స్వేచ్ఛ! తననూ కారాగారంలో బంధించకుండా, అజ్ఞాతవాస శిక్ష విధించకుండా కుబేరవర్మ మహా రాజు ఒక విధంగా మేలే చేశాడు! తను యధే చ్ఛగా తిరుగాడగలడు. ఏదో వృత్తి చేసుకోగలడు. కామరూప నగరంలో కాలు పెట్టకుండా జీవిం చడం కష్టమేమీ కాదు. తండ్రి చెప్పినట్టు ఎటో వెళ్ళిపోయి, ఎవరినో వివాహం చేసుకుని, వంశాన్ని వృద్ధి చేయవచ్చు! కానీ తను ఆ పని చేయడు; చేయలేడు...

తనకు తెలుసు. తన కుటుంబంలోని ముగ్గురూ రాజు విధించిన శిక్షలు అనుభవిస్తున్నారు. ఆ ముగ్గురిలో ఇద్దరు ఏ నేరమూ చేయలేదు. ఒకరు చేశారు. తండ్రీ, చెల్లీ ఇద్దరూ నేరాలు చేయలేదు. తాను నేరం చేశాడు. దాన్ని న్యాయంగా అంగీకరిం చాలి. భటులను చితకబాదాడు. ఒకరి కాలు విరిగి పోయింది. ఒకరి చెయ్యి విరిగిపోయింది. బందీగా తీసుకెళ్ళబడుతున్న చెల్లెల్ని విడిపించి తీసుకువెళ్ళి తను శాసన ధిక్కారం చేశాడు.

దేశబహిష్కార శిక్ష విధించాల్సినంత నేరం కాకపోయినా తను నేరం చేశాడు. కామరూప మహారాజుగారి శిక్షాస్మృతి ఒక విధంగా లోప భూయిష్టంగా ఉంది. నేరం చేయని వాళ్ళిద్దరూ బందీలుగా ఉన్నారు. నేరస్థుడైన తను స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ హాయిగా తిరుగుతున్నాడు.

తన తండ్రి నిజమైన దేశాభిమాని. ఆయనది మచ్చలేని రాజభక్తి. ఎవరెన్ని అన్నా, ఎన్ని ఆధా రాలు చూపించినా తన తండ్రి మీద చేయబడిన ఆరోపణ, మోపబడిన అభియోగం రెండూ అసత్యాలే అని తను గాఢంగా నమ్ముతున్నాడు; నమ్ముతాడు. అది నిరూపించాలి. అందుకు సమయం రావాలి. స్థలం అనుకూలించాలి. పరిస్థితిలో పరిణామం రావాలి. తండ్రికి అన్యాయం చేసిన ఘోర రహస్యం ఆయన వ్రాసినట్టు చెప్పబడుతున్న లేఖలో ఉంది. ఆ రహస్యాన్ని తను ఛేదించాలి. అందుకు కాల, స్థల, పరిణామాలు కలిసిరావాలి.

నగర ప్రధాన ప్రవేశ ద్వారం ఎదురుగా ప్రత్యక్షం కాగానే నంది ఆశ్చర్యపోయాడు. ఆలోచ నల్లో మునిగిపోయి తను పరిసరాలను గమనించ లేని స్థితిలో యాంత్రికంగా నగరాన్ని సమీపిం చాడు! చీకట్లు ముసురుకుంటున్నాయి. అది కూడా తన కంటికి ఆనలేదు.

నంది ప్రధాన ద్వారాన్ని దాటి వెడల్పాటి వీధి లోకి ప్రవేశించాడు. రాజోద్యోగులైన దీప జ్వాల కులు వీధికి ఇరువైపులా, నాలుగు వీధులు కలిసే ప్రదేశంలో దీపాలు వెలిగిస్తున్నారు. గృహిణులూ, యువకులూ ద్వారబంధాల ముందు ప్రమిదలలో జ్యోతులు వెలిగిస్తున్నారు. ఆ దృశ్యం నందికి గతాన్ని గుర్తుకు తెస్తోంది. 'అసుర సంధ్య దీపాలు వెల గాలి' అనేది అమ్మ. అమ్మ పరమపదించాక ఇంటా, బయటా దీపాలు వెలిగించే బాధ్యతను చెల్లి దీపాం కుర స్వీకరించింది. అమ్మా, చెల్లెలు దీపాలు వెలి గిస్తూ ఉంటే చూడడం తనకి ఎంత ఇష్టమో! గత స్మృతుల్ని బరువైన నిట్టూర్పుతో వెళ్ళగక్కి, నంది నగర వీధిలో నడక సాగించాడు.

***(ఇంకావుంది)***




వర్షం కురుస్తూనే ఉంది
నేను తడుస్తూనే ఉన్నా

చంటిది రంగుపెన్సిల్‌తో గీస్తూ
దాని మనసుని గీతలలో
చూస్తూ నేను

## ఒక వర్షం కురిసిన హృదయం

చంటిది కాగితపు టైటానిక్‌లు
నీళ్ళలో వేస్తోంది
వాటిలో ప్రయాణిస్తూ నేను

చంటిది వాకిట్లో
చుక్కల ముగ్గు వేస్తోంది
ముగ్గులోకి దిగుతూ నేను

చంటిది రాకుమారుని గుర్రం
కథ చెబుతోంది
కాలం అశ్వమెక్కి నేను

చంటిది లక్కపిడతల
వంటేదో చేస్తోంది
ఆ ఘుమఘుమలనాస్వాదిస్తూ
నేను



చంటిది నా ఒడిలో నిదురపోయింది
ఒడిలో అమృతభాండంతో
దాని స్వప్నాలను కంటూ నేను

***-పద్మావతి రాంభక్త, సెల్: 99663 07777***

# పండగంత వెన్నెల

-శ్రీచరణ్ మిత్ర



**సౌమ్య శరీరంలో వెన్నెలను శశాంకుడు ఆబగా జుర్రేస్తున్నాడు.**

**పరిమళాలు వెదజల్లుతూ జాజిపూలు జగతిని జాగృతం చేయాలని ఆశపడుతున్నాయి.**

**అద్దంలాంటి సౌమ్య మేనిపై పరావర్తనం చెందిన వెన్నెల కిరణాలు, ఆసాంతం ఆమెలో ఇమడలేకపోతున్నందుకు విరక్తిగా వెనుదిరుగుతున్నాయి. బైట లాన్‌లో తూగుటుయ్యాలపై కాస్త తమకంలో కూర్చున్న సౌమ్యకు ప్రతిరోజూ ఇంచుమించుగా ఇలానే గడుస్తోంది.**

ఇంట్లో అత్తగారి డీవీడీ ప్లేయర్‌నుండి ఏదో దేవుని సహస్రనామం నెమ్మదిగా వినిపిస్తోంది. అదే ఇప్పుడు ఆమె కోపానికి కారణం. రోజూ ఏవేవో తిథులు, నక్షత్రాలు, వారాలు అంటూ, తమ ఆలుమగల్ని కలవనీకుండా రాక్షసిలా అడ్డుపడే అత్తగారిని గొంతునులిమి చంపేయాలన్నంత కోపంగా ఉంటుంది సౌమ్యకు.

అమ్మమాట జవదాటని శ్రీరామచంద్రుడిలా ఇతగాడు కూడా తనలో ఏవేవో కోరికలు రేకెత్తించి, ఆనక స్తబ్దుగా ఉండిపోతాడు. తనపై అతని సరససల్లాపాల మాధుర్యం ప్రయోగించి ఆ రస వాహిని తనకు మళ్ళీ మళ్ళీ కావాలనుకుంటే ఇన్‌స్టాల్‌మెంట్ పద్ధతిలో తిథులు వారాలు చూసుకుని అనుగ్రహిస్తానంటే తనకు ఒళ్ళు మండదూ?

అందుకే ఈరోజు తను అలకపాన్పు నటించైనా, అతన్ని తనలో ఇముడ్చుకోవాలనుకుంటోంది సౌమ్య. కానీ అతను ఎంతకీరాడే.. బహుశా తల్లికి సహస్రనామ వివరణలు ఇస్తూ కూర్చున్నాడేమో? ఆ తల్లి ఛాందసం ఇతగాడు కూడా బాగా నెత్తికి ఎక్కించుకున్నాడు. ఆమెతో పాపం మామగారెలా వేగిపోయేవారో తలచుకుంటే నవ్వు వస్తుంది. మధ్య వయసులోనే మరచెంబులాంటి స్థితి ఆయనది. అత్తయ్యకు దాహంవేసి, చేయి వేస్తేనే ఓపెన్... లేదంటే జలాన్ని తనలోనే దాచుకునే దౌర్భాగ్యం అతనిది. తన భర్త జననానికి బీజం వేశాక.. బీటలు వారిన మోడులా ఉండిపోయాడు అతను. అత్తగారు తన భర్తకు కూడా అలాంటి స్థితి కల్పించేస్తుందేమోనని సౌమ్య భయం.

కానీ... తనేవరు? భర్తను తనకు కావల్సిన విధంగా మలచుకుని, మరులు గొలిపి, 'పడక గదిని జయించినవాడు ప్రపంచాన్నే జయిస్తాడనే ఉత్సాహం నింపి, ప్రతి ఉదయం... మళ్ళీ రాత్రికేగా శుభోదయం..' అన్నట్టు పతి దేవుడు ఆరాట పడాలనుకున్న అతివ ఆమె.

అత్తగారువేసే సంకెళ్ళను బద్దలు కొట్టటానికి కంకణ బద్ధురాలైన సౌమ్య, ప్రస్తుతానికి పేరులో సౌమ్యంగానే ఉన్నా, భర్తకు మాత్రం కాఠిన్యం చూపాలనుకుంటోంది. నిజానికి తనభర్త శ్రీరామ చంద్రుడే. ఒకేమాట ఒకే భార్య అన్నభావాలకు నిర్వచనంలా ఉంటాడు. ఏ భార్యకైనా అంతకంటే ఏం కావాలి? కానీ అత్తగారి ఆజ్ఞలతో అతను మరీ రేషన్‌కార్డ్‌లా తయారయ్యాడు.

ఆ మధ్య నెలరోజుల క్రితం...

దీపావళిరోజున దీపకళికలా తయారైన సౌమ్య చాలా ఆకర్షణీయంగా ఉంది. చిదిమిదీపం పెట్టుకునే అందం అంటారు కదా... అచ్చం అలానే ఎర్రని పట్టుచీరలో పుత్తడిబొమ్మలా ఉన్న ఆమెనే ఆశగా చూస్తున్న భర్తకేసి చిలిపిగా చూసింది సౌమ్య. అతను గుటకలు మింగుతున్నాడు.

అసలే లక్ష్మీపూజ... ఉదయం నుండి సంప్రదాయ విధానాలు పాటిస్తూ, సతమతమైపోతున్న అత్తగారు 'సౌమ్యా, ప్రమిదలకు నూనె సిద్ధం చెయ్... లక్ష్మీ అమ్మవారికి ఆ పూల దండలు అలంకరించు.. మీ మామగారు ఆకలికి ఆగలేక బైటకువెళ్ళి ఎక్కడైనా ఎంగిలిపడతారు. కాస్త ఆ పళ్ళరసాలు రెడీ చెయ్..." అంటూ జాగ్రత్తలతో చంపేస్తున్నప్పుడు, సౌమ్యకు పాపం పతి దేవుడివైపు కన్నెత్తి చూసే అవకాశం కూడా రావడంలేదు.

పని... పని... ఒకటే ఇంటిపనులు.. ఇంట్లో అందరికీ పనులు పురమాయిం చేస్తుంది అత్తగారు. ఆ ఇంటికి ఆవిడేగా సుపీరియర్.

రాత్రికి మోగాల్సిన దీపావళి శబ్దాలు మధ్యాహ్నంనుండే మొదలై, సాయంత్రానికి ఊపందుకోసాగాయి.

"అయ్యో... అయ్యో.... ఆ గుమ్మానికి కాస్త బంతిపూలు కట్టండర్రా.. సౌమ్యా, ఏం చేస్తున్నావే?" మళ్ళీ కేకేసింది అత్తగారు.

"వస్తున్నా అత్తయ్యా..." అంటూ పళ్ళెంలో సిద్ధంచేసిన బంతిపూల మాలలు ద్వారానికి కట్టేందుకు ఉపక్రమించింది సౌమ్య.

"ఒరే విస్సూ.. కాస్త అమ్మాయికి సాయం చేయరాదూ..." అంటూ హాలులోనుండే కేక లేస్తున్న ఆమె ఆర్డర్‌కి, లేవకతప్పలేదు విశ్వనాథ్‌కు. అతడు సౌమ్య దగ్గరకు చేరుకున్నాడు. రెండుచేతులూ ఎత్తి పూలమాలల దారాల కొసలు బిగిస్తున్న సౌమ్య పాల నురుగులాంటి ఉదర భాగం విశ్వనాథ్‌ని ఉత్తేజపరిచి అక్కడ ఏమైనా చిలిపిరాతలు రాయమని ఉద్బోధిస్తోంది. ఉరక లేస్తున్న ఊపిరి వలన కదలాడుతున్న స్తనద్వయం, పట్టుబట్టల్లో ఉండటం వలన కాబోలు పసిడి కలశాల్లా దర్శనమిస్తున్నాయి. గుటకలు మింగుతున్న విశ్వనాథ్‌ని చూసి ఫక్కున నవ్వింది సౌమ్య.

"ఎందుకు నవ్వుతున్నావ్?"

"మీ అవస్థ చూసి..."

## 'ఐస్‌క్రీం' పిల్లకు బంపర్ ఆఫర్

తేజస్వి మదివాడ అంటే ఎవరూ గుర్తు పట్టరేమో కానీ, 'ఐస్‌క్రీం' పిల్ల అంటే మాత్రం టక్కున గుర్తు పట్టేస్తారు ప్రేక్షకులు. 'ఐస్‌క్రీం' సినిమాతో గుర్తింపు అయితే తెచ్చుకుంది కానీ, అవకాశాలు మాత్రం దక్కించుకోలేకపోయింది తేజస్వి. ఇప్పుడు ఆ పిల్లకి ఓ పెద్ద సినిమాలో మంచి రోల్ దొరికిందట! దాంతో తేజస్వి సంతోషంతో ఉబ్బితబ్బిబ్బై పోతోంది. ఇన్ని రోజుల తన నిరీక్షణ ఇప్పుడు ఫలించిందని సంతోషపడిపోతోంది. వెంకటేష్, నిత్యా మీనన్ జంటగా నటిస్తున్న సినిమాలో తేజస్వికి ఓ మంచి పాత్ర దొరికిందట! ఇద్దరు సూపర్‌నటులతో పనిచేయడం అంటే ఆనందం కాక మరేంటి? అంటోంది తేజస్వి.






"అంటే?"

'అత్తగారికి భయపడుతూ ఆలినికూడా తాక లేని మీ అమాయకత్వం చూసి నవ్వొచ్చింది" అందామె. కాస్త రోషం ముంచుకొచ్చింది విశ్వనాథ్‌కి.

"అదేంకాదు, ఈ రోజు దీపావళి. మహాలక్ష్మీ అమ్మవారి పండుగ. ఈ పూట అలాంటి పనులు చేయకూడదు. అందుకే.."

"మరి పండగ అయిపోయాక ఏం చేయాలి?" రెట్టించింది సౌమ్య.

"ఏముంది పిండివంటలు ఆరగించాలి".

తల పట్టుకుంది సౌమ్య. నీరసంగా మూలిగి "ఆ పిండివంటలు తినేశాక ఏం చేస్తారు మహానుభావా.." అంది చిన్నగా నవ్వుతూ.

అర్థం చేసుకున్న విశ్వనాథ్, "నాకైతే నీలో కలవాలనే ఉంది సౌమ్య. ఈరోజు చాలా అందంగా కనిపిస్తున్నావు. పట్టుచీరలో బంగారుబొమ్మలా ఉన్నావు, నిన్నలాగే.."

"కొంపతీసి అక్కడ కూడా ఈ పట్టు చీరలోనే ఉండమంటారేమిటి?" అంది చిలిపిగా మళ్ళీ నవ్వుతూ.

"అవకాశం ఏది? పండగతిథినాడు మనం అలాంటి పనులేవీ పెట్టుకోకూడదని అమ్మ చెబుతూ ఉంటుందికదా.." బేలగా ఆమె పొట్టలో తల దూర్చాడు విశ్వనాథ్.

"పిచ్చి నా హజ్బెండా రాత్రిపన్నెండు దాటిపోయాక ఆ తిథులు, రోజులు, అన్నీ మారిపోతాయికదా. మనం ఇష్టపడితే ఆ కట్టుబాట్లు పారిపోతాయి" అంది ఆమె. చిన్నపిల్లాడిని లాలించినట్లు అతని తలను మరింత దగ్గరగా హత్తుకుంది.

"అయితే వేగంగా పన్నెండైతే బాగుణ్ణు. నేను నీకోసం ఎదురుచూస్తాను. నువ్వు ఇలాగే ఉండాలి తెలుసా" జాగ్రత్తలు చెబుతున్నట్లు చెప్పాడతడు.

"ఏమిటి? పట్టు చీరలోనేనా?"

"ఏం? పట్టుచీరలో నువ్వు ఎంతందంగా ఉంటావో తెలుసా? నేనే కాదు. మహాకవులు కూడా చెప్పారు".

"ఏమనో?"

"నీవు పట్టుచీర కడితే ఓ పుత్తడి బొమ్మా... ఆ కట్టుబడికి తరించేను పట్టుపురుగు జన్మ అతని.."

"అబ్బో! మీరు కూడా...?" అర్థోక్తంగా ఆగిందామె.

"పట్టుదారాన్నై నీ అణువణువునూ చుట్టుకోవాలని ఉంది" అని ఇంకా అతనేదో చెబుతుండగా...

"సౌమ్యా..." అత్తగారికేక లోపలినుండి వినిపించింది. అతన్ని విడిపించుకుని లోపలికి వెళ్ళిపోయింది సౌమ్య.

రాత్రి ఏడువరకు లక్ష్మీపూజ. అనంతరం బాణసంచా లాంటివి కాల్చటంలో నిమగ్నమయ్యారు ఇంట్లో వారంతా.

అత్తగారిదగ్గర నోరెత్తని మామగారుకూడా బాణాసంచా కాల్చటంలో ప్రతిభ చూపించేస్తున్నాడు. ఆయనతో పోటీపడి సౌమ్య కూడా చిచ్చుబుడ్లు, భూచక్రాలు, విష్ణుచక్రాలు, కాల్చేస్తోంది. కొండొకచో దీపావళి బాంబుల్లాంటివి కూడా ఆమె సునాయాసంగా కాల్చేస్తుంటే నివ్వెరపోతూ చూస్తున్నాడు విశ్వనాథ్.

"ఈ పిల్లకు అస్సలు భయంలేదురా.." అంటూ తల్లి చెబుతూంటే "అవునమ్మా..." అంటూ ఆమెను కళ్ళతోనే తినేస్తున్నాడు విశ్వనాథ్. ఎందుకంటే బాణాసంచా కాల్చటంలో అతను వెరీపూర్.

కాటుకనిండిన కళ్ళలో... నక్షత్రాల వెలుగులు.

ఉత్సాహం నిండిన వదనంలో ఎరుపెక్కిన చెక్కిళ్ళు.

ఆనందం నిండిన అతివకు ఆభరణాలు పండగ

రోజు మరింత శోభిస్తాయి.

దీపావళి అమావాస్య చీకటిరోజు ప్రకాశవంతంగా ఉండేవి కేవలం దీపాలేకాదు. అందమైన నవ్వులతో అలరించే అమ్మాయిల ముఖాలుకూడా బాగానే ప్రకాశిస్తాయి. ఎక్కడో నక్షత్రాలను తాకాలని పైకివెళ్ళే తారాజువ్వలు మానవస్పృహ వుంటే అవి ఖచ్చితంగా అతివ చెవిదగ్గర మిలమిలమెరిసే ఆభరణాలనే తాకాలనుకుంటాయి. మెరుపు మెరుపునే తాకాలను కోవటం సహజమే కదా..

బాణాసంచా కాలుస్తూ తనకు రక్షణకోసమో, నడవటానికి సౌలభ్యం కోసమో, చీరను సగంఎత్తి బొడ్డులో దోపుకున్న సౌమ్య కాలి మెరుపులు దీపాలకాంతిలో మెరిసిపోతున్నాయి. కాలికిపెట్టిన మువ్వలసవ్వడి విశ్వనాథ్‌ను రా... రమ్మని ఆహ్వానిస్తున్నాయి.



•••

"ఈరోజు నన్ను బాగా వెర్రెక్కించేశావు తెలుసా?" పడక గదిలో సౌమ్యతో చెప్పాడు విశ్వనాథ్.

"నేనా? నేనేం చేశాను?" అమాయకంగా అంది సౌమ్య.

"పండగనాడు నువ్వు అంత అందంగా తయారై, నేను నిబంధనలకు నీళ్ళొదిలేలా చేస్తే, దేవుడికి అపచారం చేసినట్లు అవదూ...? ఆ పుణ్యతిథిలో అంతా నీ అందాలే జ్ఞప్తికివస్తుంటే మనసు ఆ దేవుడిపై ఎలా లగ్నమవుతుందనుకున్నావు?" అడిగాడు విశ్వనాథ్.

"అలా ఉన్నాగానీ, మనసును లగ్నం చేయడమే బాబూ భక్తి అంటే. మీలాంటి దొంగ తపస్సులను రెచ్చగొట్టడానికో, టెస్ట్ చేయటానికో ఆ కాలంలో దేవేంద్రులవారు రంభలను పంపించేవాడు. ఈ కాలంలో అయితే భార్యలను పుట్టించాడు. శయనేషురంభ అని ఎందుకన్నారనుకున్నారు? ఇందుకే..." అతని ముక్కును ముద్దుగా చేత్తో సుతారంగా నొక్కుతూ, సువిశాలమైన ఛాతీని అతనికి అందించింది. ఎద భాగంవైపు సున్నితంగా అతని తలని హత్తుకుంది. చిన్నపిల్లాడిలా సేద తీరుతున్న అతడి తలను ఆప్యాయంగా నిమురుతూ...

"మీ అమ్మగారి నిబంధనల వలన మీకెలాంటి సౌఖ్యం సంపూర్ణంగా అందించలేకపోతున్నాను కదూ.." అంది బేలగా సౌమ్య.

"లేదు.. లేదు.. అందని ద్రాక్షపళ్ళు పుల్లన. అయినా అవి అందినప్పుడు మరింత తియ్యగా ఉంటాయి కదా" అంటూ ఆమెని అల్లుకున్నాడు.

"ఒరేయ్ విస్సూ... ఒసేవ్ సౌమ్యా..." అంటూ కేక వేస్తున్న అత్తగారి అరుపుతో ఇద్దరు అదిరిపడి లేచారు. గాబరాగా తలుపు తీశాడు విశ్వనాథ్.

ఆమె ఇద్దరివైపు ఎగాదిగా చూసి "దీపావళి మరుసటిరోజు నుండి, అంటే ఈ రోజు నుండి పవిత్రమైన కార్తీకమాసం వస్తుందని మీకు తెలుసు కదా. తెల్లారేలేచి చన్నీటిస్నానం చేసి ఉపవాసాలు ఉండాలి. కఠిన బ్రహ్మచర్యం పాటించాల్సింది పోయి మీరిద్దరు ఒకే గదిలో పడుకుంటారేమిటి? ఈరోజు నుండి నీ పడక, నా గదిలోనే

రా.." అంటూ సౌమ్యని తీసుకుపోతుంటే, దీనంగా చూస్తూ నిలబడిపోయాడు విశ్వనాథ్. ఆ రోజు ఇద్దరికీ ఉపవాసం పెట్టేసింది. మరో నాలుగు రోజులకి మత్స్య ద్వాదశి అంటూ మరో ఆటంకం కలిగించింది. ఇంక ఐదూపది రోజుల్లో ధనుర్మాసం అంటుంది. ఇలా నిత్యసంకటాలతో వేగిపోతున్న ఆ ఆలుమగల దాంపత్య అంతరాయానికి ఇక ఫుల్‌స్టాప్ పెట్టాలనే ఈరోజు ఇలా బైటకువచ్చి కూర్చుంది సౌమ్య.

సౌమ్య శరీరంలో వెన్నెలను శశాంకుడు ఆబగా జుర్రేస్తున్నాడు.

పరిమళాలు వెదజల్లుతూ జాజిపూలు ఆమెను చూసి జాలిగా నవ్వుతున్నాయి. అలా కొంత సమయం గడిచింది. తూగుటుయ్యాల మీద నిద్ర నటిస్తున్న సౌమ్య ముఖంలో చందమామ తన ప్రతిబింబాన్నిచూసి మురిసిపోతుంటే, చెంపలపై మెరుపులుచూసి మిణుగురులు మౌనంగా తరలిపోతున్నాయి. ఇంతలో "సౌమ్య" అని నెమ్మదిగా పిలుపు వినిపించింది. ఆ పిలుపు విశ్వనాథ్‌దే.

"కోపం వచ్చిందా సౌమ్యా?" అనునయంగా అంటూ బల్లమీద కూర్చునే ప్రయత్నం చేశాడు.

"హూ..." అంటూ విసురుగా పక్కకి ఒత్తిగిల్లింది సౌమ్య.

ఆమె ఒత్తిగిల్లినపుడు చందనపుకొమ్మ చలించినపుడు వీచేలాంటి పరిమళం ఆమె శరీరం నుండి ఉత్పన్నమై అతణ్ణి వివశుణ్ణి చేసింది. బుజ్జగిస్తున్నట్టు ఆమె నునుపైన పొట్టమీద చేయివేస్తూ, "నన్ను క్షమించవూ.." అన్నాడు.



## ఆలియా ఫస్ట్ నైట్ ముచ్చట్లు

*మహేష్‌భట్ కూతురు ఆలియాభట్‌కు కాస్త దూకుడు ఎక్కువే! ఏ విషయాన్నైనా మొహమాటం అనేది అస్సలు లేకుండా మాట్లాడేస్తుంది. ఇపుడు కూడా 'ఫస్ట్‌నైట్‌ను తన తల్లిదండ్రులకు అంకితం చేస్తున్నానంటూ' ఓ ట్వీట్ పెట్టి అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. పెళ్ళికాకుండానే ఫస్ట్‌నైట్ ముచ్చట్లు, పైగా దాన్ని తల్లిదండ్రులకు అంకితం ఇదేమి విడ్డూరం అంటూ బాలీవుడ్ జనాలు ఆశ్చర్యపోతుంటే అసలు విషయం చల్లగా చెప్పేసింది. కొత్తగా కొనుక్కున్న ఇంట్లో తొలిరాత్రిని తన తల్లిదండ్రులకు అంకితం ఇస్తోందట! ఆలియా దీని గురించి వివరణ ఇచ్చినా, ఆమె కాన్సెప్ట్ మాత్రం చాలామందికి మింగుడు పడలేదట! ఏమైనా కాంట్రవర్సీ స్టేట్‌మెంట్లు ఇవ్వడంలో ఆలియా తరువాతే ఎవరైనా అంటున్నారు బాలీవుడ్ జనాలు.*

యథాప్రకారం ఆ చేయిని విదిలించేసింది సౌమ్య.

ఇవన్నీ సాధారణ విషయాలేకదా అని చందమామ నవ్వుకుంది. కొన్ని క్షణాల నిశ్శబ్దం తరువాత, "సౌమ్యా... నాలో రగిలే బడబాగ్నికి, నీ అధరాల దరహాసంతో రోజంతా ఆజ్యంపోసి రగిలించి, ఇప్పుడిలా ఎడమొహంతో ఉండటం నీకు న్యాయమేనా?" నెమ్మదిగా అడిగాడు.

ఆమె దిగ్గున లేచింది. "ఈ మాత్రం కాలక్షేపానికి మీ సంప్రదాయ పంజరంలో నుండి బైట పడటం ఎందుకు? చక్కగా కృష్ణారామా అంటూ చెక్కభజన చేసుకోవచ్చు కదా?" గొంతులో అదురు, ముఖంలో కోపం, కళ్ళల్లో నీళ్ళు, ఒకేసారి దర్శింపచేస్తూ అంది.

వెన్నెలతీరంలాంటి వక్షస్థలం, ఆమె ఉద్వేగానికి లయబద్ధంగా కదులుతోంది. దానిపై కదలాడే మంత్రాలతో ముడివేసిన మంగళసూత్రం సహనంగా ఉండాలంటూ ఇరువురినీ ఆదేశిస్తోంది. అతడు ఆమెని ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు.

"పిచ్చి సౌమ్యా... అమ్మపెట్టే నిబంధనలు నిన్నేకాదు నన్నూ ఇబ్బంది పెడుతున్నాయి కానీ, ఈ తాత్కాలిక విరహం ఎంత తీయగా ఉంటుందో మనలో ఎంత తహతహ పెంచుతుందో నీవెరుగవా? నిరీక్షణ అనంతర కలయిక ఎంతటి మధురమో ఇప్పటి మన ఆరాటం తెలియజెప్పటం లేదూ..." అనునయంగా అన్నాడతడు.

"అందుకేనా అవకాశం ఉన్న రోజు కూడా అంత బెట్టు చేస్తారు. ఆఫీస్ వర్క్ ఉందంటూ ఆ ల్యాప్‌టాప్‌ముందు కూర్చుని, ఇప్పటివరకు ఉండిపోయింది అందుకేనా?" ముక్కుపుటలు అదురుతుండగా అందామె.

"అలా ఎందుకనుకుంటావు సౌమ్య. నా హృదయంలో ఉప్పొంగే వలపు జలాలతో నీ సౌందర్యాన్ని నిరంతరం అభిషేకించాలనే నాకూ ఉంటుంది. మధువులూరే నీ పెదవులపై నా ప్రేమ సంతకం చేయాలనే ఉంటుంది".

"కానీ మీ అమ్మగారు అన్నివేళలా ఒప్పుకోరు అంటారు అంతేకదా.." అంది కోపంగా సౌమ్య.

"అమ్మగారేకాదు సౌమ్యా... సంప్రదాయాలు కట్టుబాట్లతో మహోన్నతమైన ఆచారాలను జోడించి మానవజీవన వికాసానికి మన ధర్మమే ఒక విధానాన్ని ఏర్పరిచింది. ఎంతటి అనురాగంఉన్న భార్యాభర్తలైనా కేవలం కోరికలు తీర్చుకోవటమే దాంపత్యంకాదు, రోజులో కొన్ని సమయాలను, నెలలో కొన్నిరోజులను అనుమతించింది. అతిక్రమిస్తే వచ్చే అనర్థాలనూ చెప్పింది. అవి అమ్మలాంటి వారు కొందరు తప్పక పాటించాలంటారు. అది తప్పాఒప్పా? అనే చర్చ పక్కన పెడదాం.." కాసేపు ఆగాడతడు.

"ఆలూమగలు ఒకరికోసం ఒకరు ఎదురు చూడటంలో ఉన్న అనుభూతి, కక్కుర్తి కలయికతో ఉండదు. కేవలం తన కోసమే ఒక తనువు ఎదురుచూస్తుందనే భావన ఇవతల వ్యక్తికి ఎంతో సంతృప్తినిస్తుంది.

ఆ సంతృప్తి నిలబెట్టటానికి తాత్కాలిక అసంతృప్తిని అప్పుడప్పుడు కలిగిస్తూ ఆ దాంపత్య జీవితాన్ని స్థిరీకరించింది. తమ ఇల్లు తమ సంసారం అనుకుంటూ ఒకరికోసం ఒకరు ఎదుటివారి సౌఖ్యంకోసం ఏర్పాట్లు చేసుకుంటూ పోతుంటారు. అదే దాంపత్యం. ఆ దాంపత్య సౌరభానికే దేవతలు దీవించారు. ప్రపంచం మొత్తం ఆ ప్రణయానికి ప్రణామాలు చేశారు. అది ఒక్క హిందూమతంలోనే కొనసాగింది. కొనసాగుతూనే ఉంది.."

"సొగసుని మనసుని కానుకచేసి, తనలో సగమై నిలిచిన భాగస్వామి కోసం ఇరువురు ఆరాటపడుతుంటారు. ఇప్పుడు మనం అదే స్థితిలో ఉన్నాం. ఎవరో ఏదో చేశారు అనుకోవటం ఎందుకు? ఒకరి ఎదలో ఒకరు ఒదిగిపోవటానికి, ఎంతో రసికుడైన దేవుడు ఆలుమగలుకోసం చేసిన ఏర్పాటు ఇది. ఇప్పటికే చాలా చెప్పినట్టున్నాను పద" అంటూ ఆమె నడుము కింద చెయ్యేసి లేపాడు విశ్వనాథ్. లేత నాజూకు నడుము మెలికలు తిరిగింది.

ప్రళయంలా తయారవ్వాలని ఊహించిన పడతి, భర్త ప్రణయకేళి అంకురార్పణలో అతని ఆరాటం చూసి ముసిముసిగా నవ్వింది.

"ఏదో ఒకటి చెప్పి కన్విన్స్ చేసేస్తారు మీరు..." తమకంగా అందామె.

"కన్విన్స్ చేయటం మా పనే. కరుణించటం మాత్రం ఎప్పుడూ మీపనే కదా.." అన్నాడతడు.

ముందు చెప్పుకున్నట్లు...

సౌమ్య శరీరంలో వెన్నెలను శశాంకుడు కాకుండా, ఆమె సహచరుడు ఆక్రమించుకోవాలని ఆరాటపడుతున్నాడు.

మల్లెలు మళ్ళీ కొత్తగా సువాసనలు విరజిమ్ముతున్నాయి.

సెల్: 95735 66990

# అలర్జీ - హోమియో చికిత్స

## హోమియోపతి

అలర్జీ అనే పదం మనము సర్వసాధారణంగా ప్రతీ రోజు వింటూ వుంటాము. అలర్జీ అనేది రోగనిరోధక వ్యవస్థకు సంబంధించిన ఒక రుగ్మత. వర్షాకాలం మెరిసే వేడి వేసవి నుండి ఉపశమనం ఇస్తుంది. అలాగే అది పలురకాల వ్యాధులతో ప్రాణాలు తోడేయునూ వచ్చు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా వర్షాకాలంలో ఒక అలర్జీ సమస్య వేదిస్తుంది. తుమ్ములా, దగ్గులో కాదు ఒక్కోసారి శ్వాసతీసుకోవడము కష్టమవుతుంది. ఈ జలుబు మరియు దగ్గు సహజంగా వైరల్ జ్వరాలకు దారితీస్తుంది. ఈ వర్షాకాలంలో ఆస్తమా, అలర్జీ, బ్రాంకైటీస్, ఫ్లూ వంటి వ్యాదులు ఎక్కువ చూస్తాము. మన అధునిక జీవనం, పారిశ్రామిక ప్రాంతాలలో మరియు పెద్ద పట్టణాలలో వాతావరణ కాలుష్యం ఈ అలర్జీ ఒక పెద్ద కారణం.

అలర్జీతో ఇబ్బందులు పడేవారి బాధ వర్ణనాతీతం. వయసుతో నిమిత్తం లేకుండా చిన్నా పెద్దా అందరు శ్వాస కోశ అలర్జీలను కలిగించే వాటిలో ప్రధానమైనవి. అలర్జీతో బాధ పడేవారిలో ఏదో ఒక ప్రత్యేకమైన పదార్ధానికి దగ్గరగా వచ్చినప్పుడు శరీరంలోని రక్తంలో ఉండే ఇమ్యూనోగ్లోబిన్-ఇ అనే యాంటీబాడీస్ తో అలర్జిన్ కలవడం వల్ల హిస్టమిన్ విడుదల వుతుంది. దీని వలనే వ్యాధి లక్షణాలు ప్రారంభ మవుతాయి. మనిషి శారీరకతత్వము, వాతావరణం, వంశపారంపర్య చరిత్ర, గాలి, నీరు, ఆహారం వీటిలో కలిగే మార్పులు, కలుషితం వలన రక్తంలో జరిగే మార్పుల వలన ఈ అలర్జీ కొందరికి కొన్ని పదార్థములు, కొన్ని వస్తువులు అలర్జీ కారణం అవుతాయి.




**కారణాలు:** 1.దుమ్ము, పుప్పొడి రేణువులు. 2. పెంపుడు జంతువుల వెంట్రుకలు 3.ఘాటు వాసనలు, చల్లటిగాలి. 4. శీతలపానియాలు, ఐస్‌క్రీమ్‌లు. 5.వంశ పారంపర్యం. 6.మస్కిటో రిపెల్లెంట్స్. 7. వాతావరణ మార్పులు.

**లక్షణాలు:** తుమ్ములు, ఆయాసం, శ్వాసలో ఇబ్బందులు, వాంతులు, ఉబ్బసం, ముక్కు కారడం, ఎర్రని దద్దుర్లు, కళ్లు దురద, కంటిపోర గుచ్చు కోవడం.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

**వ్యాధి నిర్ధారణ:** సి.బి.పి, ఈఎస్ఆర్, ఇస్నోఫిల్ కౌంట్ (ఏఈసీ), ఐజీ.ఈ.యాంటీబాడీస్, ఎక్స్‌రే, ఫల్మనరీ ఫంక్షన్‌టెస్ట్, సిటీస్కాన్, అలర్జిక్‌ప్రొఫైల్.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అలర్జీ నుంచి పూర్తిగా ఉపశమనంకలిగించే మందులు ఉన్నాయి. హోమియోచికిత్సతో అన్ని రకాల అలర్జిక్ సమస్యలు దూరమవుతాయి. హోమియోపతిలో అలర్జీకి మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. రోగ నిరోధక శక్తిని పెంచి వ్యాధి నివారణ త్వరితంగా అయ్యేలా చేయడం జరుగుతుంది. అలర్జీ ఏ కారణం వలన వస్తుంది. ఎంత తీవ్రంగా వుంది, తీవ్రతను బట్టి మందులు ఇవ్వబడుతాయి. దీనికి హోమియోలో ఆర్సనిక్ ఆల్బ్, రస్టాక్స్, బెల్లడోన, ఆర్టికమురిన్స్, ఆరమ్ ఢిఫిలమ్, ఇఫ్రెసియా, ఆలియంసెప మొదలగు మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడితే అలర్జీ సమూలంగా తగ్గిపోతుంది.










# కాలగర్భంలో కలసిపోతున్న టిబెట్!

**ఒక ప్రాచీన, సుసంపన్న, శాంతికాముక సంస్కృతిని చైనా నిర్లక్ష్యంగా, నిర్దాక్షిణ్యంగా రూపుమాపడాన్ని ప్రపంచ దేశాలు ఉలుకూ పలుకూ లేకుండా, తమకేమీ పట్టనట్టు చూస్తున్నాయి.**

టిబెట్ స్వరూప స్వభావాలు మారిపోతున్నాయి. రోడ్లు, రైలు మార్గాల నిర్మాణానికి చైనా పెద్ద ఎత్తున పెట్టుబడులు పెడుతోంది. ఏ మూల చూసినా ఆధునిక ఆకాశ హర్మ్యాలు వెలుస్తున్నాయి. చైనా నుంచి వలస వచ్చే జనం ఆ బహుళ అంతస్తుల భవనాల్లో బస చేస్తున్నారు. సందర్శకులకు ఒకప్పుడు అబ్బురంగా కనిపించిన టిబెట్ ఇప్పుడు అమెరికా నగరాలను తలపిస్తోంది. ఈ అభివృద్ధిని చూసి టిబెట్ స్థానికులు మాత్రం తీవ్ర ఆందోళన చెందుతున్నారు. టిబెట్ చైనా ముట్టడిలో ఉన్నట్టు వారికి తేలికగా అర్థమైపోతోంది. వారికి తుఫాను ముందర ప్రశాంతతే కనిపిస్తోంది. టిబెట్‌లో ఏ మూల చూసినా, ఉద్రిక్త వాతావరణం నివురు గప్పిన నిప్పులా మండుతోంది.

టిబెట్‌లో బౌద్ధ మతాన్ని సాంస్కృతికంగా తుడిచి పెట్టేస్తున్న చైనా తీరు పట్ల ప్రపంచం ఉదాసీనంగా వ్యవహరించడం అక్కడి ప్రజలను ఆందోళనకు, ఆవేదనకు గురి చేస్తోంది. ఒక ప్రాచీన, సుసంపన్న, శాంతికాముక సంస్కృతిని చైనా నిర్లక్ష్యంగా, నిర్దాక్షిణ్యంగా రూపుమాపడాన్ని ప్రపంచ దేశాలు నిశ్శబ్దంగా, ఉలుకూ పలుకూ లేకుండా, తమకేమీ పట్టనట్టు చూస్తున్నాయి. చైనా 1950 ప్రాంతంలో టిబెట్‌ను తనలో విలీనం చేసుకుంది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోరుతున్న టిబెట్‌ను చైనా అప్పటి నుంచీ తన ఉక్కు పాదాలతో అణచివేస్తూనే ఉంది. స్వేచ్ఛ కోరుతున్నందుకు అప్పటి నుంచి ఇంతవరకూ సుమారు పది లక్షల మంది టిబెటన్లను చైనా హత మార్చి ఉంటుందని అంచనా. ఇక ఒక పద్ధతి ప్రకారం ఎన్ని ఆలయాలను, ఎన్ని ఆరామాలను అక్కడ చైనా భూస్థాపితం చేసిందో లెక్కలేదు.

చరిత్రకారుల అంచనా ప్రకారం సుమారు ఆరు వేల బౌద్ధారామాలను చైనా ప్రభుత్వం నేల మట్టం చేసి ఉంటుంది. ఇక టిబెట్ చారిత్రక అవశేషాలు, వారసత్వ సంపద, వాస్తు కళాఖండాలు వగైరాలు ఎంతగా శిథిలమైపోయాయో, సర్వ నాశనమైపోయాయో తెలియదు. టిబెట్ సంస్కృతి మీద తీరని కసేదో ఉన్నట్టు చైనా మొదటి నుంచీ వ్యవహరిస్తోంది. నిజానికి టిబెట్ చైనాలో విలీనం అయ్యేటప్పుడు ఓ స్వయంప్రతిపత్తి కలిగిన దేశంగా విలీనం అయింది. కానీ, పేరుకు మాత్రమే స్వయంప్రతిపత్తి. ఆచరణలో చూస్తే, నియంత్రణ అంతా చైనా ప్రభుత్వం చేతుల్లోనే ఉంది. టిబెట్ ప్రజలకు ఎందులోనూ ప్రాతినిధ్యమే లేదు. టిబెట్ ప్రజల గొంతు కలను ఏనాడో నొక్కేసింది.

### ప్రబలిన ఆధిపత్య ధోరణి

ఇక టిబెట్ స్వయం పాలక సంస్థకు చైర్మన్‌గా టిబెట్‌కు చెందిన వ్యక్తినే నియమిస్తారు. కానీ, ఆయనకు అధికారాలు నామ మాత్రమే. ఆయన చైనా కమ్యూనిస్టు పార్టీ బ్రాంచి కార్యదర్శి కింద పని చేయాల్సి ఉంటుంది. పైగా ఆ టిబెట్‌కు చెందిన చైర్మన్ కూడా చైనా నుంచి వచ్చిన వ్యక్తే అయి ఉంటాడు. తూర్పు చైనాకు చెందిన ఊ ఇంగ్‌జీని ఈసారి చైర్మన్‌గా నియమించారు. టిబెటన్లకు, చైనీయులకు మధ్య సమన్వయంగానీ, సహకారంగానీ ఉండవు. చైనా ప్రజలు సైతం టిబెటన్లకు పాలకులుగానే వ్యవహరిస్తుంటారు. టిబెటన్ల పట్ల వారు ఒక విధమైన ఈసడింపు కనబరుస్తుంటారు. టిబెట్‌లోని ఉన్నత స్థాయి ప్రభుత్వ ఉద్యోగాలన్నిటిలో చైనా దేశానికి చెందినవారినే నియమిస్తుంటారు. పెద్ద పెద్ద వ్యాపారాలన్నీ చైనీయులే నిర్వహిస్తుంటారు. ఇక్కడి చైనీయుల జీవనశైలి, జీవన ప్రమాణాలతో పోలిస్తే టిబెటన్ల జీవన ప్రమాణం చాలా తక్కువ.

టిబెటన్లను చైనీయులు ఒక పట్టాన నమ్మరు. అధికారులు సాధారణ కార్మిక ఉద్యోగాలన్నిటిలో టిబెటన్లను భర్తీ చేస్తుంటారు. అంటే పారిశుద్ధ్య కార్మికులు, రోడ్డు నిర్మాణ కార్మికులు, మరుగుదొడ్ల శుభ్రం చేసేవారు సాధారణంగా టిబెటన్లే అయి ఉంటారు. ఒకప్పుడు గౌరవప్రదమైన, వైభవోపేతమైన స్థితిలో ఉన్న టిబెట్ ప్రజలు ప్రస్తుతం అతి ఘోరమైన, దుర్భరమైన జీవితాలను అనుభవిస్తున్నారు. వారున్న ప్రాంతాల్లో కటిక పేదరికమే రాజ్యమేలుతుంటుంది. సుమారు 66 ఏళ్లుగా చైనా టిబెట్‌లో తిష్ట వేసి ఉన్నప్పటికీ, టిబెటన్ల స్వాతంత్ర్య కాంక్షను మాత్రం అణచివేయలేకపోయింది. వాళ్లను రాజకీయంగా, మతపరంగా అణచివేస్తున్న కొద్దీ వారిలోని స్వాతంత్ర్య కాంక్ష బలపడుతూనే ఉంది. చైనీయులంటే టిబెటన్లకు పరమ అసహ్యం.



చైనీయులకు ఆ సంగతి బాగా తెలుసు. టిబెట్‌లో చైనా ఫేస్‌బుక్, గూగుల్, వాట్సప్ వంటి సోషల్ మీడియా నెట్‌వర్క్‌లను నిషేధించడాన్ని బట్టి చైనా ఎంత అభద్రతా భావంతో ఉందో అర్థం చేసుకోవచ్చు.

విదేశీ పర్యాటకులు టిబెట్ సందర్శనకు వచ్చినప్పుడు, టిబెట్ శివార్లలోని తక్లాకోట్ వద్దే బస్సు దిగిపోవాల్సి ఉంటుంది. అక్కడ వారి లగేజీని చైనా పర్యాటక సిబ్బంది, పోలీసులు తనిఖీ చేస్తారు. దలైలామాకు చెందిన వస్తువులు గానీ, కాగితాలు గానీ ఉన్నాయేమోనని పరిశీలిస్తారు. ముద్రిత సామగ్రి నంతటినీ సోదా చేస్తారు. పర్యాటకుల కెమెరాలు, సెల్‌ఫోన్లను కూడా క్షుణ్ణంగా శోధిస్తారు. ఇక టిబెట్‌లోని ప్రతి భవనం మీదా, ప్రతి వీధిలోనూ చైనా జాతీయ పతాకం రెపరెపలాడాల్సిందే. టిబెట్ చైనా అధీనంలో ఉందని అందరికీ తెలియజేయడమే దాని ఉద్దేశం. ఆ పతాకం కూడా టిబెటన్ పతాకం కన్నా పెద్దదిగా, ఎత్తులో ఉండాల్సిందే. అలా లేకపోతే, జాతి వ్యతిరేక కార్యకలాపాల కింద శిక్ష విధిస్తారు. హోర్డింగుల మీద కూడా 'చైనా దేశపు టిబెట్ లోనికి స్వాగతం' అని ఉంటుంది. ఇక టిబెటన్లకు పాస్‌పోర్టులు మంజూరు చేయరు. వారు చైనా మాత్రమే వెళ్లాలితప్ప విదేశాలకు వెళ్లకూడదని చైనా ఉద్దేశం. అంటే టిబెటన్లు స్వదేశంలోనే బందీలన్న మాట.

## పర్యాటకులపై ఆంక్షలు

విదేశీ పర్యాటకులు కూడా టిబెట్‌లో స్వేచ్ఛగా తిరగడానికి వీల్లేదు. పర్యాటకులు వచ్చే ప్రతి బస్సులోనూ ఓ చైనా పోలీస్ ఎక్కుతాడు. ఆ బస్సు ఎక్కడెక్కడికి వెళ్లాల్సిందీ అతను నిర్దేశిస్తాడు. పర్యాటకులు స్థానికులతో కలవడానికి గానీ, మాట్లాడడానికి గానీ వీల్లేదు. పర్యాటకులు ఫొటోలు తీసుకోవడానికి అనుమతి లేదు. టిబెట్ ఓ పోలీస్ రాజ్యంగా మారిపోయింది. విచిత్రమేమిటంటే, బౌద్ధారామాల్లో ఎంత మంది సాధువులు ఉండేదీ అధికారులే నిర్ణయిస్తారు. ఒక ఆరామానికి చెందిన సాధువు మరో ఆరామానికి వెళ్ళాలన్నా అనుమతి అవసరం. వాళ్ళ వెంట సాయుధ సైనికులు ఎప్పుడూ నీడలా ఉంటారు. టిబెటన్లలో ఎవరూ తమ అభిప్రాయాలను బాహాటంగా వ్యక్తం చేయడానికి వీల్లేదు. దలైలామాకు ఆశ్రయం ఇచ్చినందుకు భారతదేశం పట్ల మాత్రం వారికి కృతజ్ఞత ఉంది.

టిబెట్ సంప్రదాయం ప్రకారం దలైలామా తరువాతి స్థానం పంచన్ లామాకు దక్కుతుంది. దలైలామా వారసుణ్ణి ఎంపిక చేయడంలో ఆయనే ప్రధాన పాత్ర పోషిస్తాడు. 1959లో దలైలామా భారత్‌కు వలస వచ్చేసిన తరువాత, పంచన్ లామా చోక్యి గ్యాల్‌సెన్ చైనా దేశానికి తొత్తుగా మారాడు. టిబెటన్ల తిరుగుబాటును అణచివేయడంలో చైనా అధికారులకు, సైనికులకు తోడ్పడ్డాడు. అయితే, 1962 నుంచి ఆయనకు చైనా పట్ల ఉన్న భ్రమలు తొలగిపోయాయి. టిబెట్ సంస్కృతిని కాలరాయడానికి చైనా ప్రయత్నిస్తోందంటూ ఆయన విమర్శలు మొదలుపెట్టాడు. ఆయన్ని 1964లో చైనా ప్రభుత్వం అరెస్టు చేసింది. గృహ నిర్బంధంలో ఉంచారు. 1989లో ఆయన అనుమానాస్పద స్థితిలో మరణించాడు. ఆయన మీద చైనా విష ప్రయోగం జరిపినట్టు వార్తలు వచ్చాయి. కొత్త పంచన్ లామాగా దలైలామా గెదున్ చోక్యీ నైమా అనే బాలుడిని ఎంపిక చేశారు. అయితే, ఆ బాలుడు విచిత్ర పరిస్థితుల్లో మాయమైపోయాడు. చైనా అతన్ని ఎక్కడో నిర్బంధంలో ఉంచిందని ఆ తరువాత వెల్లడైంది.

అతని స్థానంలో చైనా ప్రభుత్వం పంచన్ లామాగా గ్యాన్‌కైన్ నోర్బును ఎంపిక చేసింది. అతను ఓ కమ్యూనిస్టు పార్టీ సభ్యుడి కుమారుడు. టిబెటన్లు నోర్బూను పంచన్ లామాగా అంగీకరించలేదు. అతను చైనా దేశానికి తిరుగులేని తొత్తుగా వ్యవహరించడం మొదలుపెట్టాడు. టిబెటన్ పంచన్ లామా అధికారికంగా టిబెట్‌లో ఉన్న తాషిల్ హూంపో ఆరామంలో నివసించాలి. కానీ అతను బీజింగ్‌లో తన అధికార నివాసాన్ని ఏర్పరచుకున్నాడు. అతను టిబెట్‌లో అడుగు పెట్టడమే మానేశాడు. అతను టిబెట్‌కు వచ్చాడంటే ప్రధానికి మించిన భద్రతతో రాక తప్పడం లేదు. అయితే, అతను టిబెట్ వచ్చినప్పుడు తప్పనిసరిగా ప్రతి ఇంటి నుంచి ఇద్దరు వచ్చి ఆయన సభల్లో పాల్గొనాలని చైనా ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది.

## అమానుష పద్ధతులు

టిబెట్‌ను చైనాలో అన్ని విధాలా విలీనం చేయడానికి చైనా ప్రభుత్వం అనేక పద్ధతులు అనుసరిస్తోంది. భౌగోళికంగా టిబెట్‌ను చైనాలో కలపడంతో పాటు, టిబెట్ ఉనికిని మటుమాయం చేయడం, దలైలామా పేరుకు శాశ్వతంగా సమాధి కట్టడం అందులో ప్రముఖమైనవి. టిబెట్‌లోని సంచార జాతులు, వ్యవసాయదారుల మీద చైనా ఒత్తిడి ప్రభావం అంతగా పడడం లేదు కానీ, నగర, పట్టణ వాసుల మీద మాత్రం దీని ప్రభావం పడుతోంది. చైనా నుంచి వచ్చే వలసదార్లతో టిబెట్ నగర వాసులు, పట్టణవాసులు ఉక్కిరిబిక్కిరవుతున్నారు. టిబెట్‌లో చైనా జనాభాను నింపేయడం ద్వారా టిబెట్ ఉనికిని మటుమాయం చేయడమే సరైన మార్గమని చైనా పాలకులు గట్టిగా భావిస్తున్నారు. వచ్చే ఇరవై ఏళ్ళలో టిబెట్ జనాభా ఉనికి లేకుండా పోవడం ఖాయమని కూడా చైనా పాలకులు గట్టి నమ్మకంతో ఉన్నారు.

చైనా, టిబెట్‌ల మధ్య సాన్నిహిత్యం, సమన్వయం పెరగాలంటే 'మాండరిన్' అనే భాషను తప్పనిసరిగా నేర్చుకోవాల్సి ఉంటుందని చైనా ప్రభుత్వం భావిస్తోంది. ఫలితంగా ఇప్పుడు టిబెటన్లు తప్పనిసరిగా మాండరిన్ భాష నేర్చుకోవాల్సి వస్తోంది. కొద్ది సంవత్సరాల్లో మాండరిన్ భాషకు ప్రాధాన్యం పెరిగి, టిబెటన్ భాషకు ప్రాధాన్యం తగ్గే ప్రమాదం ఉంది. టిబెటన్ల స్వాతంత్ర్య కాంక్షకు సంబంధించిన ప్రతి చిహ్నాన్నీ, ప్రతి సంకేతాన్నీ చైనా క్రమంగా అదృశ్యం చేస్తోంది. బౌద్ధులు, బౌద్ధ మతానికి సంబంధించిన ప్రతి అంశాన్నీ చైనా పుస్తకాల నుంచి చెరిపేస్తోంది. చైనా ఇటీవల టిబెటన్ బౌద్ధ పరిశోధన సంస్థను మూసేసింది. ఈ పరిశోధన సంస్థ ప్రపంచంలోనే అతి పెద్ద బౌద్ధ పరిశోధన సంస్థ.

దలైలామాను టిబెటన్ల మనసుల నుంచి, జ్ఞాపకాల నుంచి చెరిపివేయలేకపోయిన చైనా ప్రభుత్వం ఆయన ఆఖరు క్షణాల కోసం ఎదురు చూస్తోంది. ఆయన కన్నుమూసిన మరుక్షణం ఆయన స్థానంలో చైనాకు చెందిన వ్యక్తిని దలైలామాగా నియమించాలని అది భావిస్తోంది. దలైలామా గనుక టిబెట్‌కు చెందిన వ్యక్తిని తన వారసుడిగా ఎంపిక చేసే పక్షంలో, ఆయనను వెంటనే హతమార్చడానికి కూడా చైనా ఎత్తులు వేస్తోంది. దలైలామా భారత్‌లో ఉన్నందువల్ల, టిబెట్ మత, ఆధ్యాత్మిక సంస్కృతిని ఉక్కుపాదంతో అణచివేయడమే పరమావధిగా చైనా కుట్రలు చేస్తోంది. ఓ సుసంపన్న సంస్కృతి క్రమంగా అంతరించిపోతోంది. అందుకు ఇప్పటికే సూచనలు కనిపిస్తున్నాయి. టిబెట్‌లో ఇటువంటి సాంస్కృతిక ఉత్పాతం చోటుచేసుకుంటున్న సమయంలో ప్రపంచ దేశాలు తలదించుకుని కూర్చోవడం నిజంగా సిగ్గుచేటైన విషయం.






కథా చర్చలు మొదలయ్యాయి. నేను ఒక కథ చెప్పాను.

ఆ కథను అందరూ ఏకగ్రీవంగా తిరస్కరించారు.

'అది కమర్షియల్‌గా హిట్ కాదు'.

'అది ఫార్ములా సినిమాగా పనికి రాదు'.

'అందులో కథే లేదు'.

'ఏ హీరో ఈ సినిమా చేయడానికి ఒప్పుకోడు'.

'పీరియడ్ ఫిలింగా తీయాలంటే చాలా కష్టం'

'కామెడీ లేదు'

'ఫైట్స్ లేవు'.

'పాటలకు అవకాశం లేదు'. 'ఐటెం సాంగ్ లేకుంటే బి, సి సెంటర్లలో ప్రేక్షకులు రారు'.

'క్యారెక్టర్ ఆర్టిస్టులు, ప్యాడింగ్ ఆర్టిస్టులకు ప్లేస్ లేదు.'

'ఇప్పటి కాలానికి పనికిరాదు'.

ఇవన్నీ మా స్టోరీ డిపార్ట్‌మెంట్ సభ్యుల అభిప్రాయాలు.

అందుకే. ఇదే కథతో సినిమా తీయాలన్న నా నిర్ణయాన్ని కరాఖండిగా చెప్పాను.

●●●

'ఇప్పుడు తెలుగు సినిమాల సక్సెస్ ఫార్ములా 'పి' అనే అక్షరం చుట్టే తిరుగుతుంది.

'పి' అనే జాన్రా (genre)అంటే

'పోలీస్'

'ప్రేమ'

'పగ' 'పెళ్ళి'.

'పిశాచి'

'పౌరాణికం'

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డులపోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా ఆమెరికా వెళుతున్నాడతను. విమానంలో కూర్చుని గతం గుర్తు చేసుకున్నాడు. అతడో తెలుగు దర్శకుడు. హైద్రాబాద్‌లో ఒక నిర్మాత ఆఫీసు ఎదుట పడిగాపులుపడుతున్న సమయంలో జూనియర్ ఆర్టిస్ట్ నిర్మాత చేతిలో కత్తిపోట్లకు గురైంది. ఆమెను కాపాడినందుకు అతడే దోషిగా మారాడు. నిర్మాత పరపతితో తప్పించుకున్నాడు. కానీ అతని వద్ద వీడియో సాక్ష్యం ఉంది! డీసీపీ పుష్పాకిరణ్ ఆ విషయం గ్రహించి మధ్యవర్తిత్వం చేసి ఒప్పందం కుదిర్చింది. దీంతో పూటకు ఠికాణా లేని ఆ దర్శకుడి దశతిరిగిపోయింది. డీ.సీ.పీ పుష్ప హృదయంలో అతడి పట్ల ప్రేమ అంకురించింది!

ఆ తర్వాత.....

'ఫ్యాక్షన్'

'పట్టుదల'

'పట్టుదల' అంటే ఏదో ఒక మాట పట్టింపుతోనో లేదా ఏదో పిచ్చి సెంటిమెంట్ కారణంగానో ఇరవై ముప్పై ఏళ్ళ క్రితం విడిపోయిన బావా బావమరుదులు, అన్నాచెల్లెళ్ళు, అన్నాతమ్ముళ్ళను, ఇన్నేళ్ళ తర్వాత ఒక హీరోనో, హీరోయినో వచ్చి, ఓ పిచ్చి ట్రిక్ ప్లే చేసి, ఇరవై ముప్పై ఏళ్లుగా వ్యాపార ప్రపంచాలను నడుపుతున్న అక్కడున్న వాళ్ళందరూ వెధవాయలని రుజువుచేసి, అక్కడున్న హీరోయిన్‌ని బుట్టలో వేసి శుభం కార్డు వరకు రకరకాల సర్కస్ ఫీట్లు చేయడమన్న మాట. ఈ కథల్లో అక్కడక్కడ దేశం, సమాజం, కులం, మతం వంటి పడికట్టు మాటలు చల్లితే సరిపోతుంది.

ఈ జాన్రాలో, ఎన్ని వందల సినిమాలు తీసినా, ఈ కథలనే రకరకాల మసాలాలతో వండి వార్చి వడ్డిస్తుంటే మనం అవే చూస్తున్నాం. మన సినిమాలు జాతీయ స్థాయిలో, అంతర్జాతీయ స్థాయిలో కనీసం ఎంట్రీక్కూడా ఎందుకు నోచుకోవడం లేదు?

తెలుగు సినిమా అనగానే "ప్చ్! అందులో ఏముంటుంది? ఐదారు పాటలు, ఒక ఐటెం సాంగ్, ఐదారు ఫైట్లు, విదేశీ లొకేషన్లు, మందల మందల ఆర్టిస్టులు, అసహ్యం పుట్టించే కామెడీ, అందులోనూ పిచ్చి స్పూఫ్‌లు' అనే స్థాయికి దిగజారింది" అంటూ నా ఉపన్యాసాన్ని ముగించాను.

నా ఆవేశాన్ని చూసి... మా కథా బృందం విస్తుపోయింది.

"మరేం చేద్దాంరా?" నవీన్ అడిగాడు.

"నా సినిమాలో బూతులు ఉండొద్దు. నా సినిమాలో నటీనటులు తెలుగు స్పష్టంగా పలకగలిగి ఉండాలి. వాళ్ళ డబ్బింగ్ వాళ్ళే చెప్పుకోగలగాలి. ముఖ్యంగా హీరోయిన్ పుష్టిగా ఉండాలి. ఇప్పుడొచ్చే సినిమాల్లో పూచికపుల్లలా ఉండి, పీక్కుపోయిన ముఖాలకు మేకప్పులు దట్టించి, ఏబీసీడీలు చెప్పే తెలుగు వాళ్ళైనా, హిందీ వాళ్ళైనా నాకొద్దు. ముఖ్యంగా హీరోయిన్ ముఖంలో తెలుగుతనం ఉట్టి పడాలి. అందంగా ఉండాలి. ఆమెను చూస్తే మనమధ్య తిరుగాడే అమ్మాయిలా ఉండాలి. నటనలో నిష్ణాతురాలై ఉండాలి. ముఖ్యంగా విషాదాన్ని బాగా పండించగలగాలి" అన్నాను.

"ఒరేయ్! ఏంట్రా, మనమేదైనా 'దేవదాసు' లాంటి సినిమా తీయబోతున్నామా?" అని నవీన్ ప్రశ్నించాడు.

"దేవదాసు బెంగాలీ వాడు. నేను తీయబోయే సినిమాలో తెలుగు నేటివిటీ ఉట్టి పడాలి".

వాళ్ళందరూ నన్ను వింతగా చూశారు.

"అలా చూడకండి! మనం మామూలు సినిమా తీయబోవడం లేదు? మనం ఒక చరిత్ర సృష్టించబోయే సినిమా తీద్దాం. యస్! ఉయ్ హావ్ టు క్రియేట్ హిస్టరీ విత్ అవర్ ఫిల్మ్! దేశం మన సినిమా గురించి గొప్పగా చెప్పుకునేలా తీద్దాం. ప్రపంచానికి తెలుగు సినిమా పవరేంటో రుచి చూపిద్దాం. నేను అందుకు సిద్ధం. మీరు అందుకు సిద్ధమేనా?"

వాళ్ళేం మాట్లాడలేదు.

"ప్లీజ్! నన్ను అర్థం చేసుకోండి. నేనొక విషయం చెబుతున్నా, జాగ్రత్తగా వినండి!"

వాళ్ళు ఆసక్తిగా చూశారు.

"తెలుగులో సంవత్సరానికి ఎన్ని సినిమాలు నిర్మించబడుతున్నాయి?"

"సుమారు రెండొందలు" నవీన్ అన్నాడు.

"అందులో ఎన్ని సినిమాలు రిలీజ్ అవుతున్నాయో, ఎన్ని ల్యాబుల్లో మూలుగుతున్నాయో, ఎన్ని వివిధ దశలకు చేరుకుని ఆగిపోతున్నాయో, థియేటర్లు దొరకక ఎన్ని సినిమాలు రిలీజుకు నోచుకోలేకపోతున్నాయో ఏమైనా ఆలోచించారా?"

"పోనీ, పోయిన సంవత్సరంలో రిలీజైన సినిమాల్లో నీకు ఎన్ని గుర్తున్నాయి?"

"ఓ పది వరకు ఉంటాయి!"

"వాటి బడ్జెట్ ఎంతో, వాటిల్లో హిట్ కొట్టిన సినిమాలు ఎన్నో, హిట్ కొట్టిన సినిమాల ప్రొడ్యూసర్లకు వచ్చిన లాభం ఎంతో, హిట్ కాని సినిమాలు నిర్మించిన ప్రొడ్యూసర్ల పరిస్థితి ఏమిటో, అసలు ఎన్నో కష్టనష్టాలకోర్చి, కోట్లు ఖర్చుపెట్టి, సినిమా నిర్మించి రిలీజు కాక మిగిలిపోయిన సినీ నిర్మాతల పరిస్థితి ఏమిటో ఎప్పుడైనా ఆలోచించారా?"

ఎవ్వరూ మాట్లాడలేదు.

"మనం మిగతావాళ్ళ లాగా కాక కొంత సైంటిఫిక్‌గా ఆలోచించాలి. 200 సినిమాలు తీస్తే, అందులో సగం మాత్రమే రిలీజు అయి, వాటిల్లో ఓ 10 శాతం మాత్రమే హిట్టు కొడితే, మిగతా సినిమాల పరిస్థితి ఏమిటి? మరి దాదాపు అన్ని సిని



మాలు కూడా కమర్షియల్ ఫార్ములాని నమ్ముకునే తీస్తున్నారు కదా?"

"అయితే?"

"మనం కూడా అలా 95 శాతం సినిమాల్లో ఒకటిగా మిగిలిపోయే అనామకమైన సినిమా తీద్దామా?"

"అట్లా ఎందుకు అనుకోవాలి? మనం తీసే సినిమా, హిట్టయ్యే మిగిలిన 5 శాతంలో ఉండాలనుకోవాలి గానీ.."

"కరెక్టే! కానీ అలా హిట్టయిన సినిమాల బడ్జెట్ ఎంతో, అందులో కథ ఏమిటో, అందులో హీరో ఎవరో, ఆ సినిమాల డైరెక్టర్లు ఎవరో ఆలోచించారా? మనం అంత బడ్జెట్ పెట్టి సినిమా తీయగలమా?"

"లేదు"

"పోనీ, మనం టాప్ హీరోలలో ఎవరినైనా కన్విన్స్ చేసి, మనం అనుకున్న కథతో, మన సినిమాలో నటింపచేయగలమా?"

"డౌట్!"

"నేననేదీ అదే! మనం ఎక్కువ బడ్జెట్ పెట్ట లేము. మంచి కథలో పెద్ద హీరోలను కన్విన్స్ చేయ లేము. ఫార్ములాతో సినిమాను 5 శాతం హిట్ సినిమా జాబితాలో నిలపలేము. ఈ పరిస్థితుల్లో మనకున్న దారేంటి?"

"అది కూడా నువ్వే చెప్పు!"

"నేను కథ విషయంలో రాజీపడే ప్రసక్తే లేదు. అందుకే ఆ కథతో ఒక గొప్ప సినిమా తీద్దాం. సిని మాకు ఎంత ఖర్చు పెడుతున్నామో అంతే మొత్తం పబ్లిసిటీకి ఖర్చుపెడదాం. మేధావులు, రచయితలు, సినీ ప్రముఖులకు చూపించి, వాళ్ళ అభిప్రాయాలు తీసుకుందాం. ప్రచారం అదరగొడదాం. విజయం మనదే!" అన్నాను ఆవేశంగా.

"మరి యాక్టర్లు?"

"కొత్తవాళ్ళు, తెలుగువాళ్ళు, ఫిల్మ్ ఇనిస్టిట్యూట్‌లో కోచింగ్ తీసుకున్న వాళ్ళలో కొందరికి అవకాశం ఇద్దాం. వేలల్లో ఒక్క సినిమా కాకుండా ఎన్నోఏళ్ళకు ఓ మంచి సినిమా వచ్చిందని ప్రేక్షకులు అనుకునేలా సినిమా తీద్దాం".

"నేనొక్క మాట చెప్పనా?" అన్నాడు ప్రకాశం.

ఆయన మా గ్రూపులో అందరికన్నా పెద్దాయన, అనుభవజ్ఞుడు. సినీరంగంలో ఇరవై ఏళ్ళుగా కో-డైరెక్టరుగా, కథా రచయితగా ఉన్నాడు. కానీ, అదృష్టం కలిసి రాక, తీసిన సినిమాలు సక్సెస్ కాక, ఈ పోటీ ప్రపంచంలో ఇమడలేక, కో-డైరెక్టరుగానే మిగిలిపోయాడు.

ఆయన సిన్సియర్, నిజాయితీపరుడు. ఆయనంటే నాకు చాలా గౌరవం.

అందుకే "చెప్పండి సార్!" అన్నాను.

"సార్ మీ ఉద్దేశ్యం, ఆలోచన మంచిదే. కానీ, మీరు తీయబోయే సినిమాను క్రిటిక్స్ మెచ్చుకుంటారేమో గానీ రిలీజ్ దగ్గరకు వచ్చేసరికి డిస్ట్రిబ్యూటర్లదే పై చేయి. వాళ్ళకు సాహిత్య విలువలు, ఉన్నత, ఉత్తమ అభిరుచులు తలకెక్కవు. వాళ్ళకు కలెక్షన్లు తప్ప మరో విషయం అర్థం కాదు. ఎంతసేపటికీ హీరో, హీరోయిన్లు ఎవరు? ప్యాడింగ్ ఎవరు? ఐటెం సాంగ్స్ ఎవరు చేస్తున్నారు? కామెడీ ఉందా? అనేవే కొలమానాలు! మనం మంచి సినిమా తీసినా, వాళ్ళ సహకారం లేనిదే రిలీజ్ కష్టం అవుతుంది సార్!" అన్నాడు.

నేను ఆలోచనలో పడిపోయాను. ప్రకాశం గారు చెప్పిన పాయింట్ కరెక్టే.

"ప్రకాశం గారూ! మీరు చాలా వ్యాలీడ్ పాయింట్ చెప్పారు. ఏం చేద్దాం మరి! నాకేమో ఈ రొటీన్ ఫార్ములా సినిమాలు తీయడానికి మనసొప్పడం లేదు. జాతీయ అంతర్జాతీయ స్థాయిలో తెలుగు సినిమా సత్తాను చూపించాలని ఉంది".

"మీరు ఏమనుకోనంటే ఒక మాట చెబ్తాన"ని ఆయన అన్నాడు.

నేను తప్ప వాళ్ళంతా ఒక గ్రూప్ అయినట్టుగా అనిపించింది.

"అయ్యో, పర్లేదు చెప్పండి!"

"సార్! సినిమా అనేది మీరనుకుంటున్నట్టుగా 'కళ' కాదు సార్. ఆ రోజులు పోయాయి. ఇప్పుడు సినిమా అన్నది 'వ్యాపారం'! ఎంత పెడ్తున్నాం, ఎంత వస్తుంది అన్న సూత్రం మీదనే సినిమా రంగం పనిచేస్తోంది. సిని..." ఆయన్ని మధ్యలోనే ఆపి,

"నేననేది కూడా అదే! 95 శాతం ఫెయిల్యూర్స్ ఉన్నప్పుడు అది మంచి వ్యాపార లక్షణం ఎలా అవుతుంది? డబ్బులూ పోయి, పేరూ రాక... రెంటికి చెడ్డ రేవడిలా మిగిలిపోతామనే నా భయం".

నేను వాళ్ళకు చెప్పలేదుగానీ, ఆ భయం నాలోనూ క్షణక్షణం సుళ్ళు తిరుగుతూనే ఉంది. వాళ్ళు ప్రొఫెషనల్స్. నేనేమో కేవలం పాషన్‌తో, హాబీకోసం సినిమాలు చేస్తున్నాను. ఒక్క సినిమా ఫ్లాప్ అయితే వాళ్ళకేం కాదు. ఈ కంపెనీ కాకపోతే మరో కంపెనీ. వాళ్ళకు జీవితం గడిచిపోతుంది. నాకలా కాదు. ఈ సినిమాతో నా భవిష్యత్తు అటో ఇటో తేలిపోతుంది. సక్సెస్ అయ్యానా సరే, మరిన్ని సినిమాలు తీసే అవకాశం వస్తుంది. లేదంటే మాత్రం, కృష్ణానగర్‌కు, సినీరంగానికి బైబై

**దేశం గర్వించదగిన చిత్రం తియ్యాలి, మనదైన చిత్రం నిర్మించాలని సంకల్పించుకున్నాడు ఆ దర్శకుడు. ప్రస్తుత కమర్షియల్ ఫార్ములా చిత్రాలకు భిన్నంగా ఉండాలి, దేశమంతా మన సినిమాపైనే దృష్టి కేంద్రీకరించాలి, ఈ చీపురుపుల్లల హీరోయిన్లు మనకి వద్దు అనుకున్నాడు. ఆ దిశగా కథా చర్చలు ప్రారంభించాడు. ఇలాంటి సినిమాలకు డిస్ట్రిబ్యూటర్లే ప్రధాన ఆటంకంగా ఉంటారన్నారెవరో. మరి అతనేం చేశాడు?**

చెప్పాల్సి ఉంటుంది. ఒకవిధంగా ఈ సినిమాను నేను అసిధారవ్రతంలా చేయాలి.

"సార్!"

నేను ఆలోచనల నుంచి తేరుకున్నాను.

"కమర్షియల్ ఫార్ములాతో మనమే హిట్ కొట్టొచ్చు కదా సార్! ఇంకో విషయం... హిట్టు, ఫెయిల్యూర్స్‌తో సంబంధం లేకుండా కమర్షియల్ సినిమాలో చేస్తేనే మాకు మరోచోట పని దొరుకుతుంది సార్. ఓ సంవత్సరం పాటు ఇటువంటి సినిమాకు పనిచేసిన తర్వాత మళ్ళీ ఫార్ములా సినిమాకు పనిచేస్తామంటే మాకు అవకాశాలు రావు సార్! మా బాగోగులు కూడా దృష్టిలో ఉంచుకోవాలి సార్!" అన్నాడు ప్రకాశం.

"ఓహో! దీనికి ఆ కోణం కూడా ఉందా? మంచి సినిమా కోసం పనిచేసిన వాళ్ళను ఫార్ములా సినిమా కోసం తీసుకోరా?" అని అడిగాను.

"కష్టం సార్! హేళన చేస్తారు. ఆర్ట్ ఫిలిమ్స్ తీసుకో పొమ్మని గేలిచేస్తారు" అన్నాడు ప్రకాశం.

ఇంతలో నవీన్, "అది కాదురా, అసలు మన ప్రొడ్యూసర్ ఏమంటారో కనుక్కున్నావా? అసలు కథ ఆయనకు నచ్చాలి కదా?" అనే పాయింట్ లేవనెత్తాడు.

అయితే, జూనియర్ ఆర్టిస్టును పొడిచిన సంగతి, ప్రొడ్యూసర్‌ని, రైటర్‌ని పోలీసులు పట్టుకెళ్ళిన సంగతి ఇండస్ట్రీలో గుప్పుమన్నాయి కానీ, ఆ ఎపిసోడ్‌కు సూత్రధారిని నేనేనని, వాళ్ళకెవరికీ తెలియదు. నవీన్‌కి గానీ, ఇంకెవ్వరికీ గానీ నాకూ ప్రొడ్యూసరుకూ మధ్య ఉన్న ఒప్పందం గురించి తెలియదు. డీసీపీ మేడం ఆజ్ఞ అది.

అందుకే, జలజ, నవీన్‌తో కలిసి టిఫిన్‌చేసి విడిపోయిన నేను, అదేరోజు సాయంత్రం ప్రొడ్యూసర్ నాతో సినిమా చేయడానికి ఒప్పుకున్నాడని చెప్పగానే, నవీన్ ఆశ్చర్యపోయాడు. కథ, బడ్జెట్ గురించి వివరించకుండానే ఓకే చెప్పడమేమిటని అనుమానపడేవాడు.

అందుకే, ఇప్పుడు కూడా అదే ప్రశ్న వేశాడు.

"అవునవును. అందుకే, ముందు ప్రొడ్యూసర్ గారితో మాట్లాడతాను" అని చెప్పాను.

రెండు రోజుల్లో ప్రకాశంతోపాటూ, మరో ఫ్రెండ్ నా ప్రాజెక్టు నుండి తప్పుకుంటామన్నారు. నేను సరేనన్నాను. నేను నవీన్ వైపు ప్రశ్నార్థకంగా చూశాను.

"నేను నీతోనేరా! మనం మంచి సినిమా తీస్తామని నాకు నమ్మకం ఉంది" అన్నాడు.

"థాంక్స్ రా! నువ్వైనా నన్ను నమ్మావు" అని చెప్పి కౌగలించుకున్నాను.

•••

నేను కొత్త సినిమా ఆఫీసు పెట్టాననే వార్త కృష్ణానగర్లో కార్చిచ్చులా వ్యాపించింది. నా మొదటి



రెండు సినిమాలు కమర్షియల్‌గా హిట్ కాకపోయేసరికి, నా పని అయిపోయిందనుకున్నారు, ఫిల్మ్‌సర్కిల్స్‌లో...

అయితే, ఇక్కడ ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు. నిన్న మొన్నటిదాకా కమెడియన్ వేషాలు వేసే ఆర్టిస్ట్, ఆల్ ఆఫ్ ఏ సడెన్‌గా, ఓ బడా ప్రొడ్యూసర్ అవతారం ఎత్తి, టాప్ హీరోలతో సినిమాలు తీసేస్తాడు. అంతకుముందు వేషాల కోసం తిరిగిన ఓ చోటామోటా నటి, తెల్లారే సరికల్లా సినిమా మొదలు పెడుతుంది. ఎప్పుడో పదేళ్ళ క్రితం హిట్ సినిమా తీసిన తర్వాత, అన్నీ ఫెయిల్యూర్స్ మూటగట్టుకున్న చితికిపోయిన నిర్మాత భారీబడ్జెట్ చిత్రానికి కొబ్బరికాయ కొడతాడు. కృష్ణానగర్లో క్రరీ పాయింట్లు నడిపినోళ్ళు, బ్యానర్లకు ఫ్రేములు చేసేవాళ్ళు, నెలకు మూడొందల సర్క్యులేషన్ ఉన్న పత్రికకు పెద్ద బిల్డప్ ఇచ్చి యాడ్స్ వసూలు చేసేవాళ్ళు ఇలా ఎందరో సినిమా నిర్మాతల అవతారం ఎత్తుతారు. ఈ ఫీల్డుకున్న మ్యాజిక్కే అది! సినిమా నిర్మాణం నిప్పు అని అందరికీ తెలుసు. కానీ, కావాలని అందులో శలభాల్లా దూకి మాడి మసైపోవడానికి, నిత్య ఉత్సుకులై వస్తూనే ఉంటారు.

ఇది అందరికీ తెలిసిన బహిరంగ రహస్యమే! సినిమా రంగం సకల పాపాలను కడుపులో దాచుకుంటుంది. కోట్లకోట్ల డబ్బు ఎక్కణ్నుంచి వస్తుందో, ఎలా నీళ్ళలా ఖర్చవుతుందో ఎవ్వరూ ఆలోచించరు.

ఆ డబ్బుకు ఎన్ని రక్తపు మరకలున్నాయో, ఆ డబ్బు వెనుక ఎన్ని అవినీతి కుంభకోణాలున్నాయో, ఎన్ని చీకటి ఒప్పందాలున్నాయో, ఎంతమంది మాఫియా లీడర్లు, రాజకీయనాయకులు, అవినీతి అధికారుల అక్రమ సంపాదన ఉందో అందరికీ తెలిసిందే! అయినా, అందరూ గప్‌చుప్. కళామతల్లి సేవలో తరించేందుకే వచ్చామని ప్రగల్భాలు పలుకుతుంటారు.

**సినీవాలి**

**కూపన్ నెం.2 విజేత**

**ఎ. హైమావతి**

**శాంతినగర్, తిరుపతి**

కాబట్టి, నేను మళ్ళీ ఆఫీసు పెట్టడం వార్తేకానీ అనూహ్యమైన విషయమేమీ కాదు. నేను సినిమా తీయకపోతేనే ఆశ్చర్యం కానీ తీస్తే గొప్పేమీ కాదు.

నేను ఓ కార్పొరేట్ స్టైల్లో ఆఫీసు పెట్టానని తెలియగానే, అంతకుముందు నన్ను ఎగతాళి చేసినవాళ్ళే, పోర్ట్‌పోలియోలు పట్టుకుని మా ఆఫీసుకు రాసాగారు.

జలజ కూడా ఓ సాయంత్రం పసుపుపచ్చ చీర కట్టుకుని వచ్చింది. పసుపురంగు అంత సెక్సీగా ఉంటుందని నేను కలలో కూడా ఊహించలేదు. బొడ్డు కింద చీర కట్టింది. నడుస్తున్నప్పుడు, ఆ చిన్న కదలికతో జాకెట్టుకు, చీరకు మధ్యనున్న చిలగడదుంప లాంటి పొట్టభాగం, మదనుడి కర్మాగారంలా కదులుతోంది. ఆ కర్మాగారపు స్విచ్‌బోర్డులా ఉన్న ఆ నాభీ కేంద్రంలో ఎంతమంది చూపులు, దారి పోడుగునా, సుడిగుండంలో పడ్డ చేపల్లా గిలగిల కొట్టుకుపోయాయో? పొట్టి జాకెట్ చేతులు బాహుమూలాలను స్పష్టంగా చూపిస్తున్నాయి. వేసుకున్న జాకెట్ కేవలం పొంగి పొర్లుతున్న వక్ష సంపదకు అడ్డుకట్ట వేయడానికి మాత్రమే పనికొస్తూ ఎద పొంగులను అవసరార్థం బయట పెట్టాలనే ఉద్దేశంతోనే కుట్టబడినట్టుంది. జలజకు తన శరీరాన్ని ఏ సమయంలో ఎలా ఉపయోగించాలో బాగా తెలుసు. ఆమె ఒళ్ళే ఆమె పెట్టుబడి. ఓ గొప్ప వ్యాపారవేత్త తన పెట్టుబడిని ఎంత జ్యుడీషియస్‌గా ఇన్వెస్ట్ చేస్తాడో, అలాగే జలజ కూడా అవసరమున్నప్పుడే తన శరీరాన్ని మన్మథుడి మర్మబాణంలా సంధిస్తుంది.

ఆ దాడి తట్టుకోవడానికి మగవాడి దగ్గర ఏ కవచమూ లేదు. అసలు, శరీరంలోని అణువణువూ ఆ దాడికి లొంగిపోయి, దాసోహమనాలని తహతహలాడుతుంటే, ఇంక రక్షణ ఎక్కడ?

ఇప్పుడు కూడా జలజ ఎందుకొచ్చిందో నాకు తెలుసు. నా సినిమాలో తనకు ఛాన్స్ కావాలి. నేను ఇవ్వక తప్పని పరిస్థితి అని కూడా నాకు తెలుసు.

అయితే, నేను తీయబోతున్న సినిమా మామూలు సినిమా కాదు. కాస్టింగ్ విషయంలో ఏ మాత్రం కాంప్రమైజ్ కాదలుచుకోలేదు. ఒకవేళ స్టోరీ డెవలప్ అయిన తరువాత జలజకు తగ్గ క్యారెక్టర్ ఉంటే నేనే, రైట్ రాయల్‌గా పిలిచి ఇచ్చేవాణ్ణి. కానీ సినీఫీల్డులో 'ఎర్లీ బర్డ్ క్యాచెస్ ది వార్మ్' అనే నానుడి బాగా పనిచేస్తుంది. అవసరమున్నా లేకపోయినా వచ్చి కలుస్తుంటారు. తమని గుర్తు పెట్టుకోమని పోరుతుంటారు.

కానీ, జలజ అలా ఎప్పటికీ చేయదనుకున్నాను. కానీ, వచ్చేసింది.

సీసీటీవిలో చూస్తూనే ఉన్నాను. జలజ వచ్చి అరగంటైనా, నన్ను కలిసే ప్రయత్నం చేయక

---

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

**సినీవాలి -4 (9-11-2016)**

మా ప్రశ్న: **జలజకి డైరెక్టర్ పెట్టిన పేరేమిటి?**

మీ జవాబు------------------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------------------

---------------------------------------------------------------------------------

------------------------------------------పిన్------------------------ఫోన్‌నెం-------------------------

**ఈ కూపన్‌ను 8 నవంబర్ 2016 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా:నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

పోయేసరికి నాకు డౌట్ వచ్చింది.

స్నాక్స్ తిని, టీ తాగింది. కనీసం నవీన్ కూడా తనొచ్చిందని నాకు చెప్పడం లేదు.

నాలో కూడా క్యూరియాసిటీ పెరిగింది.

సాయం సంధ్య వీడ్కోలు తీసుకుంటూ చీకటి కాంతకు ఆహ్వానం పలికింది.

ఆఫీసు స్టాఫ్ అంతా ఏదో రహస్య సందేశం అందు కున్నట్టుగా, నా రూములోకి వచ్చి, ఏదో పనుందని చెప్పి, ఒక్కొక్కరుగా మెల్లిగా జారుకుంటున్నారు.

నవీన్ ఏదో పని చేస్తున్నట్టు నటిస్తున్నాడు. కానీ, అతని చూపు సీసీ కెమేరా మీదనే ఉంది. దాని ద్వారా నాకేదో మెసేజ్ పంపిస్తున్నట్టుగా అనిపించింది.

నేను 'ఏమిటన్నట్టుగా' కంటితో సైగ చేశాను.

నర్మగర్భంగా నవ్వాడు.

ఆఫీసు ఖాళీ అయింది. ముందు రూములో, సంధించిన విల్లులో నుంచి రిలీజు చేయడానికి సిద్ధంగా ఉన్న బాణంలా ఉంది జలజ. ఆమె పక్కనే నవీన్, నా రూములో నేను మాత్రమే మిగిలాం.

నవీన్ లేచి నా రూంలోకి రాబోతుండడం కెమే




రాలో గమనించాను.

"చూశావా?" అన్నాడు నా రూములోకి రాగానే.

"ఊ.."

"వెళ్దామా?"

"ఎక్కడికి?"

నవీన్ ఆశ్చర్యంగా చూసి "అదేంటి, నీ ఫ్లాట్‌కి" అన్నాడు.

ప్రొడ్యూసర్ నా కోసం ఒక త్రీ బెడ్‌రూమ్ ఫ్లాట్ దగ్గరలోనే, రెంటుకు తీసుకున్నాడు.

"ఊహు.. నాకు పనుంది. మీరెళ్ళండి" అని ఫ్లాట్ కీ ఇచ్చాను.

"జలజ నీ కోసమే వెయిట్ చేస్తోంది! పార్టీ కావా లంటోంది?"

"నాకు ఇంట్రెస్టు...." అని అంటుండగానే జలజ లోపలికొచ్చింది.

సుగంధాల పిల్ల తెమ్మెరను వెంటబెట్టుకుని వచ్చి నట్టుగా, రూమంతా పరిమళాలతో నిండిపోయింది.

జలజలో ఉన్న గొప్పతనమే అది. తనకు ఎంతో మందితో శారీరక సంబంధాలున్నా, ఎప్పుడూ ఫ్రెష్‌గా, ఒక పూలసజ్జలా, నవనవోన్మేష సుమ సుగంధాలు వెదజల్లుతూ వస్తుంది. మన కోసమే తను తపిస్తున్నానన్న భావన మనలో కలిగిస్తుంది.

నేను, అంతకుముందు తీసుకున్న నిర్ణయం ఏ గాల్లో కలిసి పోయిందో, తను కనపడగానే...

"హాయ్ జల్లూ!" అన్నాను.

మూడు నెలల క్రితం, నన్ను, నవీన్ రూంలో మురిపాల జల్లులో ముంచెత్తిన రోజున నేను తనకు ఆ పేరు పెట్టుకున్నాను. ఆ తెల్లవారుజామున మా శృంగారకేళి సమయంలో నేను తనను 'జల్లూ' అనే పిలిచేసరికి జలజ పడీపడీ నవ్వింది.

"అబ్బ! జల్లు... గుండె జల్లుమంది పో" అంటూ సరాసరి నా కుర్చీ దగ్గరకొచ్చి, నా ఒళ్ళో కూర్చుంది.

జలజ తప్ప ఆ సాహసం వేరెవరూ చేయలేరు.

ఎన్నో హిట్లు కొట్టిన డైరెక్టర్లు, వందల కోట్లు పెట్టి సినిమాలు తీసే ప్రొడ్యూసర్లను కూడా జలజ కాలిగోటితో సమానమన్నట్టుగా చూస్తుంది. వాళ్ళ మాటను తీసి పారేస్తుంది. అట్లాంటిది, నా దగ్గరకొచ్చి నా ఒళ్ళో కూర్చోవడం, సినిమా ఛాన్స్ కోసమైతే కాదు. దానికోసం ఆమె నాకు మస్కా కొట్టాల్సిన పనిలేదు.

నా కుర్చీ అసలే చాలా పెద్దది. దాంతో తను నా మీద కూర్చున్నా పెద్దగా ఇబ్బందేం లేదు. ఇప్పుడు తన ముఖం, నా ముఖానికి ఎదురుగా ఉంది. ఇద్దరి మధ్య ఎక్కువ ఖాళీ లేదు. ఆమె ఒంటినుంచి వస్తున్న ఘాటైన వాసనతో పాటు మంచి పరి మళంతో నా నరాలు జివ్వున లాగాయి. గుండె వేగంగా కొట్టుకోవడం మొదలయింది. తియ్యని బాధతో శరీరం ఊగిసలాడుతోంది.

నవీన్ ఎప్పుడు రూంలో నుంచి జారుకున్నాడో, నేను గమనించనే లేదు.

వెయ్యి ఓల్టుల విద్యుత్ కండక్టర్‌గా నా శరీరం మారి పోయి, కొత్త కొత్త ప్రదేశాల్లోకి రయ్యిమని రక్తం ప్రవ హించసాగింది.

దాదాపు మూడు నెలలుగా అంటే, ఆ రోజు నవీన్ రూంలో జలజతో గడిపిన దగ్గర నుండి, ఆడ సుఖం ఎరుగను. నేను ఇట్లాంటి విషయాల్లో కొంచెం మొహమాటస్థుణ్ణి. చాలామంది సిగ్నల్స్ పంపు తూనే ఉంటారు. కానీ, నేనే వాటిని క్యాచ్‌చేసి క్యాష్ చేసు కోలేను. అట్లాగని కోరికలు లేవని కాదు. కానీ, నా మనసును సినిమా మేకింగ్‌కే కేటాయించాను. డైవర్షన్ వద్దనుకున్నాను.

కానీ, జలజ ముందు నా నిర్ణయాలు ఏమీ పని చేయవు. ఆ మోహావేశంలో కొట్టుకుపోవాల్సిందే!

అందుకే క్షుద్బాధకు లోనయిన వాడికి విందు భోజనం వడ్డించేందుకు వచ్చినట్టుగా జలజ వచ్చింది. నా పరిస్థితి బిచ్చగాడి ముందు పంచభక్ష్య పరమాన్నాలు వడ్డించిన విస్తరిలా, ఉంది. ఏది ముందు తినాలో - ముందుగా మిఠాయి తినాలో, మిల్క్‌షేక్ తాగాలో, కండపట్టిన చికెన్ తొడను కొరకాలో తెలి యడం లేదు.

నా చేతులు, అసంకల్పిత ప్రతీకార చర్యలాగా, ఆమె శరీరాన్ని ఎక్కడెక్కడో తాకుతున్నాయి. నా స్పర్శతో, ఆమె ఒంటిమీద ఉన్న సుఖస్పాట్స్ ఎలా విచ్చుకుంటాయో నాకు తెలుసు. ఆ స్పాట్స్ గురించి తనే నాకు నేర్పింది. నా ఆత్రానికి తను కిలకిలా నవ్వింది. నేను మరింత రెచ్చిపోయాను.

అంధుడు తన ముందున్న వస్తువును ఆత్రంగా తడిమి అవేమిటో తెలుసుకోవాలని చేసే ప్రయత్నం లాగా, నేను ఆమె శరీరంలోని అణువణువునూ స్పృశించాలనీ, వాటిల్లోని జీవరసాన్ని పీల్చే యాలనీ, ఆమె శరీరాన్ని పూరీపిండిలా పిసికేయా లన్నంత ఆవేశంలో ఉన్నాను.

ఆ మోహావేశం మామూలుది కాదు. జలజతో పొందు 'ఇలా ఉంటుందని' చెప్పలేని ఒక మధురానుభూతి.

అదో సౌఖ్యం.

అదో లోకం.

జలజలోని గొప్పతనమే అది. ఏదో మొక్కుబడిగా కాకుండా, అవతలి పార్టనర్‌తో సమానంగా తను కూడా ఆ సుఖాన్ని అనుభవిస్తుంది.

ఆ రసరమ్య లోక ప్రవేశానికి మేమిద్దరమూ సన్నద్ధమవుతోంటే, జలజ ఫోన్ మోగింది.

నా మీద అలా కూర్చునే, ఫోన్ అందుకుంది. ఫోన్ స్క్రీన్ మీద ఉన్న నంబరు చూడగానే, ఆమె ముఖం వివర్ణమయింది. తుపాకీ గుండు తగిలిన లేడిపిల్లలా గిలగిలలాడింది. ఒంట్లోని రక్తాన్నంతా ఎవరో తోడేసినట్టుగా ముఖం పాలిపోయింది. ఆమె, అధరాలు వణకసాగాయి. కళ్ళల్లో భయం కొట్టొచ్చినట్టుగా కనపడింది నాకు.

నా మీద నుంచి లేచి, హడావుడిగా, తొట్రు పడుతూ రూం బయటకు నడిచింది.

నేను విస్తుపోయాను.

జలజని అంతగా భయపెట్టిన ఆ ఫోన్ ఎక్కడి నుంచి వచ్చింది? ఎవరు చేశారు? నాకేమీ అర్థం కాలేదు.

జలజ అలా చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయిన రెండు నిమిషాల్లో మెయిన్‌డోర్ తీస్తున్న శబ్దం విన పడింది. బట్టలు సర్దుకుని, నేను కూడా పరుగు పరుగున బయటకొచ్చాను.

నవీన్ కూడా ఆశ్చర్యంగా చూడసాగాడు.

"ఏమైంది?"

"ఏమోరా, ఏడుస్తూ వెళ్ళింది" అన్నాడు కంగారుగా.

"నువ్వేమైనా..." అని అడిగాడు అనుమానంగా.

"ఛ! నేనేమంటాను... ఏదో ఫోనొచ్చింది. వెంటనే ఇలా.. కమాన్! ఆమె వెనకే వెళ్ళు... ఆమెకు ఏం హెల్ప్ కావాలన్నా చేద్దాం. డోంట్ వర్రీ అబౌట్ మనీ!" అంటూ నవీన్‌ను తరిమాను.

నవీన్ తన ఫోనందుకుని బయటికి పరిగెత్తాడు.

"ఏ సంగతీ ఫోన్ చెయ్యి" అని అరిచి చెప్పాను.

స్వర్గలోకంలో ద్వారం దగ్గర దాకా వెళ్ళి అక్క ణ్ణుంచి దభిల్లుమని పాతాళంలోకి పడ్డట్టయింది నా పరిస్థితి.

**(ఇంకా వుంది)**




# కీళ్ళ నొప్పులకు ఆవాల వైద్యం



చిన్నా పెద్దా అన్న తేడా లేకుండా అందరినీ బాధించే సమస్యల్లో కీళ్ళనొప్పులదే అగ్రస్థానం. వయస్సురీత్యా వచ్చే కీళ్ళనొప్పులు కావచ్చు. ఊబకాయం కారణంగా బాధించే కీళ్ళనొప్పులు కావచ్చు. ఈ నొప్పులకు మందులు వాడి మరి కొన్ని తలనొప్పులు తెచ్చుకోవడం కన్నా ఇంట్లో లభించే వస్తువులతోనే ఉపశమనం పొందవచ్చు అంటున్నారు నిపుణులు. ప్రతిరోజూ వంటలలో ఉపయోగించే ఆవాలు కీళ్ళ నొప్పులకు బాగా పనిచేస్తాయంటున్నారు. ఒక స్పూను తాజా ఆవపిండి ముద్దలో స్పూను తేనె, ఒక స్పూను ఉప్పు, ఒక స్పూను సోడియం బి కార్బొనైట్‌ను తీసుకుని ఈ మూడింటిని ముద్దలాగా కలుపుకోవాలి. ఈ మిశ్రమాన్ని నొప్పులు ఉన్న ప్రాంతంలో రోజుకి రెండుసార్లు అప్లయ్ చేసుకోవచ్చు. అయితే వెంటనే మార్పు కనపడకపోయినా, క్రమేపీ కీళ్ళనొప్పులు తగ్గుతాయని నిపుణులు చెబుతున్నారు.

# తోట పనితో జీవితకాలం పెంపు

స్త్రీలు చేసే ఇంటి పనిలోనే వారి ఆరోగ్య రహస్యం దాగి ఉందనీ, ఆ పనుల వలనే వారి జీవితకాలం పెరుగుతుందన్న విషయం గతంలో నిర్వహించిన పలు అధ్యయనాల్లో వెల్లడైంది. కాకపోతే పురుషులకు ఆ సౌలభ్యం లేదు. ఎందుకంటే చాలా మంది పురుషులు ఇంటి పని చేయడాన్ని చిన్నతనంగా భావిస్తారు. అందుకే వారి జీవితకాలం తగ్గుతోందని గతంలో పరిశోధకులు స్పష్టం చేశారు. అయితే పురుషులు తోటపని చేయడం ద్వారా తమ జీవితకాలాన్ని సుమారు మూడు సంవత్సరాలు పెంచుకోవచ్చన్న విషయం ఇటీవల నిర్వహించిన ఓ అధ్యయనంలో వెల్లడైంది. డచ్ యూనివర్సిటీ వారు సుమారు ఏడు వేల మంది స్త్రీ పురుషుల మీద సుదీర్ఘకాలంపాటు అధ్యయనం నిర్వహించిన అనంతరం ఈ విషయాన్ని వెల్లడించారు. పురుషులు ప్రతిరోజూ ఓ అర గంట తోటపని చేయాలని వారు సూచిస్తున్నారు.



# స్నేహితులతో మానసికానందం

ఎక్కువ మంది స్నేహితులను కలిగిన వారు మానసికంగా ఆరోగ్యంగా, దృఢంగా ఉంటారన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. అంతేకాకుండా వారి జీవితకాలం పెరిగే అవకాశాలు కూడా ఉన్నాయని వారు అంటున్నారు. సుమారు ఆరువేలమంది మీద పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండుగ్రూపులుగా విభజించారు. ఒక గ్రూపువారికి ఎక్కువ మంది స్నేహితులు ఉండగా, మరొక గ్రూపు వారికి స్నేహితులు లేకుండా చూశారు. కొన్ని నెలల అనంతరం వారిని పరిశీలించగా, స్నేహితులు ఉన్నవారు మానసికంగా శారీరకంగా ఆరోగ్యంగా ఉండగా, స్నేహితులు లేని వారు రకరకాల ఆరోగ్య సమస్యలతో బాధపడుతున్న విషయాన్ని వీరు గుర్తించారు. అయితే స్నేహితులు లేకపోవడం వలనే వీరికి అనారోగ్య సమస్యలు తలెత్తాయా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద వీరు పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

# ఫేస్‌బుక్, ట్విటర్ మంచివే!

ఫేస్‌బుక్, ట్విటర్ మంచివి కావు అన్న పరిశోధకులే ఇప్పుడు మంచివి అంటున్నారు. అయితే వీటిని టీనేజర్లు ఉపయోగిస్తున్నప్పుడు కొన్ని రకాల సమస్యలు తలెత్తే అవకాశాలు ఎక్కువట. అదే వృద్ధులు వీటిని ఉపయోగించడం వలన వారిలోని ఒంటరితనం, డిప్రెషన్, రక్తపోటు వంటి సమస్యల నుంచి తప్పించుకోవచ్చని వీరి పరిశోధనల్లో వెల్లడైంది. సుమారు 600 మంది వృద్ధులను వీరు పరిశీలించారు. వీరి చేత సుమారు ఆరు నెలల పాటు ఫేస్‌బుక్, ట్విటర్, ఆన్‌లైన్ చాటింగ్ వంటివి చేయించారు. అనంతరం వీరి ఆరోగ్యాన్ని పరిశీలించారు. వీటిని ఉపయోగించిన వృద్ధులు మునుపటి కన్నా ఉత్సాహంగా, ఆరోగ్యంగా ఉండడాన్ని వీరు గమనించారు. పై మూడు సామాజిక మాధ్యమాలు టీనేజర్ల కన్నా పెద్దవారికే ఎక్కువ ఉపయోగకరంగా ఉంటాయన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది.

-అవినాష్






పుస్తకావిష్కరణ సభ

# జీవన వైవిధ్యం చాటే మురళీధర్ రచనలు

## నెమలినార:నిరుడు కురిసిన కల ఆవిష్కరణ సభ

**సాహిత్యం ఎప్పుడూ జీవన హితైషి. వెన్నంటి నిలిచి ఋజుమార్గ దర్శనంచేసే దీపధారి. అక్షరం ఎప్పుడూ వెన్నునిమిరి, నిప్పులమార్గమైనా నేర్పుతో నడిచేశక్తిని ప్రసాదిస్తుంది. జీవన శకలాలుగా పలకరించే కథ, కవిత్వం, నవలాప్రక్రియలు జీవితాన్ని రసప్లావితం చేస్తాయి. తట్టి లేపే సాహిత్యం జీవితపొరలను చీల్చుకుంటూ వచ్చినప్పుడు అది మనసుల్ని కరిగిస్తుంది, మలినాలను కడిగేస్తుంది. అడవులజిల్లా ఆదిలాబాద్‌ను తన కథాకుసుమాలతో ప్రకాశింపజేస్తున్న రచయిత బి.మురళీధర్ 'నెమలినార' కథల పుస్తకం, పాఠకులను వలవేసి పట్టుకున్న నవల 'నిరుడుకురిసిన కల' అక్టోబరు 23వ తేదీ ఆదివారంనాడు ఆదిలాబాద్ పట్టణంలో ఆవిష్కృతమయ్యాయి.**

రచయితలు, అభిమానులు, స్నేహితుల కేరింతలు, తుళ్ళింతల సాక్షిగా పట్టణ జిల్లాపరిషత్ హాలులో జీవితం ఓ అక్షరసత్యమై నిలిచింది. ఎందరో రచయితలు, రచయిత్రులు ఈ వేడుకకు సాక్షీభూతంగా నిలిచారు. ప్రముఖ రచయిత, నవ్య వారపత్రిక సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథ శర్మ, ప్రముఖ కథకులు అల్లం రాజయ్య, కథాసాహితీ సంపాదకులు వాసిరెడ్డి నవీన్ వంటివారెందరో ఈ సభకు విచ్చేశారు. స్థానిక రచయిత వసంత రావు దేశ్‌పాండే అధ్యక్షత వహించారు. 'నిరుడుకురిసిన కల' నవలా నాయకుడు లక్ష్మణ్ మాస్టారు హాజరుకావడం, ఆయనను ఘనంగా సత్కరించడం ఈ సభలో ఒక ప్రత్యేక విశేషం.



### నెమలినార ఆవిష్కరణ

కథాసాహితి సంపాదకులు వాసిరెడ్డి నవీన్ 'నెమలినార' కథల పుస్తకాన్ని ఆవిష్కరించారు. రాసిన 18 కథల్లో పదకొండు కథలకు బహుమతులు గెలుచుకున్న ప్రతిభ మురళీధర్‌ది. ఆదిలాబాద్ జీవన వైవిధ్యాన్నీ, వైరుధ్యాన్నీ పుణికిపుచ్చుకుంటాయి ఈ కథలు. స్వప్నలోక సంచారం చేయని కథలివన్నీ. వాస్తవ దృశ్యాల వర్ణాలను కలం కుంచెతో రచయిత జీవితపు కాన్వాసుపై చిత్రించినవే!

### జీవితం లోతుల్ని చూపే కథలు

మురళీధర్ కథలన్నీ ఆషామాషీ కథలు కావనీ, లోతైన పరిశీలన చేయదగ్గవేననీ అన్నారు వాసిరెడ్డి నవీన్. జీవితపు లోతులు తెలిసినవాడు గనుక, గిరిజన సంస్కృతిపై అవగాహన ఉన్నవాడు గనుక ఈ కథలలో జీవితాన్ని పొరలు పొరలుగా ఒలుస్తూ, మనకు చూపుతాడన్నారు. ముప్ఫైయేళ్ళ సాహిత్య జీవితంలో పద్దెనిమిది కథలే రాసిన మురళీధర్ మరిన్ని కథలు రాయాలని వాసిరెడ్డి నవీన్ ఆకాంక్షించారు.

### సాహిత్యం ఎప్పుడూ ఉత్ప్రేరకమే

బతుకులోని అనేకానేక సంఘటనల సమాహారమే 'నెమలినార' కథలు అన్నారు సభకు విశిష్ట అతిథిగా హాజరైన ఎ.ఎన్.జగన్నాథశర్మ. సాహిత్యం ఎప్పుడూ ఉత్ప్రేరకమై నిలుస్తుందేతప్ప, క్షేత్రస్థాయిలో నిలబడి పోరాడదు. పత్రికలు వ్యాపారాత్మకమైనా ఇప్పుడు వస్తున్న చాలా మంచికథలకు అవి వేదిక లనీ, ఆ మంచినే స్వీకరించాలనీ అన్నారు.




**నెమలినార**
**బి.మురళీధర్ కథలు**
ధర: 150 రూపాయలు
పేజీలు: 220




**నిరుడు కురిసిన కల**
**బి.మురళీధర్ నవల**
ధర: 150 రూపాయలు, **పేజీలు:** 152
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన, నవోదయ, ప్రజాశక్తి బుక్‌హౌస్‌లు, విశ్వేశ్వర బుక్‌సెల్లర్స్, అశోక్‌రోడ్, ఆదిలాబాద్

## మరువలేని రచయితల పాత్ర

తెలంగాణ ఉద్యమంతో మమేకమై ఉద్యోగానికి రాజీనామా చేసి కదనరంగంలోకి దూకినవారు బోథ్ శాసనసభ్యులు బాపూరావ్ రాథోడ్. రచన అనేది నేర్చుకుంటే వచ్చేదికాదనీ, కథలూ, కవితలూ, నవలా ప్రక్రియలన్నీ పుట్టుకతోనే సంక్రమిస్తాయనీ వినమ్రంగా చెప్పారాయన.

ఆదిలాబాద్ జిల్లాను వెనుకబడిన జిల్లా అనేవారనీ, ఇక్కడ ప్రజలు ధనవంతులు కాకపోయినా, మేధావులకు ఇక్కడ కొదవలేదనీ అన్నారు. గిరిజన ప్రాంత ప్రజల ఆచారవ్యవహారాలు, సంస్కృతీ సంప్రదాయాలను అందరూ గుర్తించాలని కోరారు. తెలంగాణ ఉద్యమంలో రచయితలు తమ కలాలకు పదునుపెట్టి ఉద్యమాలకు పదునుపెట్టారని, ఉద్యమంలో వారి పాత్ర మరువలేనిదని ప్రశంసించారు.

## కాలానికి నిలిచే కథలు

రచయిత, ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం కార్యనిర్వహణాధికారి సి.ఎస్.రాంబాబు 'నెమలినార' కథలను సమీక్షించారు. కథా వస్తువు ఎంత సుందరంగా ఉంటుందో అంతే నైపుణ్యంతో కథ నౌక శిల్పంలా చెక్కటం అందరివల్లా కాదు. ఆ నైపుణ్యాన్ని సొంతంచేసుకున్న మురళీధర్ మాత్రం ఈ కథలన్నింటినీ చక్కటి శిల్పాల్లా మలిచారని ప్రశంసించారు. ఆయన విశ్లేషణ ఇలా సాగింది.

గురుశిష్య సంబంధాన్ని ఆవిష్కరించిన 'అడవిపువ్వు' కథ మనల్ని వెంటాడుతుంది. కథంతా పరుచుకున్న జీవితపు అమాయకత్వం ఊపిరితీసుకోనివ్వదు. విస్తృతంగా సాహిత్యవర్గాల్లో చర్చించబడిన కథ 'కొత్త నిర్వచనం. పెక్కు అవార్డులు గెలుచుకున్న 'నెమలినార' కథలో కాలంతో వస్తున్న మార్పులు, తరాల మధ్య అంతరాల్ని పెంచుతూ ప్రాచీన విజ్ఞానాన్ని అందకుండా చేస్తున్నాయన్న ఆవేదన రచయిత వ్యక్తం చేశారన్నారు. మరో కథ 'దశ్మి'లో గ్రామీణ జీవితంలో మొహర్రం పండుగ అల్లుకున్న వైనాన్ని చెబుతూ ఆధునిక ప్రవాహంలో నెగ్గుకురావాలంటే, ఈత అనే చదువు తోడుండాలి అని చెప్పారన్నారు. ప్రతికథకూ ఒక నేపథ్యాన్ని పరిచయం చేయడం ఈ కథలకు మరింత బలాన్ని ఇచ్చింది. ఎప్పుడు చదువుకున్నా జీవామృతంతో తొణికిసలాడే ఈ కథలన్నీ కాలానికి నిలబడే కథలే అన్నారు సి.ఎస్. రాంబాబు.

## జీవించటం నేర్పే కథలు

ప్రముఖ రచయిత్రి కన్నెగంటి అనసూయ నెమలినార కథల్ని సమీక్షిస్తూ, జీవించడం ఎలాగో తెలిసిన వ్యక్తి రాసిన కథలివన్నీ అన్నారు. వస్తువు, శిల్పంలాంటి ప్రమాణాల్ని తూకంవేసి చెప్పారన్నారు. తమను తాము ప్రేమించుకునే వ్యక్తులు జీవితంపట్ల తపన, ఉత్సాహం, సౌందర్యారాధన కలిగి ఉంటారనీ, కుటుంబాన్ని ప్రేమిస్తూ, సమాజంపట్ల అచంచల విశ్వాసం కలిగిఉంటారనీ, అలాంటివారే మంచి రచయితలు అవుతారనీ అన్నారు.

## నిరుడుకురిసిన కల ఆవిష్కరణ

భోజనవిరామానంతర సమావేశంలో, ప్రముఖ రచయిత అల్లం రాజయ్య 'నిరుడుకురిసిన కల' నవలను ఆవిష్కరించారు. 'నిరుడుకురిసిన కల' నవలను తెలంగాణ సంస్కృతికి ఒక సాధికారపత్రంగా అభివర్ణించారు సభకు అధ్యక్షత వహించిన కవి, తెలంగాణ రచయితల వేదిక జిల్లా అధ్యక్షులు డాక్టర్ దామెర రాములు.

## అహింసాయుత పరిష్కారం చెప్పే నవల

'నిరుడుకురిసిన కల' నవలలోని పాత్రలన్నీ మంచితనాన్ని నింపుకున్నవేననీ, అందుకే ఈ



నవల గాంధీజీ సిద్ధాంతాన్ని అనుసరించి అహింసాయుత పరిష్కారాలను చూపుతుందన్నారు అల్లం రాజయ్య. రచయిత మురళీధర్ కథ రాసినా, నవల రాసినా సమాజాన్ని గమనిస్తున్నతీరు ఆశ్చర్యపరుస్తుందన్నారు. ఈ నవలకు ప్రేరణగా నిలిచిన లక్ష్మణ్ మాస్టారిని ఆదిలాబాద్ పుర ప్రముఖులు ఎస్.రాజారాం ఆధ్వర్యంలో సభ సన్మానించుకుంది.




ఆదిలాబాద్:హైదరాబాద్ రచయితలు, ఆత్మీయులు

## సామాజిక బాధ్యత గుర్తుచేసే నవల

ఉపాధ్యాయుడికి సామాజిక బాధ్యతలున్నాయని గుర్తుచేసిన రోజులు ఈ నవలలో మనకు సాక్షాత్కరిస్తాయన్నారు రచయిత్రి సమ్మెట ఉమాదేవి. దొరల పీడన, జమిందారులు పెట్టిన బాధలు, పేదరికం, వర్ణవివక్ష...ఇలా ఎన్నో అంశాలను రచయిత ఆ నవలలో స్పృశించారన్నారు. ఆదిలాబాద్‌జిల్లాలో గొప్ప ఇంటలెక్చువల్ వాతావరణం లేకపోయినా ఈ నవల ఆకర్షణగా ఉండటానికి కారణం ఇక్కడి సంస్కృతీ సంప్రదాయాలే అన్నారు రచయిత సుమనస్పతి.

## సాహిత్యానికి ఉత్తేజమిచ్చే ప్రాంతం

ఆదిలాబాద్‌జిల్లా ప్రాంతం సాహిత్యానికి ఉత్తేజాన్ని ఇస్తుందని అన్నారు కళాశ్రమ గురూజీగా సుపరిచితులైన రవీంద్రగురూజీ. వయసు పెరిగిన కొద్దీ సాహిత్యపరంగా ఇక్కడివారు నవయువకులైపోతారనీ, అటువంటి నవయువకుడే రచయిత మురళీధర్ అని ప్రశంసించారు.

దుష్టుడైన మనిషిలోనూ మంచితనం ఉంటుందని ఈ నవల నిరూపిస్తుందని రచయిత కస్తూరి మురళీకృష్ణ అన్నారు.

## జిల్లాల సాహిత్య చరిత్ర రికార్డవ్వాలి

నవ విమర్శకులు కె.పి.అశోక్‌కుమార్ 'నిరుడుకురిసిన కల' నవలను సమీక్షించారు. సమాజ చరిత్రకు సాంస్కృతిక అంశాల్ని జోడించినప్పుడు నవల ఓ కొత్తదనం సంతరించుకుంటుందని, అలాంటి ఒక సామాజిక సాంస్కృతిక చరిత్రే ఈ నవల అన్నారాయన.

కనపడని తాత్వికుడు మురళీధర్ అని ప్రశంసించారు మునిమడుగుల రాజారావు. మురళీధర్ మరిన్ని కథలు రాయాలని ఆకాంక్షించారు స్థానిక రచయిత గోపగాని రవీందర్.

స్థానిక రచయితలు అనూరాధ, చోడవరపు శ్రీధర్ తదితరులు పాల్గొని సభకు నిండుదనం తెచ్చారు.

## ఇదో సాహితీ ఉత్సవం

ప్రశంసలు, విశ్లేషణలు, అభినందన వాక్యాలు, శాలువాలింగనలు జల్లై తడిపేస్తుంటే గద్గదస్వరంతో పేరు పేరునా అతిథులకు, ఆత్మీయులకు కృతజ్ఞతలు తెలియజేశారు పుస్తక రచయిత మురళీధర్. ఇలాంటి



సమావేశాలు అరుదుగా మాత్రమే ఆదిలాబాద్ లాంటి చోట్ల జరుగుతాయన్నారు. ఈ ఆవిష్కరణ సభను, అరుదైన ఓ సాహితీ ఉత్సవంగా అభివర్ణించారాయన.

ఒక రోజంతా సాహిత్య జీవితాన్ని తరచి తరచి చూడటం ఓ అందమైన అనుభవం. ఎన్నో జీవితాలను, మరెన్నో పాత్రలను జీవితపు ఎత్తు పల్లాలను బేరీజువేసుకునే అరుదైన సందర్భాన్ని కల్పించిన ఆదిలాబాద్ పట్టణాన్ని స్మరించుకున్నారు సాహితీమిత్రులందరూ!

**-సి.ఎస్.రాంబాబు, సెల్: 9490401005**

# ఫ్యామిలీ ఫొటో

## -ఎం.సుగుణరావు

**అలారం ఐదు కొట్టింది. దిగ్గునలేచాడు వెంకట్రామయ్య. ఇంకాసేపు పడుకుంటేనో!? అనుకున్నాడు. 'అబ్బే ఆ నిద్ర ఏడుగంటలవరకూ సాగుతుంది, ఈలోగా పాలపాకెట్లు అయిపోతాయి'.**

**గబగబాలేచి బట్టలు మార్చుకున్నాడు. గదిలోంచి బైటకొచ్చాడు. పక్కగది తలుపులు తెరిచే ఉన్నాయి. కొడుకు కోడలు నిద్రపోతున్నారు. పక్కనే మనవడు ఐదేళ్ళవాడు లేచి దొర్లుతున్నాడు. పిల్లిలా అడుగులేస్తూ బైటకు నడిచాడు. వాడుగనకచూస్తే వదలడు, తనూ వస్తానని గొడవ చేస్తాడు.**

తాళంవేసి రోడ్డుమీదకు నడిచాడు.

బైట చల్లగా ఉంది. మంచుతో తడిసిన నేల కూడా చల్లగానే తగులుతోంది. ఆకాశంలో ఇంకా పలచగా మిణుకుమిణుకుమంటున్న నక్షత్రాలు. రోజూ ఉదయం అలా నడవడం ఎంతో బావుంటుంది వెంకట్రామయ్యకు. అందుకే పాలపాకెట్లు తెచ్చేవాణ్ణి మానిపించి తనే తెస్తున్నాడు. మెడలో మఫ్లర్ నెత్తిపైకి లాక్కుని మెల్లగా పాలబూత్‌కు చేరుకున్నాడు. పక్కనే వాకర్స్ పార్క్. అప్పటికే చాలామంది పార్కులో నడక మొదలెట్టారు. పాలపాకెట్లు తీసుకుని సంచీలో వేసుకుని పార్కులోకి నడిచాడు.

రెండురౌండ్లు కొట్టాడు. ఇంతలో 'ఏమోయ్ వెంకట్రామయ్యా' అనే కేక వినిపించి తల తిప్పాడు. ఎదురుగా బాల్యమిత్రుడు నారాయణ.

ఇద్దరూ రిటైరై పదేళ్ళైంది.

"ఏం నారాయణ బావున్నావా?!" అన్నాడు.

"ఏం బావుండడంలెద్దూ, మనిద్దరివీ ఒకే రకమైన జాతకాలుకదా" అన్నాడు.

"అంటే?!" అర్థం కానట్టు చూశాడు వెంకట్రామయ్య.

'నీ భార్య, నా భార్య ఇద్దరూ మనకు గుడ్‌బై చెప్పేశారు. అలాగే నీకు నాకు ఒక్కడేకొడుకు. కొడుకులతో పాటూ మనకోడళ్ళూ ఉద్యోగస్థులే. ఇక మనవణ్ణి చూసుకుంటూ నువ్వు ఇంటికి కుక్కలా కాపలా కాస్తావ్, అందరూ వెళ్ళిపోయిన తర్వాత మరి నేనూ అంతే" అన్నాడు నారాయణ.

"ఛ...ఛ... ఏంటీ కుక్కలాగా అంటావ్, ఇంకా ఏ పోలికలూ దొరకలేదా?!" చిన్నబుచ్చుకుంటూ అన్నాడు వెంకట్రామయ్య.

"ఈ వృద్ధాప్యంలో మనది కుక్కబతుకే. నీకు తెలీదా!? ఈ విషయం" అన్నాడు నారాయణ.

అతడివంక ప్రశ్నార్థకంగా చూశాడు వెంకట్రామయ్య.

"సరే... దీనివెనుక ఒక కథ ఉంది చెపుతావిను" అంటూ మొదలెట్టాడు నారాయణ నడుస్తూనే.

"సృష్టిలో అన్ని జీవరాశుల్లోకి మనిషిజన్మ ఉత్కృష్టమైనదంటారు. ఏవో కొన్నిజీవులు మినహాయిస్తే మనిషి వయసే ఎక్కువ. మనిషి వయసు గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. సమస్త జీవుల్ని సృష్టించే దశలో మనిషితోపాటు కోతి, గుర్రం, గాడిద, కుక్కలను దేవుడు సృష్టించాడట. మనిషిలా మనసు లేదు. రాగద్వేషాలు ప్రదర్శించలేం. అనుభూతులు, అనుభవాలతో ఆనందించలేం, మాకు ఎక్కువ వయసు అక్కరలేదని ఆ నాలుగు జంతువులు దేవుడికి మొర పెట్టుకున్నాయట. మనిషి మాత్రం తనకు ఎక్కువ వయసే కావాలని దేవుణ్ణి ప్రార్థించాడట. అప్పుడు దేవుడు, మనిషిమొర ఆలకించి ఆ జంతువుల వయసుల్లో కొంత భాగాన్ని మనిషికి బదిలీ చేశాడట. అలా వాటి వయసుల్ని సంగ్రహించిన మనిషికి నూరేళ్ళ ఆయుష్షు లభించింది".

నారాయణచెప్పడం పూర్తికాకుండానే వెంకట్రామయ్య అడ్డొస్తూ "ఇది నిజమా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"ముందు నన్ను పూర్తిగా చెప్పనియ్యి. అయితే జంతువుల వయసుతోపాటూ ఆ జీవుల లక్షణాలే, మనిషికీ సంక్రమించాయి. బాల్యంలో కోతిచేష్టలు, యవ్వనంలో గుర్రంలా పరిగెత్తడం, మధ్య వయసులో గాడిదలా సంసార భారం మోయడం, వృద్ధాప్యంలో కుక్కలా ఇంటికి కాపలా కాయడం! మనం చేస్తున్నది అదే కదా. అందుకే మనది కుక్క బతుకు" అన్నాడు నవ్వుతూ.

ఇంతలో వెనుక నుంచి వస్తున్న ఒకాయన వెంటనే "సార్ ఒక్కక్షణం" అన్నాడు.

ఇద్దరూ ఒక్కసారి వెనక్కి తిరిగారు. ఒక ఆగంతకుడు సన్నగా, పొడుగ్గా, తెల్లటి లాల్చీ పైజామా, బాగా పెరిగిన గెడ్డం, మెడ మీద వేలాడుతున్న జుట్టు.

ఇద్దరూ ప్రశ్నార్థకంగా చూశారు.

అతను ఇద్దరివంక చూసి చెప్పడం మొదలు పెట్టాడు.

"అయ్యా, ఇందాకటినుంచీ నేను మీ వెనకే వస్తున్నాను. మీరు చెప్పుకుంటున్న కథ విన్నాను. అది వాస్తవమో, కల్పిత కథో నాకుతెలీదు, అయితే నాకు తెలిసిందిమాత్రం ఒకటే" అంటూ ఒక్కక్షణం ఆగి ఇద్దరివంకా పరిశీలనగాచూస్తూ, "జంతు లక్షణాలున్న మనిషి అసలైన మానవుడిగా ఈ లోకంలో తన ఉనికిని తన పుట్టుకకుగల పరమార్థాన్ని తెలుసుకోవడమే జీవితం. మీరు వృద్ధాప్యంలో ఉన్నారని, యువకుల్లా ఏమీ చేయలేమని బాధ పడకండి. మీలో తపన ఉంటేచాలు, ఆ సంకల్పమే ఏ పనైనా చేయిస్తుంది" అతను చెప్పడం పూర్తిచేసి గబగబా ఆ పార్కుగేటుదాటి వాళ్ళు చూస్తుండగానే అదృశ్యమయ్యాడు.

ఆ ఆగంతకుడి మాటలకు వెంకట్రామయ్య ఆలోచిస్తూ ఉండిపోయాడు. నారాయణమాత్రం వేగంగా కదిలి "వెళుతున్నానయ్యా మళ్ళీ కలుద్దాం" అంటూ ఆ పార్క్‌నుంచి బైటకు కదిలాడు. వెంకట్రామయ్య మరో రెండురౌండ్లు ఆ పార్క్‌లో తిరిగి ఇంటిముఖం పట్టాడు.

●●●

కాఫీ కప్పుతో బాల్కనీ దగ్గరకొచ్చాడు వెంకట్రామయ్య. కాఫీ తాగుతూ బాల్కనీగ్రిల్ మీద ఉన్న తులసిమొక్కకేసి చూశాడు. బాగా పెరిగి బాల్కనీ గోడమీదనుంచి పైకిసాగింది. జానెడు పొడవున్న ఆ చిన్న మొక్కను రెండేళ్ళక్రితం తన భార్య తొట్టెలో పెట్టి తీసుకొచ్చింది. ఇప్పుడు తను లేదు, పోయి సంవత్సరమైంది. ఆమె పోయినా వీడిపోని జ్ఞాపకాల్లా ఆ తులసిమొక్క పరిమళాలు వెదజల్లుతోంది. కళ్ళు





తుడుచుకుంటూ లోపలికొచ్చాడు. అప్పటికే కొడుకు, కోడలు తయారై ఆఫీసుకు బయలుదేరుతున్నారు.

"వెళుతున్నాం. బాబును చూసుకోండి" అన్నారు. మెట్లు దిగుతూ.

వెళుతున్న కొడుకు మళ్ళీ వెనక్కివచ్చి "నాన్నగారూ టెలిఫోన్‌బిల్లు, కరెంటుబిల్లు కట్టెయ్యండి. డబ్బులు ఫ్రిజ్‌మీద పెట్టాను" అన్నాడు.

"అలాగే" అంటూ మనవడున్న బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు. వాడు అప్పటికేలేచి ఏడుపు మొదలు పెట్టాడు. పాలసీసా వాడినోట్లో ఉంచేసరికి ఏడుపు ఆపాడు. ఇంతలో పనమ్మాయి వచ్చింది. ఆ అమ్మాయి సహాయంతో మనవడికి స్నానంచేయించి వాడిని స్కూలుబస్సు ఎక్కించేసరికి పదైంది. తనూ టిఫిన్ చేసి మనవడి సంరక్షణ పనమ్మాయికి వదిలి టెలిఫోన్‌బిల్లు కట్ట డానికి బయలుదేరాడు.

టెలిఫోన్ ఆఫీసుదగ్గర పెద్ద క్యూ. తనవంతు వచ్చే సరికి అరగంట పట్టింది. ఆ తర్వాత కరెంట్ ఆఫీసుకి వెళ్ళాడు. అక్కడ పరిస్థితీ అంతే. క్యూలో నించుని నీర సంగా అనిపించడంతో ఇవతలగా వచ్చి బెంచీమీద కూలబడ్డాడు. ఇంతలో 'హాయ్ వెంకట్రామయ్యా!' అని పిలిచాడు క్యూలో ముందు నించున్న నారాయణ.

"ఇలా ఇవ్వు కట్టేస్తాను బిల్లు" అంటూ తీసుకున్నాడు.

పావుగంట తర్వాత క్యూలోంచి బయటకొచ్చిన నారా యణ రశీదు అందిస్తూ "నేను బొంబాయి వెళుతున్నాను నా కూతురు దగ్గరకు, కొన్నాళ్ళు ప్రశాంతంగా ఉండొచ్చు" అన్నాడు.

"సరే ఆల్ ది బెస్ట్!" అంటూ ఇంటిముఖం పట్టాడు.

ఇంటికెళ్ళేసరికి మనవడు స్కూలునించి ఇంటికొచ్చేశాడు. వాడికి అన్నం తినిపించి తనూ కాస్త అయిందనిపించి మంచం మీద నడుం వాల్చాడు. అలా ఎంతసేపు పడుకున్నాడో బైట తలుపు చప్పుడు. రాత్రి భోజనం ఏర్పాట్లకు వంటమనిషి వచ్చేసింది.

'ఛ... గంటల బ్రతుకైపోయింది. ఉదయం ఐదునుంచి రాత్రి పదివరకూ భార్య పోయినప్పటి నుంచీ తనకు ఇదే ఉద్యోగం. ఆఫీ సులో పని చేసినప్పుడు ఉదయం పది నుంచి సాయంత్రం ఐదు వరకూ, ఇప్పుడు ఇరవై నాలుగు గంటలూ.

ఇక బలవంతంగాలేచి వంటమనిషికి పనులు పురమాయించి డ్రాయింగ్ రూమ్‌లోకొచ్చి టీవీ ముందు కూలబడ్డాడు. ఏవేవో ఆలోచనలు, మధ్యాహ్నం కరెంటు ఆఫీసులో కనిపించిన మిత్రుడు నారాయణ గుర్తు కొచ్చాడు.

'ఔను నారాయణలాగా, తనూ ప్రశాంతంగా ఏదైనా ఊరెళితే బావుంటుంది. ఏ ఊరు?" నిమిషంపాటు మథనపడ్డాక తమ్ముడు గుర్తుకొచ్చాడు. అతను ఢిల్లీలో ఉన్నతోద్యోగంలో ఉన్నాడు. దాదాపు సంవత్సరమైంది కలిసి. అక్కడ కావలసినన్ని రోజులు ఉండొచ్చు... అమ్మయ్య" అనుకున్నాడు.

సాయంత్రం కొడుకు, కోడలు రాగానే క్లుప్తంగా చెప్పాడు తను ఢిల్లీ వెళుతున్న విషయం. "తమ్ముణ్ణి చూసి చాలా కాలమైంది, చూసి తొందరగా వచ్చేస్తాను" అన్నాడు. ఇద్దరూ "సరే తొందరగా వచ్చేయండి. మనవడు బెంగపడతాడు" అన్నారు.

రెండురోజుల తర్వాత ఫ్లైట్‌టిక్కెట్ బుక్ చేయించుకుని ఢిల్లీ చేరుకున్నాడు వెంకట్రామయ్య.

•••

వెంకట్రామయ్య ఢిల్లీవచ్చి నాలుగు రోజులు గడిచింది. అంతా ఉక్కిరిబిక్కిరిగా ఉంది. ఫిలిం ఫెస్టివల్‌లో ఆర్ట్ ఫిలిం చూస్తు న్నట్లుగా ఉంది ఆ ఇంట్లో పరిస్థితి. తమ్ముడి ఇల్లు పెద్దబంగళా. చుట్టూ ప్రహరీగోడ. నలుగురు పనివాళ్ళు. వంటకు, గార్డెనింగ్, డ్రైవింగ్‌కు ఇంకా సెక్యూరిటీకి.

తమ్ముడు ఒక ప్రభుత్వరంగ సంస్థ ఛైర్మన్. సీనియర్ ఐఏఎస్ అధికారి. అతడిని ఏ పనీ చెయ్యనివ్వడం లేదు. తమ ఊళ్ళో ఉదయం లేచిన దగ్గర నుండీ రాత్రి పడుకోబోయే వరకూ పనే! అలాంటి వాతావరణంలోంచి బైటపడేసరికి బోర్ అనిపిస్తోంది వెంకట్రామయ్యకు. ఉదయం ఐదింటికే అలారం మోగుతుంది. తమ్ముడి కుటుంబం అంతా మార్నింగ్ వాక్‌కి బయలుదేరుతుంది. మళ్ళీ ఏడు గంటలకు ఇంటికొచ్చి స్నానాదికాలు ముగించి అంతా ఉదయం పూట అల్పాహారం నిమిత్తం డైనింగ్ టేబుల్ దగ్గర కలుస్తారు. అక్కడ అంతా మౌనం. ఆ తర్వాత ఎవరి డ్యూటీలో వాళ్ళు. ఇక మనవల్ని చూసుకునేందుకు పనివాళ్ళు. వాళ్ళను ఎత్తుకుందామనుకున్నా రారు. ఇక రాత్రిళ్ళు అంతా పదిగంటలకే మంచం ఎక్కేస్తారు.

'జైల్లో ఖైదీలా అయిపోయింది నా పరిస్థితి' అనుకున్నాడు వెంకట్రామయ్య. అందరూ వెళ్ళిపోయిన తర్వాత ఆ రోజు పేపర్లు తిరగేస్తున్నాడు. అలా చూస్తున్న వెంకట్రామయ్య ఒక వార్త దగ్గర ఆగిపోయాడు. అది చదివేసరికి ముచ్చెమటలు పట్టాయి. గుండె ఆగినంత పనైంది.

"రైలు ట్రాక్‌మీద ఆగిపోయిన స్కూలు పిల్లల బస్సు. ఎక్స్‌ప్రెస్ రైలు ఢీ. కొందరు మృతి. చాలా మంది స్కూలుపిల్లలు ప్రాణాపాయస్థితిలో ఉన్నారు"

ఒక్కసారి ఒళ్ళంతా గగుర్పాటు. ఈ మధ్య పేపర్లో ఏ ప్రమాద సంఘటన చూసినా తనకు గుండె ఆగినంత పనవుతోంది. పాపం! చిన్న పిల్లలు, లోకం ఇంకా చూడనివాళ్ళు. అప్పుడే వీళ్ళకు నూరేళ్ళు నిండాయా? అయ్యో' గుండెల్లో సన్నగా బాధ మొదలైంది.

మనవడు గుర్తుకొచ్చాడు వెంకట్రామయ్యకు. పాపం చనిపోయిన పిల్లలంతా ఇంచుమించు అదే వయసు వాళ్ళు. అలా అనుకుంటున్న అతడికి మనవడిమీద బెంగ పెరిగింది. 'బాబోయ్, వాణ్ణి బస్సు ఎలా ఎక్కిస్తున్నారో, దిగేటప్పుడు కూడా ఎవరుంటున్నారో, తనువాణ్ణి ఎందుకు వదిలిపెట్టి వచ్చేశాడు?' ఆలోచనలోపడ్డాడు. పావుగంటకుపైగా ఆలోచనలుసాగాయి. వెంటనే ఒక నిర్ణయానికి వచ్చేశాడు.

'వెంటనే వెళ్ళిపోవాలి అనుకున్నాడు'.

తన బ్యాగ్ సర్దుకున్నాడు. ఫ్లైట్‌టికెట్ బుక్ చేయమని, వెంటనే తమ్ముడికి ఫోన్‌చేశాడు. ఆ మాటలకు తమ్ముడు కోప్పడుతూ, "ఏంటన్నయ్యా, వచ్చి నాలుగురోజులు కూడా కాలేదు, ఏముంది ఆ ఊళ్ళో" అన్నాడు.

"ఉంది తమ్ముడు ఉంది నా పాత బంగారు లోకం" అన్నాడు బాధపడుతూ.

రెండుగంటల తర్వాత తన లగేజీతో తమ్ముడు పంపించిన కారులో ఇంటిదగ్గర బయలుదేరాడు. మనసు ప్రశాంతంగా ఉంది. తమ్ముడు ఉంటున్న ఆ పోష్ ఏరియా దాటి కారు హైవే రోడ్డు మీదకొచ్చింది. నాలుగురోడ్ల జంక్షన్‌లో ట్రాఫిక్ జామ్. ఆ సమయంలో పొడుగాటి ఒక వ్యక్తి పరిగెత్తుకుంటూ వచ్చాడు. బాగా పెరిగిన జుట్టు, తైల సంస్కారం లేదు. బట్టలు మాసిపోయి చీలికలై కనిపిస్తున్నాయి. గట్టిగా కేకలు పెడుతూ అరుస్తున్నాడు హిందీలో.

అతని మాటలు అర్థం చేసుకున్న వెంకట్రామయ్యకు ఆశ్చర్యం కలిగింది.

"ఇంతకీ ఎవరా వ్యక్తి?" అడిగాడు డ్రైవర్‌ని.

"పిచ్చోడు బాబూ, ఐదేళ్ళుగా ఇక్కడే తిరుగుతున్నాడు. ఎవరైనా ఏదైనాపెడితే తింటాడుతప్ప ఎవరినీ ఏమీ అడగడు. ఈ జంక్షన్‌లోనే అతగాడి కుటుంబం మొత్తం ప్రమాదంలో చనిపోయిందట! ఆటోలో వెళుతున్న వాళ్ళను లారీ గుద్దేసిందట, అప్పటినుంచీ అలా తయారయ్యాడు" అన్నాడు డ్రైవర్.

మనసు చివుక్కుమంది. కారు కదిలేవరకూ అతగాడినే చూస్తూ అలాగే ఉండిపోయాడు. ఫ్లైట్ ఎక్కి విశాఖపట్నం చేరేవరకూ ఆ వ్యక్తి వెంకట్రామయ్య స్మృతిపథం నుంచి వీడిపోలేదు.

●●●

కొడుకు, కోడలు ఆఫీసుకు వెళ్ళారు. ఇంట్లో వెంకట్రామయ్య ఒక్కడే ఉన్నాడు. మనవడు స్కూలుకు వెళ్ళాడు. బుర్రలో రకరకాల ఆలోచనలు. పుస్తకాల రాక్ వైపు చూశాడు. తను ఈమధ్య కొన్న పుస్తకం తీశాడు. "ది ఫౌంటెన్ ఆఫ్ ఏజ్" వృద్ధాప్యంలో వయసును ఎదుర్కొని ఎలా బతకాలో చెపుతుందీ పుస్తకం. మరి తను ఎలా ఎదుర్కోబోతున్నాడు? రాక్ లోంచి ఇంకో పుస్తకం తీశాడు. 'తలలు బోడులైనా తలపులు బోడులవునా' వృద్ధాప్యంలో సైతం విజయాలు కైవసం చేసుకుంటున్న విజేతల గురించి.

**పార్కులో వాకింగ్ చేస్తున్నఆ స్నేహితులిద్దరూ మనిషి ఆయుష్షుకు సంబంధించిన ఒక పుక్కిటపురాణ కథ గురించి మాట్లాడుకుంటున్నారు. వారి సంభాషణవిన్న వ్యక్తి ఒకరు వారిదగ్గరకు వచ్చి అయాచిత కర్తవ్య బోధ చేసి వెళ్ళిపోయాడు. కానీ వెంకట్రామయ్య మాత్రం దానిగురించి ఆలోచిస్తూనే ఉన్నాడు. ఒకసారి ఢిల్లీ మహానగరం వెళ్ళినప్పుడు అక్కడ అతడికెలాంటి అనుభవం ఎదురైంది? అతడెలాంటి ఆలోచన చేశాడు?**

ఉత్తరప్రదేశ్‌లో ఎనభయ్యేళ్ళ వయసులో, రైఫిల్ షూటింగ్‌లో డిఐజి స్థాయి అధికారిని ఓడించిన చంద్రో టమర్, యాభై ఎనిమిదేళ్ళ వయసులో కూతురి కోసం గర్భాన్ని అద్దెకు ఇచ్చి ఆ వయసులో తల్లిగా మారిన విదేశీ మహిళ శాండి లారెన్స్.

ఎనభయ్యేళ్ళ వయసులో పి.హెచ్.డి. పట్టా పొందిన వృద్ధనారి... ఇలా ఎంతమందో! మరి తనకు డెబ్భై ఏళ్ళు దాటాయి. క్షణక్షణం ఏదో దిగులు జీవితం బోర్ అనిపిస్తోంది. ఈ శేష జీవితంలో సృజనాత్మకత నింపుకోవడం ఎలా?!

'తను కవిత్వం రాయలేడు, పాటలు పాడలేడు, బొమ్మలు గియ్యలేడు! మరి!? ఆలోచనలో పడిన వెంకట్రామయ్య గోడవైపు తలతిప్పాడు. గోడమీద వేలాడదీసిన రకరకాల ఛాయా చిత్రాలు. అరకులోయ కాఫీతోటలో గిరిజన స్త్రీ ఫొటో. కాశీలో గంగానది ఒడ్డున వృద్ధమహిళ ఫొటో ఇంకోటి. పడవ నడుపుతున్న సరంగు, గోదావరిలో చేపలవేటకై వల వేస్తున్న జాలరి ఫొటో మరొకటి. ఈ ఫోటోలన్నీ తనే తీశాడు. ఔను! తనకు ఫోటోగ్రఫీ హాబీ. ఇరవయ్యేళ్ళ వయసప్పుడు నాన్న తనకు కెమేరా కొనిచ్చాడు. దాంతో ఫోటోలు తీసేవాడు. పత్రికలకు, పోటీలకు ఫోటోలు పంపేవాడు. చాలాసార్లు బహుమతులొచ్చాయి. ఉద్యోగం వచ్చాక సొంతంగా కెమేరా కొనుక్కున్నాడు. ఆ హాబీ ఇరవయ్యేళ్ళు కొనసాగింది. కొడుకుపుట్టిన తర్వాత ఆ హాబీ మూలపడింది. రిటైరైనప్పుడు తన సహోద్యోగులు ఒక కెమేరా బహుమతిగా ఇచ్చారు. దాన్ని ఎప్పుడూ బైటకు తియ్యలేదు. ఇప్పుడు దాని అవసరం వచ్చింది. మళ్ళీ నా హాబీ కొనసాగిస్తాను' అనుకున్నాడు వెంకట్రామయ్య.

●●●

ఉదయంలేచి పనులు ముగించుకుని పేపర్ ముందేసుకున్నాడు. వార్తలు చదువుతుంటే ఏవో దిగులు మేఘాలు. రోజూ ఎక్కడో ఓచోట జరుగుతున్న రోడ్డు ప్రమాదాలు. ఈరోజు ఐదుచోట్ల జరిగిన ప్రమాదాల్లో పదిమంది చనిపోయారు. ఒక లారీ డ్రైవర్ తాగి నడిపాడట. సెల్‌ఫోన్‌లో మాట్లాడుతూ ప్రమాదవశాత్తూ ఆగిన లారీని ఢీకొని ఇంకో టాక్సీవాలా చనిపోయాడు. మిగతా మూడు ప్రమాదాలు మితిమీరిన వేగంతో నడపడంవల్ల సంభవించినవే. మరి ఇలాంటి ప్రమాదాల్ని నివారించలేమా?! వీటిని వార్తా కథనంగా చేసిన ఆ విలేకరి ఏం రాశాడు? 'ఆ ప్రమాదాలకు కారణమైనవారు తమ కుటుంబాల గురించి,



తమమీద ఆధారపడ్డవారిగురించి ఆలోచిస్తే అంత నిర్లక్ష్యంగా డ్రైవింగ్ చేస్తారా?!'

ఆ వాక్యం చదువుతూ ఆలోచనలో పడిపోయాడు వెంకట్రామయ్య. పావుగంటతర్వాత అతడిలో ఒక ఆలోచన రూపుదిద్దుకుంది. 'అవును తను చేయాల్సింది అదే!' అనుకున్నాడు.

రిటైరైనప్పుడు తన సహచరులంతా కలిసి కొనిచ్చిన వీడియో కెమేరాను బీరువాలోంచి తీశాడు. ఆరోజు ఆదివారం. కొడుకు, కోడలు మనవణ్ణి తీసుకుని బైటకు వెళుతున్నారు. "ఒక్కక్షణం ఆగండి" అన్నాడు. వాళ్ళు ప్రశ్నార్థకంగా చూశారు. ముగ్గుర్నీ ఒక ఫొటోతీశాడు. "థాంక్యూ తాతయ్యా" అన్నాడు మనవడు. వెళుతున్నవారి వంక నవ్వుతూ చూశాడు.

ఆ తర్వాత తమ అపార్ట్‌మెంట్ గ్రౌండ్ ఫ్లోర్‌లో ఉన్న అసోసియేషన్‌హాల్‌కు చేరుకున్నాడు. ఆరోజు అపార్ట్‌మెంట్‌లో ఉండే కుటుంబాల గెట్ టు గెదర్ . ఒక్కొక్కరినే కలుస్తూ, ఏ కుటుంబంవారు కలిసినా వారి ఛాయాచిత్రాలు తీయడం మొదలుపెట్టాడు. అలా ఇంచుమించు ఆ అపార్ట్‌మెంట్‌లో అన్ని కుటుంబాల ఫొటోలను తన కెమేరాలో లోడ్‌చేశాడు.

తరువాతరోజు ఫొటో స్టూడియోలో తను తీసిన ఫొటోరీల్ కడిగించి ప్రింట్లు వేయించాడు. ముందు తనుతీసిన తన కొడుకు ఫ్యామిలీ ఫొటో కొడుక్కి ఇస్తూ "దయచేసి ఈ ఫొటోలు మీరు నడిపే వాహనాల్లో తగిలించండి, ప్లీజ్!" అన్నాడు.

వెంకట్రామయ్య చెప్పిన ఆ విషయం గురించి మారు మాట్లాడకుండా అంతా ఓకే చెయ్యడం అతడికి సంతృప్తి కలిగించింది.

తనకు ఈ ఆలోచన పుట్టించిన డిల్లీలోని ఆ పిచ్చి వ్యక్తి గుర్తుకొచ్చాడు. ఆరోజు అతడి కేకలు గుర్తు తెచ్చుకున్నాడు.

"బాబూ మీరు వేగంగా వాహనాలు నడపకండి. మీ కుటుంబ సభ్యుల్ని గుర్తుతెచ్చుకోండి. మీ కోసం ఇంట్లో ఎదురుచూసే మీ భార్య, తల్లి, చెల్లి, ముద్దులొలికే మీ కొడుకో, మనవడో... ఎవరో ఒకరు మీ కోసం మీ కుటుంబం ఎదురు చూస్తూ ఉంటుందని గమనించండి. మీరు ప్రాణాలు కోల్పోతే వాళ్ళేమవుతారో ఊహించండి".

అతను ఆ రోజు కేకలు పెట్టాడు, ఏడ్చాడు, మొత్తుకున్నాడు... పాపం పిచ్చివాడనుకున్నారుగానీ ఎంత అద్భుతమైన ఆలోచన. రోజూ ప్రపంచం మొత్తం మీద ఎన్ని లక్షలమంది చనిపోతున్నారు. వీటిలో నిర్లక్ష్యంపాలే ఎక్కువని నివేదికలు తెలియజేస్తున్నాయి. అతివేగం, తాగి డ్రైవింగ్, సెల్‌ఫోన్‌లో మాట్లాడుతూ డ్రైవింగ్... ఇలా ఎన్నెన్నో. వీటికి తను ఎన్నుకున్న ఒక చిన్న పరిష్కారమే ఫ్యామిలీ ఫొటో.

'ఔను తమ కుటుంబం కళ్ళఎదురుగా కనిపిస్తే వాహనం నిర్లక్ష్యంగా నడుపుతారా!? బహుశా నూటికి ఎనభైశాతం మంది అలా

# అలాంటి రూమర్లు ఇష్టమేనట!

*సహజంగా రూమర్లు అంటే హీరోయిన్లు మండి పడుతుంటారు. ముఖ్యంగా ప్రేమ విషయంలో వచ్చే రూమర్లను ఎప్పటికప్పుడు ఖండించేస్తారు కూడా! కానీ వీటికి భిన్నంగా మాట్లాడుతోంది రష్మి గౌతమ్. బుల్లితెరనుంచి వెండితెరకు వచ్చిన రష్మికి రూమర్లంటే ఇష్టమేనట! వాటి ద్వారా వచ్చే పేరును ఎంజాయ్ చేస్తుందట కూడా! బుల్లితెర నటుడితో ఉన్న ప్రేమ వ్యవహారం గురించి అడిగినప్పుడు పై విధంగా సమాధానం చెప్పింది. నా రిలేషన్‌షిప్ గురించి ఎవరెన్ని విధాలుగా మాట్లాడుకున్నా తనకు ఎలాంటి ఇబ్బంది లేదని చెప్పుకొచ్చింది. గాసిప్స్‌ను ఎంజాయ్ చేసే నటి బహుశా రష్మీనే కావచ్చని టాలీవుడ్ జనాలు సరదాగా జోకులేస్తున్నారు.*



చెయ్యరు!'

వెంకట్రామయ్యకు చాలా సంతృప్తిగా ఉంది. ఇంతకాలం సంసారం, పిల్లలు, ఉద్యోగం. ఇది చాలు తనకి అనుకున్నాడు. ఆ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించాడు. అయితే, ఆ రోజు పార్కులో కలిసిన ఆ గెడ్డం, మీసాలవ్యక్తి చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకున్నాడు.

'ఆ జీవన సాఫల్యమార్గం ఏమిటో తనకు ఇన్నేళ్ళొచ్చిన తర్వాత తెలిసింది. తనకు చేతనైంది ఈ జీవిత చరమాంకంలో చేయగలుగుతున్నాడు' అలా అనుకుంటూ ఇంటివైపు ప్రశాంతంగా నడిచాడు వెంకట్రామయ్య.

వారం రోజుల తర్వాత మార్నింగ్‌వాక్ పూర్తి చేసి ఇంటికొస్తూంటే 'సార్' అంటూ ఒకవ్యక్తి ఎదురు పడ్డాడు. అతను పొట్టిగా, బొద్దుగా ఉన్నాడు. వయసు నలభైలోపు ఉంటుందేమో. "నమస్కారం" అంటూ రెండు చేతులూ జోడించాడు.

"ఎవరుబాబూ నువ్వు?! నిన్ను ఎప్పుడూ చూడలేదు" అన్నాడు వెంకట్రామయ్య ప్రశ్నార్థకంగా అతడివైపు చూసి.

"సార్, నా పేరు సింహాచలం. లారీ డ్రైవర్‌ని. అలాగే లారీ డ్రైవర్ల సంఘానికి కార్యదర్శిని, మీ అపార్ట్‌మెంట్‌లో అందరి ఫ్యామిలీ ఫొటోలుతీసి వాహనాల్లో ఉంచమని చెపుతున్నారని మాకు తెలిసింది. నేను నా ఫ్యామిలీ ఫొటో నా లారీలో ఉంచి డ్రైవింగ్ చేశాను సార్. చాలా ప్రశాంతంగా నడిపాను. వేగం లేదు. ఏ ఆలోచనా రాలేదు. సెల్‌ఫోన్ మోగినా తియ్యలేదు. నా ధ్యాసంతా లక్ష్యంవైపే! రోడ్డు ప్రమాదాల నివారణకు మీ ఫ్యామిలీ ఫొటో కాన్సెప్ట్ చాలాబాగుంది. ఈ విషయం మా సంఘంలో సభ్యులందరికీ చెప్పాను. అందరూ తమ కుటుంబంతో తీయించుకున్న ఫొటోలు లేకుండా లారీలు బైటకు తియ్యం అంటూ శపథం చేశారు. ఈ విషయం మాతో ఆగదు. మాకు తెలిసిన ప్రతీ డ్రైవరుకు చెబుతాం సార్ అందరి తరపున మీకు కృతజ్ఞతలు" అతను మరోసారి చేతులు జోడించి ముందుకు కదిలాడు.

అయితే వెళుతున్నవాడల్లా మళ్ళీ వెనక్కి వచ్చి "సార్.. నాదో సందేహం ఈ ఆలోచనే అద్భుతం. దీని వెనుక ఏదైనా బలమైన కారణం ఉందా!?" అన్నాడు.

'ఉంది... ఆ బలమైన కారణం నా భార్య. రోడ్డుమీద వెళుతున్న నా భార్యను సంవత్సరం క్రితం వేగంగా వెళుతున్న ఒక కారు ఢీకొట్టింది. అంబులెన్స్ వచ్చే లోపే చనిపోయింది. మనిషి ప్రాణానికి పరిమితి పెట్టిన దేవుడు మనుషులమధ్య ప్రేమానురాగాలకు, అనుబంధాలకు పరిమితి పెట్టలేదు. అందుకే ఈ ఫ్యామిలీ ఫొటో" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు వెంకట్రామయ్య.

**సెల్:93931 29945**




# ఊహలు పటాపంచలైతే...?

**మంచంపై పడిఉన్న అమ్మాయి శవం వైపు చూశాడు డిటెక్టివ్ శరత్. చేతులు కలిపి కట్టేసి ఉన్నాయి. కాళ్ళు వేర్వేరుగా కట్టి ఉన్నాయి. అమ్మాయిపై అత్యాచార ప్రయత్నం జరిగినట్టు స్పష్టంగా తెలుస్తోంది.**

**అత్యాచారం ఒక్కటే కాదు. ఇంట్లో డబ్బులు కూడా తీసుకు పోయినట్టు ఉన్నాడు. పర్సు కనబడటంలేదు. బీరువాలో ఉన్న నగలు, ఇతర విలువైన వస్తువులు కూడా తీసుకు వెళ్ళినట్టున్నారు' అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.**

తలాడించాడు శరత్. ఇంట్లో దొరికిన వేలిముద్రలు సేకరించాడు. అమ్మాయి అరవకుండా నోట్లోగుడ్డలు లోతుగా కుక్కినట్టున్నాడు. గుడ్డలు గొంతుకు అడ్డం పడ్డాయి' ఇల్లంతా పరిశీలిస్తూ అన్నాడు శరత్.

డబుల్ బెడ్‌రూమ్ ఫ్లాట్ అది. కానీ ఒకటే బెడ్ రూమ్ వాడుతున్నట్టు తెలుస్తోంది. రెండో బెడ్ రూమ్ నిండా దుమ్ము ఉంది.

'బాస్, ఫ్లాట్‌లో అమ్మాయి ఒక్కర్తే ఒంటరిగా ఉంటోందట. వివాహమైంది. భర్తతో వేరుపడి ఉంటోందట' శరత్ అసిస్టెంట్ రాము ఆమె గురించిన సమాచారం సేకరించి చెప్పాడు.

'ఎవరైనా అనుమానాస్పద వ్యక్తిని చూశారా? ఏమైనా శబ్దాలు విన్నారా?' అడిగాడు శరత్.

'లేదు బాస్. అంతా నార్మల్‌గానే ఉంది. అమ్మాయి తల్లిదండ్రులకూ కబురు వెళ్ళింది' చెప్పాడు రాము.

'ఆమె భర్తగురించి వివరాలు సేకరించు. హత్య జరిగిన సమయంలో అతడు ఏం చేస్తున్నాడో తెలుసుకో' శరత్ రాముతో చెప్తూంటే ఆ ఫ్లాట్ వాచ్‌మన్ విజిటర్స్ పుస్తకం పట్టుకొచ్చి చూపించాడు.

'నిన్న అమ్మగారిని కలవటానికి ఎవ్వరూ రాలేదండి. విజిటర్స్ పుస్తకంలో, ఫ్లాట్‌లోకి వచ్చిన ప్రతివారూ ఎంట్రీ చేయాల్సి ఉంటుంది. ఎవరికోసం వచ్చారు? ఎంత సేపున్నారు? ఫోన్‌నెంబర్లు అన్నీ రాస్తారు' రిజిస్టర్ శరత్‌కి అందించాడు వాచ్‌మన్.

అతడివైపు చూశాడు శరత్. 'నీ డ్యూటీ ఎన్ని గంటలు?' అడిగాడు.

'ఇరవైనాలుగు గంటలూ డ్యూటీయేనండి. కాంపౌండ్ లోనే ఉంది నా ఇల్లు. నేను ఎటూ పోను. ఇక్కడే ఉంటాను. నేనులేనప్పుడు నా తమ్ముడు ఉంటాడు. అంతేతప్ప ఎవ్వరూ లేకుండా ఎప్పుడూ ఉండదు. మాకు తెలియకుండా ఎవ్వరూ లోపలకు రాలేరు. అందుకే ఇది ఎలా జరిగిందో అర్థం కావటంలేదు. దాదాపు ఏడుస్తున్నట్టు చెప్పాడు వాచ్‌మన్. ఎందుకంటే ఇప్పుడు అతడి ఉద్యోగం ప్రమాదంలో పడింది. అప్పటికే కొత్త వాచ్‌మన్ గురించి చర్చలు ఆరంభమయ్యాయి.

ఆ అపార్ట్‌మెంట్స్ చుట్టూ తిరిగి చూశాడు శరత్.

ఆ ఫ్లాట్‌లోకి రావాలంటే ప్రధానమార్గంలోనే రావాలి తప్ప మరో దారిలేదు.

'సిసి కెమేరాలు పెట్టలేదండి. ఇకపైపెడతాం' శరత్ ప్రశ్నకు ఆ అపార్ట్‌మెంట్ ప్రెసిడెంట్ చెప్పాడు సమాధానం.

'ఇదేదో ఫ్లాట్లలో వాళ్ళపనే అయిఉంటుంది' శరత్‌తో అన్నాడు విజయ్. అసిస్టెంట్ రామువైపు తిరిగాడు శరత్.

'రామూ ఈ ఫ్లాట్లలో ఉంటున్న వాళ్ళందరి వివరాలు సేకరించు. వాళ్ళ కాల్‌డేటా, బ్యాంకు బాలెన్స్ వంటి వివరాలు సేకరించు' ఆలోచిస్తూ చెప్పాడు శరత్.

●●●

'బాస్... అపార్ట్‌మెంట్లో మొత్తం వాచ్‌మన్‌తో కలిపి పది కుటుంబాలున్నాయి. అందరూ ప్రభుత్వోద్యోగులే. హత్యకు గురైన అపూర్వతప్ప అందరూ ఫ్యామిలీలతో ఉంటున్నారు. మధ్యతరగతి మనుషులు. ఎవరినీ అనుమానించటానికి లేదు. ఎవరికివారు ఈ అమ్మాయిపట్ల కుతూహలం, ప్రదర్శించినా ఫ్యామిలీని పక్కన పెట్టుకుని ఆమెకు సన్నిహితంగా వెళ్ళేవాళ్ళు ఎవరూ కనబడటంలేదు. అమ్మాయి వయస్సు ఇరవైఅయిదు. వీళ్ళెవరూ యాభైకి తక్కువ లేరు' చెప్పాడు రాము.

'వాళ్ళ పిల్లల్లో యువకులు లేరా?'

'ఉన్నారు కానీ.. ఇద్దరు రెసిడెన్షియల్ కాలేజ్‌లో చదువుతున్నారు. ఇద్దరి పిల్లలకు పెళ్ళిళ్ళు జరిగాయి. వాళ్ళు బెంగుళూరులో ఉంటున్నారు. ఒకరి పిల్లవాడు అమెరికాలో ఉన్నాడు'.

ఇంతలో శరత్‌కు వేలిముద్రల నిపుణుడు వేణు నుంచి ఫోను వచ్చింది.

●●●

తలుపు తెరచి శరత్‌ని ప్రశ్నార్థకంగా చూశాడు ప్రసాదరావు. తనని తాను పరిచయం చేసుకున్నాడు శరత్.

వెంటనే ప్రసాదరావు కళ్ళల్లో భయం కనిపించింది.

'నాతో ఏంపని?' అడిగాడు. అతని స్వరంలో వణుకు స్పష్టంగా తెలుస్తోంది.

'హత్యకు గురైన అపూర్వతో మీకు సన్నిహిత పరిచయం ఉందా?' సూటిగా అడిగాడు శరత్.

ప్రసాదరావు ఇంట్లోకి చూశాడు భయంగా.

'మనం బైట మాట్లాడుకుందాం' అంటూ బాల్కనీలోకి దారి తీశాడు.

'అపూర్వతో నాకు స్నేహం ఉంది. ఒంటరి మహిళ కదా' మా ఆవిడ ఊరు వెళ్ళినప్పుడు మాకు స్నేహం కలిసింది. తాను నాకు వండిపెట్టేది. అలా దగ్గరయ్యాం. మంచి అమ్మాయి. అంతే తప్ప మా మధ్య ఏమీ లేదు' భయంగా అటూ ఇటూ చూస్తూ చెప్పాడు ప్రసాదరావు.

'మీరు శారీరక సంబంధంకోసం ఒత్తిడి చేస్తున్నారని, తనకు ఇష్టం లేదని డైరీలో రాసుకుంది అపూర్వ' అంటూ చీకట్లో ఓ రాయి విసిరాడు శరత్.

తలవంచుకున్నాడు ప్రసాదరావు.

'నిజం చెప్పండి' గద్దించాడు శరత్. రాయి తగలాల్సిన చోట తగిలింది. 'ఎంతైనా మగవాణ్ణి కదా? అడిగాను. ముందు వద్దంది. కానీ తరువాత ఒప్పుకుంది. ఆ రోజు... మేమిద్దరం కలవాల్సిన రోజు'.

'మీ వేలిముద్రలు ఇంట్లో దొరికాయి. అబద్ధం చెప్పకండి'. ప్రసాదరావు గుటకలు మింగాడు. నన్ను రాత్రి పదిదాటిన తరువాత రమ్మంది. నేను వెళ్ళాను. తలుపులు తెరచి ఉన్నాయి. లైటులేదు. నేను బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి లైటు వేశాను' మాట్లాడలేకపోయాడు. కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి'.

'ఏం జరిగింది?'

'మంచం మీద శవం ఉంది. నాకు కాళ్ళు చేతులు ఆడలేదు. పరుగున బైటకు వచ్చేశాను. లైట్లు ఆర్పేశాను. లోపలనుంచి నొక్కి తలుపుతీస్తే తాళం పడుతుంది. అలా తలుపు వేసేసి ఇంటికి వచ్చేశాను. అంతేతప్ప నాకు ఏం తెలియదు. ఆమెను చంపాల్సిన అవసరం నాకులేదు' దాదాపు ఏడుస్తూ చెప్పాడు ప్రసాదరావు.

ఇంతలో సెర్చ్ వారెంట్ పట్టుకునివచ్చాడు విజయ్.

ప్రసాదరావు ఇల్లు సోదా చేయటం ఆరంభించారు.

'హత్య ఇతడు చేసినట్టు లేడు' రాముతో అన్నాడు శరత్. 'ఓసారి వాచ్‌మన్‌ని పిలు'.

'పాత వాచ్‌మన్‌ని పనిలోంచి తీసేశారట. కొత్త వాచ్‌మన్ వచ్చాడు' శరత్‌కు చెప్పాడు రాము.

ఏదో పనిలో ఉన్నట్టున్నాడు గ్లవ్స్ వేసుకుని ఉన్నాడు వాచ్‌మన్.

అతడివైపు చూసిన శరత్, 'గ్లవ్స్ ఎక్కడివి?' అడిగాడు.

'వాచ్‌మన్‌కి గ్లవ్స్ ఇస్తామండి. ఎలక్ట్రికల్ పనులు

**ఆమె వివాహిత. కానీ విడాకులు తీసుకుంది. ఆ ఫ్లాట్‌లో ఒంటరిగా బతుకుతోంది. ఆకస్మికంగా హత్యకు గురైంది. రెండు చేతులు కట్టేసి ఉన్నాయి. అరవకుండా నోట్లో గుడ్డలు కుక్కారు. మంచానికి రెండువైపులా ఆమె కాళ్ళను కదలకుండా కట్టేశారు. ఇంట్లో డబ్బూ, నగలూ దొంగిలించారు. అక్కడ సిసి కెమేరాల సదుపాయం లేదు. అందువల్ల ఎవరు లోపలికి ప్రవేశించారో తెలియదు. డిటెక్టివ్ శరత్, అసిస్టెంట్ రాము ఈ కేసును ఎలా పరిష్కరించారు?**



ఇతర పనులు చేసేటప్పుడు రక్షణ ఉంటుందని' ఫ్లాట్ల అధ్యక్షుడు చెప్పాడు.

అతడివైపు పరిశీలనగా చూశాడు శరత్. 'ఇంతకు ముందు వాచ్‌మన్‌కి కూడా గ్లవ్స్ ఉండేవా?

'ఉండేవి. అవే ఇతడికి ఇచ్చాడు. మేం ప్రతి వస్తువు లెక్క రాస్తాం'

'పాత వాచ్‌మన్ ఎక్కడికి వెళ్ళాడు?'

'ఏమో తెలియదు. పొమ్మన్నాం. పోయాడు'

'రాము.... పాత వాచ్‌మన్ ఎక్కడున్నాడో తెలుసుకో' అన్నాడు.

'కళ్ళ ఎదురుగానే హంతకుడున్నా గుర్తించలేకపోయాను. అనుమానం రాలేదు' అన్నాడు విజయ్‌తో.

●●●

బాస్... వాచ్‌మన్ అదృశ్యమైపోయాడు. ఎటు పోయాడో తెలియటం లేదు' చెప్పాడు రాము.

'వివరాలు చెప్పు. అతడికో తమ్ముడు ఉండాలి కదా?'

'వాచ్‌మన్ పేరు విక్రమ్. అతడి తమ్ముడు హరి. వాళ్ళు అనాథలు. శరణాలయంలో పెరిగారు. వాచ్‌మన్ ఉద్యోగం రాగానే తమ్ముణ్ణి తెచ్చుకున్నాడు. అంతకన్నా వేరే వివరాలు తెలియటంలేదు బాస్'.

"విజయ్... అమ్మాయి క్రెడిట్‌కార్డు నిఘాలో ఉంచావు కదా' అదేవిధంగా రామూ, పోయిన నగలు, దొంగిలించిన నగలుకొనే దుకాణాల్లో మన వాళ్ళను నిఘా ఉంచావు కదా!'

'యెస్‌బాస్. వాడు క్రెడిట్‌కార్డు వాడినా, నగలు అమ్మాలని చూసినా మనకు తెలుస్తుంది'.

'ఎంత ధైర్యం వాడికి. హత్యచేసి మనఎదుటే దర్జాగా తిరిగాడు' అన్నాడు విజయ్.

'వాడు పారిపోతే అనుమానం వాడిమీదకే వచ్చేది' ఆలోచిస్తూ అన్నాడు శరత్.

●●●

'బాస్... క్రెడిట్ కార్డుని బెంగళూరులో ఉపయోగించాడు' ఎక్సైట్‌మెంట్‌తో అరిచాడు రాము. విజయ్ వైపు చూశాడు శరత్. 'చలేంగే?' అడిగాడు.

అప్పటికే వాచ్‌మన్ విక్రమ్ ఫొటోలన్నీ పోలీస్ స్టేషన్లకు పంపారు. కానీ విక్రమ్ బెంగళూరులో ఉన్నాడన్నమాట అనుకున్నాడు శరత్.

●●●

దూరం నుంచే ఆ ఫ్లాట్ పరిశీలించాడు శరత్.

ఫొటో చూపించగానే ఏటీఎం గార్డు గుర్తుపట్టాడు.

'నేనే ఉద్యోగం ఇప్పించాను. మంచి కుర్రాడు. పైకి వస్తాడు. మెజిస్టిక్ ఫ్లాట్‌లలో వాచ్‌మన్‌గా ఉన్నాడు' అన్నాడు.

ఆ ఫ్లాట్‌లకు ఎలా వెళ్ళాలో దారికూడా చూపించాడు.

వంచిన తల ఎత్తకుండా పని చేస్తున్నాడు విక్రమ్. పార్క్ చేసిన కార్లు కడుగుతున్నాడు. విక్రమ్‌కి అతని తమ్ముడు హరి సహాయం చేస్తున్నాడు.

అలికిడైనవైపు తలతిప్పి చూశాడు విక్రమ్.

శరత్‌ని చూడగానే గుర్తుపట్టాడు. అతడికళ్ళు వెడల్పయ్యాయి. పారిపోబోయాడు. అందుకోసమే సిద్ధంగా ఉన్న రాము ఒక్క గెంతులో అతడిని చేరుకున్నాడు.

'నా తమ్ముడికేం తెలియదు. వాడిని వదిలేయండి' అరిచాడు విక్రమ్.

●●●

'ఒంటరిగా ఉన్న అపూర్వపై విక్రమ్ కన్ను పడింది. ఆమెకు పలురకాలు పనులుచేసి పెట్టేవాడు. ఆమె అతణ్ణి కేవలం వాచ్‌మన్‌గానే చూసేది. కానీ విక్రమ్‌మాత్రం ఆమె చుట్టూ కలలు అల్లుకున్నాడు. ఏవేవో ఊహించుకున్నాడు. ఆ రోజు డబ్బు అవసరమై ఆమె ఫ్లాట్‌కి వెళ్ళాడు. ప్రసాదరావు వస్తాడని అలంకరించుకుని, ఎదురు చూస్తోంది ఆమె. వాచ్‌మన్‌ని చూసి చిరాకు పడింది. డబ్బూలేదు గిబ్బూలేదు పొమ్మంది. దాంతో కోపంవచ్చింది విక్రమ్‌కి. ఆమెపై అత్యాచారానికి ప్రయత్నించాడు. ఆమె ప్రతిఘటించింది. ఆమె తిట్లకు కోపం పట్టలేకపోయాడు. హత్య చేశాడు. డబ్బు, నగలు దొంగతనం చేశాడు. ఏమీ ఎరగనట్టు వచ్చాడు. ఆరోజు అతడిమీదకు అనుమానం పోలేదు. బహుశా, అతడి ఇల్లు కూడా సోదా చేసి ఉంటే అప్పుడే నగలు, ఆమె వస్తువులు దొరికేవి. నేరం బైటపడేది. ఒకోసారి నేరపరిశోధనలో కళ్ళ ఎదురుగా ఉన్నదే చూడలేం. అలా విస్మరించిన అంశాలే కీలకం అవుతాయి' వివరించాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ, సెల్: 98496 17392**




**"కౌషిక్! ఎక్కడున్నావు? ఫోన్లో అసహనంగా అడిగింది మాధురి. "అడిగింది నువ్వు... మేటరేంటో చెప్పు".**

**"చెప్తేగాని కన్పించవా?"**

**"కన్పిస్తేగాని చెప్పవా?"**

**"అయితే ఫోన్ పెట్టెయ్‌రా! కౌ..... షిట్"**

**"ఎందుకంత కోపం మధూ!"**

"ఎక్కడున్నావో చెప్పు ముందు. నీకోసం ఎంత సేపట్నుంచీ వెతుకుతున్నానో తెలుసా!"

"అసలు... నువ్వెక్కడున్నావో చెప్పు".

"సిగ్గులేదురా! నీకు.. సరిగ్గా ఇరవై నిమిషాల్లో డ్రైవిన్ రెస్టారెంట్‌కి వచ్చెయ్".

"నీ బాంచన్ తల్లే.." అన్నాడు కౌషిక్ అతి వినయంగా.

•••

సాయంత్రపు చలిగాలి వింజామరలా వీస్తోంది. డ్రైవిన్ రెస్టారెంట్‌లో అక్కడక్కడ వేసున్న టేబుల్స్‌లో ఓ దాని ముందు కూచుని, మాధురి కోసం ఎదురుచూస్తున్నాడు కౌషిక్.

పది, పదిహేను.... ఇరవై నిమిషాలు దాటుతున్నా మాధురి రాలేదు. పరిసరాలు చూస్తూ... అసహనంగా వచ్చేపోయే వాళ్ళని గమనిస్తున్న కౌషిక్‌కి "హాయ్" అన్న పిలుపు విన్పించగానే తల తిప్పాడు.

ఆశ్చర్యం అతని మొహంలో వెర్రినవ్వులా మెరిసి... మాయమైంది. ఎదురుగా రూప.

ఆమె దగ్గరకి రాగానే... "ఇక్కడి... కి... మీ.. రు?!" అన్నాడు ఆశ్చర్యంగా.

"సిక్స్త్ సెన్స్" అంది అతనికెదురుగా కూచుని.

"నైట్ శ్యామలన్ మూవీనా? ఎ.ఆర్. మురుగదాస్ మూవీనా?"

'యూ... నాటీ..." అందొకలా చూస్తూ.

"ఊఁ... హూ..." అన్నాడు బలిష్టమైన భుజాలెగరేస్తూ.

అతనలా భుజాలెగరెయ్యటాన్ని ఇష్టంగా చూస్తూ,

"ఉదయం నుండీ ఓ.పి.లో పేషంట్లని చూసీ.. చూసీ... పిచ్చెక్కింది."

"ఎర్రగడ్డ దగ్గర రెస్టారెంట్‌కి వెళ్ళాల్సింది" అన్నాడు.

"మీరు 'కూడా' వస్తానంటే... కల్దెళ్దాం"

"నాకింకా అంత పిచ్చెక్కలేదు లెండి... ఏంటిలా వచ్చారు?"

"చెప్పానుగా సిక్స్త్ సెన్సని".

"కానీ నేను మాత్రం మాధురి కోసం వచ్చాను".

"ఓహో!... " అందొకలా.

"ఏం తీసుకుంటారు.. కాఫీ... టీ... కానీ ఏదైనా మధూ వచ్చాకే"

"లేదు.. నేను వెళ్తాను. నాకు నిమ్స్‌లో పనుంది".

"ఎలాగూ వచ్చారుగా... మధూ ఇప్పుడొచ్చేస్తుంది. కూచోండి"

"తర్వాత కలుస్తాను. ప్లీజ్! వెళ్ళాలి" అని రూప లేచి వెళ్ళబోతుంటే...

"పర్లేదు కూచోండి. ఐదు నిమిషాల్లో నిమ్స్‌ని తీసుకెళ్ళి నాంపల్లికి మార్చరు" అనామె చెయ్యి పట్టుకుని ఆపుజేస్తుండటం, సరిగ్గా మాధురి అక్కడికి రావటం ఒకేసారి జరిగాయి.

మాధురిని చూసి "హాయ్" అంది రూప, కౌషిక్ చేతిని విడిపించుకుంటూ.

"హలో!" అంది అయిష్టాన్నంతా మొహంలో కనబరుస్తూ.

"మధూ! నాకు నిమ్స్‌లో పనుంది. వెళ్తున్నాను".

"ఎంతసేపయిందే... నువ్వొచ్చి..."

"రెండు నిమిషాలు.. మనతో కల్సి కాఫీ తాగెళ్ళమంటే.. వినకుండా వెళ్తానంటోంది చూడు"

అన్నాడు కౌషిక్.

మాధురి బలవంతపెట్టకుండానే కూచుంది రూప.

మాధురి కౌషిక్‌వైపు చురచురా చూసింది. మాధురినే గమనిస్తున్న రూప లోలోపల సంబరపడిపోతూ... రెచ్చిపోయి కౌషిక్‌తో మాట్లాడుతుంటే, ఎంతో ఆత్రంగా కౌషిక్‌తోనే మొదట పంచుకోవాలనుకున్న విషయాన్ని మాధురి తాత్కాలికంగా వాయిదా వేసుకుని, అయిష్టంగానే రూప జోక్స్‌ని భరిస్తూ కూచుంది.

కాఫీ తాగాక... "రా కౌషిక్! వెళ్దాం" అని రూప వైపు తిరిగి "పనుంది, వెళ్తున్నాం... తర్వాత కలుద్దాం" అని బదులు ఆశించకుండా బైటికి నడవటం, ఆమె వెనకే కౌషిక్ 'బై' చెప్పేసి వెళ్ళిపోవటం రూప అన్వయించుకోలేక పోయింది.

•••

"ఊ... చెప్పు... ఎక్కడికెళ్దాం.? ఏదో ముఖ్యమైన విషయం చెప్తానన్నావు! ఏంటది? ఇందాకట్నుంచీ టెన్షన్ టెన్షన్‌గా ఉంది. సస్పెన్స్‌తో లాగించకుండా మేటరు స్ట్రెయిట్‌గా చెప్పెయ్" అన్నాడు కౌషిక్ కారు డ్రైవ్ చేస్తూ.

మాధురి హ్యాండ్‌బ్యాగ్ నుండి లెటర్ తీసి కౌషిక్‌కి ఇచ్చింది.

"ఏంటది?"

"చూడు"

కారు సైడుకి తీసుకుని, లెటరు చదివి, గబాల్న మాధురి చేతుల్ని తనచేతుల్లోకి తీసుకుని గట్టిగా ముద్దుపెట్టు కున్నాడు. అతని కళ్ళలో రెండు ఆనంద బాష్పాలు...

నవ్వింది మాధురి.

"రియల్లీ యూఆర్ జీనియస్... ఎప్పుడు ఎగ్జామ్స్ రాశావు? ఎప్పుడు ప్రిపేరయ్యావు? సివిల్ సర్వీసెస్ అంటే మాటలా? అమ్మో!... అసలు నిన్ను అభినందించడానికి నాకు మాటలు రావటం లేదు. గ్రేట్... గ్రేట్".

"........... .............."

"ఇంట్లో అందరికీ తెలుసా?"

"ఎవ్వరికీ చెప్పలేదింకా. ముందు నీకే చెబుదామను కున్నాను."

"పద... ఏదైనా మంచి హోటల్‌కెళ్ళి సెలబ్రేట్ చేద్దాం.. రా!"

"బుద్దూ! ఇంకేదేదో ఇస్తావనుకుంటే... హోటళ్ళూ, తిండీ ఎందుకురా!" అని మనసులో అనుకుంది మాధురి.

**జరిగిన కథ**

పక్కపక్క ఇళ్ళల్లో స్థిరపడిన స్నేహితుల పిల్లలే కౌషిక్, మాధురి. అతను బీటెక్, ఆమె మెడిసిన్. ఇద్దరి మధ్యా లవ్‌ట్రాక్! కానీ మాధురి స్నేహితురాలు రూప కౌషిక్‌ను దక్కించుకోవాలని ప్లాన్ చేసి రంగంలోకి దిగుతుంది. వరద బాధితులకు వైద్య సహాయం చేసేందుకు వెళ్తుంది మాధురి. ఆపదలో ఉన్న గర్భిణీ పట్ల కలెక్టర్ అనుసరించిన తీరుకు కలత చెందుతుంది, తనే కలెక్టరవ్వాలని నిర్ణయించుకుంటుంది. ఐ.ఎ.ఎస్ కోచింగ్ తీసుకోవడం ప్రారంభించి, ప్రాథమిక పరీక్షల్లో విజేతగా నిలుస్తుంది. ఆ తర్వాత.....

"ఏమిటి? మాట్లాడవు?"

"ఎక్కడికీ వద్దు! ఇంటికెళ్దాం" అంది.

కౌషిక్ నిరాశగా కారు రోడ్డెక్కించి, మాధురి చేతిని తన చేతిలోకి తీసుకుని ముద్దుపెట్టి... "ఐ లవ్యూ మ్యాడ్రీ" అన్నాడు.

"అవన్నీ తర్వాత.. ముందు క్షేమంగా ఇంటికి చేర్చు" అంది.

తనచేత్తోబాటు, కౌషిక్ చేతిని తీసుకుని చెంపల కానించుకుని.."

"ఐ టూ రా! మొద్దూ!" అంది.

●●●

మాధురి సివిల్‌సర్వీసెస్ అకాడమీ ట్రైనింగ్ కోసం ముస్సోరిలో ఉన్న లాల్‌బహదూర్ శాస్త్రి అకాడమీకి వెళ్ళింది.

మాధురి గురించి ఇంట్లోవాళ్ళంతా... ముఖ్యంగా రాజశేఖరం ఇంటికి వచ్చిన వాళ్ళతో గొప్పగా చెప్తుంటే.. లలిత అబ్బురంగా చూసేది.

కౌషిక్ మల్టీనేషనల్ కంపెనీలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా చేరిపోయాడు. భాస్కర్రావు, రాజశేఖరంల కోర్టు కేసు వాయిదాల మీద వాయిదాలతో నల్లేరు నడక నడుస్తోంది.

●●●

"ఒరేయ్! రాజా! రాజశేఖరం... రాజా!" అంటూ భాస్కర్రావు ఉదయాన్నే వచ్చి పిలుస్తుంటే..

"ఏవిట్రా! ఇక్కడే ఉన్నా! రా! వచ్చి కూచో" అన్నాడు రాజశేఖరం పేపర్ చదువుతూ.

"మాధురి ఈ నెలలో వస్తోందటోయ్"

"అవును".

"అవున్రా! ఇప్పుడు మనం వెడ్డింగ్ కార్డ్స్‌లో డాక్టర్ మాధురి అని వేయించాలా, కలెక్టర్ మాధురి అనా, లేకపోతే, డాక్టర్, కలెక్టర్ మాధురి అని వేయించాలా.. లేకపోతే..."

"ఫోన్ చేసి తననే కనుక్కో..."

లలిత ఇద్దరికీ కాఫీ ఇస్తూ.... "ఎలాగూ వస్తోందిగా అన్నయ్యా!" అంది.

"ఇహ ఆలస్యం ఎందుకు? పెళ్ళిపనులు మొదలెట్టేద్దాం" అన్నాడు భాస్కర్రావు.

"మాధురి ఏమంటుందో.." అన్నాడు రాజశేఖరం.

"వద్దని మాత్రం అనదు" అని మాధురికి ఫోన్ చేశాడు భాస్కర్రావు.

"ఏంటంకుల్? పొద్దున్నే ఫోన్ చేశారు?"

"నీతో మాట్లాడాలన్పించింది... చేశాను".

"ఏంటి? షుగర్ లెవెల్స్ పెరిగాయా? లిమిటెడ్ గానే తింటున్నారా? స్వీట్లు ఎక్కువగా లాగిస్తున్నారా?"

"హు... ఫోన్లో కూడా పుడ్డు గొడవేనా?"

"ఊరికే అడిగాన్లే అంకుల్... చెప్పండి ఏమిటి విశేషాలు?"

"ఎప్పుడొస్తున్నావు? ఎన్ని రోజులుంటావు?"

"ఈ నెల పదిహేనుకి ఇంట్లో ఉంటా. పదిరోజులుంటాను. ఏంటి మేటరు?"

"ఏం లేదు మధూ! నా కోటా స్వీట్స్ నీకు దాచి పెట్టుంచాను".

"వావ్... ఇంకా ఏమిటి సంగతులు.. అందర్నీ అడిగినట్టు చెప్పండి. క్లాస్‌కి టైమవుతోంది.. ఉంటాను" అని ఫోన్ కట్ చేసింది.

ఫోనాఫ్ చేసిన భాస్కర్రావు మాధురి విషయం చెప్పగానే.

"పదిరోజుల్లో పెళ్ళి నిక్షేపంగా చెయ్యొచ్చు... ఇహ అందరం పెళ్ళిపన్లు చూద్దాం" అంది లలిత.

అక్కడే ఉన్న గోపాలకృష్ణయ్య "ఈ విషయం నాయికా, నాయకులకి తెలీకుండా సస్పెన్సుగా ఉంచాలర్రోయ్" అన్నాడు.

"ఇందులో రహస్యమేముందిరా! దాచడానికి" అని సుందర్రామయ్య అన్నాడు.

"వెళ్ళి దండోరా వేసిరారా!"

అందరూ ఘొల్లున నవ్వారు.

●●●

పెళ్ళిపనుల హడావిడి మొదలైంది. ఎవరికి వాళ్ళు మ్యూట్ బటన్ నొక్కిన టీవీలా సైలెంట్‌గా, బిజీబిజీగా ఉన్నారు. అందరికీ కళ్ళముందు కన్పిస్తున్నదొక్కటే... కౌషిక్, మాధురిల పెళ్ళి చిత్రం!

అదేం విచిత్రమో... ఆ విషయం తెలియనిదల్లా.. కాబోయే దంపతులకే.

కౌషిక్ ఉదయం ఆఫీసుకెళితే, రాత్రి ఎనిమిది తర్వాత ఇంటికి వస్తాడు. ఇంట్లో ఏదో హడావిడి మొదలైంది అనుకున్నాడు గానీ, అడిగే టైము అతనికీ, చెప్పేతీరిక ఇంట్లో వాళ్ళకీ లేదు.

తాతలిద్దరూ తాము ప్రతిపాదించిన కొత్త కాన్సెప్ట్‌ని అందరూ అమలు చేస్తుంటే... సంబరపడి పోతూ... కొత్త కొత్త కంప్యూటర్ గేమ్స్ ఆడటంలో మునిగి తేల్తున్నారు.

పెళ్ళి పనులతో సందడి సందడిగా ఉన్న తరుణంలో తుఫానులా వచ్చిపడ్డ ఓ దుర్ఘటన రెండు కుటుంబాల మధ్య ఎన్నో ఏళ్ళుగా పెనవేసుకున్న సంబంధ బాంధవ్యాల్ని సవాలు చేసే సునామిలా పెను అలజడిని సృష్టిస్తుందని ఎవరూ ఊహించలేదు.

●●●

"ఓరేయ్! రాజా! పెళ్ళి పనులు ఎనభై శాతం పూర్తయినట్టే. ఇహ కౌషిక్, మాధురిలకు బట్టలు, నగలు తీసుకోవాలి. వెడ్డింగ్‌కార్డ్స్ పని కూడా పూర్తయింది" అన్నాడు భాస్కర్రావు.

"ఎంత సులువుగా అయిపోయాయో చూడరా! వెనకటి కాలంలో నెలల తరబడి పెళ్ళి పన్ల కోసం అల్లాడిపోయే వాళ్ళు ఇవ్వాళ... చేతిలో సెల్లు, జేబులో డబ్బూ ఉంటే గంటల్లో అయిపోతున్నాయి" అంటున్నాడు రాజశేఖరం... సరిగ్గా ఆ సమయంలో సుడిగాలిలా గోవిందు లోపలికి పరుగెత్తుకొచ్చి, ఆయాసంగా..

"అయ్‌గారూ... అయ్‌గారూ..." అన్నాడు.

"ఏంట్రా! ఏమైంది?" అడిగాడు రాజశేఖరం.

"అటు సూడండి"

అందరూ వాడు చూపించిన వైపు తిరిగారు. అధికార, ప్రతిపక్ష నాయకులు కలిసొస్తున్నట్టు ఆరుగురు ఆజానుబాహుల్లాంటి వ్యక్తులు లోపలికొస్తుంటే, మల్లేష్ యాదవ్ మనుషులేననుకుని భాస్కర్రావు, రాజశేఖరం అలర్టై లేచి నిలబడ్డారు. మిగిలిన వాళ్ళు వస్తున్న వాళ్ళని ఆశ్చర్యంగా చూస్తున్నారు. వాళ్ళు దగ్గరకొచ్చి,

"నమస్తే భాస్కరన్నా!" అన్నారు.

"మీ... రూ....!?!" ఆశ్చర్యంగా అడిగాడు భాస్కర్రావు.

"నా పేరు భానోజీరావు.. హన్మకొండ మాది".

"రండి! కూచోండి" అని, "రేయ్! గోవిందూ! కుర్చీలు తీసుకురా" అన్నాడు.

వాళ్ళు కూచున్నాక... "మీ...రూ... ఎవరు కావాలి?" అడిగాడు భాస్కర్రావు.

"అన్నా! చెప్తగద... నాపేరు భానోజీరావు. ఈడు మా రెండో తమ్మి శంకర్రావు. ఆడు మూడో తమ్మి రామారావు. ఆళ్ళిద్దరూ మా మేనమామ కొడుకులు లక్ష్మణ్, మల్లికార్జున్" అని పరిచయం చేసుకున్నారు.

"ఇంతకీ... మీ...రు?"

"రూప... మా రెండో తమ్మి రాజారావు బిడ్డ".

హమ్మయ్య... అర్థమైనట్టు... అప్పటివరకూ బిగుసుకుపోయి నిలబడ్డ కుటుంబ సభ్యుల్లో చిన్న చలనం వచ్చింది.

అందరికీ చల్లని మంచినీళ్ళు తెచ్చిచ్చాడు గోవిందు.

భానోజీ మాట్లాడుతూ... "కౌషిక్... అంటే ఎవరన్నా?" భాస్కర్రావుని అడిగాడు.

"మా అబ్బాయే... వాడితో ఏమైనా పనా?" భాస్కర్రావు అన్నాడు. కుటుంబ సభ్యులంతా మొహామొహాలు చూసుకున్నారు.

"మీ అబ్బాయి ఇంట్లలేడన్నా!" శంకర్రావు అడిగాడు.

"ఆఫీస్ కెళ్ళాడు".

"కౌషిక్‌తో పనేంటి?" అనుమానంగా అడిగాడు రాజశేఖరం.

"మా రూప గురించన్నా, ఆళ్ళిద్దరూ ఒకళ్ళనొకళ్ళు ఇష్టపడుతుండ్రంటన్నా" కుటుంబ సభ్యులందరి మొహాల్లో పంజాగుట్ట ఫ్లై ఓవర్ కూలి మీద పడ్డంత భయం అలుముకుంది.

"కౌషిక్, రూపని ఇష్టపడటమేంటి?" చిరాగ్గా అన్నాడు భాస్కర్రావు.

"మీకెవరు చెప్పారు?" రాజశేఖరం అడిగాడు.

"ఎవరోచెబితే మేమెందుకొస్తమన్న... మా రూపమ్మే చెప్పింది" అన్నాడు రామారావు.

"మా కెవరికీ ఈ విషయం తెలీదు. మా కౌషిక్ వచ్చాక.."

"ఫోన్జేసి అడగండ్రి" అన్నాడు భానోజీరావు.

"వాడు ఆఫీసు పనిమీద బెంగుళూరు వెళ్ళాడు. రావడానికి రెండ్రోజులవుతుంది."

"అట్లనే అన్నా! ఏం తొందర్లేదు. మా అన్నదమ్ములందరికీ మొగపోరళ్ళే. అందరి మధ్యల ఉన్నది రూపమ్మ ఒక్కతే ఆడబిడ్డన్నా. గందుకే అది పుట్టినంక, అడిగిందేదీ కాదనకుండా ఇస్తున్నం. మీరు మెల్లంగ మీ అబ్బాయితోని మాట్లాడి చెప్పండ్రి" అన్నాడు భానోజీ.

"అలాగే" అన్నాడు భాస్కర్రావు సీరియస్‌గా.

అంతలో శారద అందరికీ గంగతో టీ పంపింది.

"ఒద్దమ్మా! గతికితే.. అతకదంట్రూ... వస్తం" అని శంకర్రావు అన్నాడు.

"టీకి ఏం పర్లేదు... తీసుకోండి" అన్నాడు భాస్కర్రావు.

"మొహమాట పెడుతుండ్రన్నా" అని వాళ్ళ వాళ్ళవైపు తిరిగి తీసుకోమన్నట్టు చూశాడు భానోజీ.

**మాధురి కలెక్టర్ ట్రైనింగ్‌లో ఉంటే, కౌషిక్ ఐ.టి. జాబ్‌లో చేరాడు. ఇక రెండిళ్ళలో పెద్దలూ వాళ్ళిద్దరికీ పెళ్ళిసన్నాహాలు ప్రారంభించారు. ఓ రోజు వాళ్ళంతా పెళ్ళిపనుల చర్చల్లో ఉండగా, ఆరుగురు ఆజానుబాహుల్లాంటి వ్యక్తులు వచ్చారు. వాళ్ళంతా రూప బంధువులే. వాళ్ళు చెప్పింది వినగానే ఏదో పెద్ద ఫ్లైఓవర్ కూలి నెత్తిమీదపడినంత భయం అలముకుంది అక్కడ! ఇంతకూ వాళ్ళేం చెప్పారు?**

వాళ్ళంతా టీ తాగి, "వెళ్ళొస్తామని" చెప్పేస్తుంటే...

భాస్కర్రావు... "ఒక్క నిమిషం" అని గోవిందుతో..

"రేయ్! వాళ్ళు తెచ్చిన పండ్లబుట్ట వాళ్ళ కార్లో పెట్టరా!" అన్నాడు.

"ఏముందన్నా! పళ్ళేగా... ఉంచుండ్రి".

"మాట్లాడుకున్నాక తీసుకుంటే పద్ధతిగా ఉంటుంది" అన్నాడు.

"మంచిది... వస్తమన్నా!" అని వెళ్ళిపోయారు వాళ్ళు.

ఇంట్లో వాళ్ళంతా ఏం జరిగిందో అర్థం కానట్టు ఐదు నిమిషాల పాటు షాక్ కొట్టినట్టు తేరుకోలేకపోయారు.

"ఏమిట్రా! ఇది... ఒక సమస్య తీరుతోందనుకుంటే... మరో సమస్య చుట్టుముడుతోంది.." అన్నాడు భాస్కర్రావు.

"కౌషిక్‌ని రానియ్‌రా! మాట్లాడదాం" అన్నాడు రాజశేఖరం.

"నీకు రూప వాళ్ళ నాన్న రాజారావు తెల్సుగదరా! ఫోన్ చేసి కనుక్కోరా!" అన్నాడు.

"ఇప్పుడు ఏమని మాట్లాడమంటావు చెప్పరా! కౌషిక్‌ని రానీ... మాట్లాడాక చూద్దాం" అని రాజశేఖరం ముభావంగా లేచెళ్తుంటే... అవాక్కయ్యారంతా".

●●●

"రూపగారూ! వాటీజ్ దిస్ నాన్సెన్స్" అన్నాడు కౌషిక్ ఫోన్లో కోపంగా.

"నాన్సెన్సేంటి కౌషిక్?"

"తెలియనట్టు నటించకండి. నేను మిమ్మల్ని ఇష్టపడుతున్నట్టు మీతో చెప్పానా? మీ వాళ్ళని మా ఇంటికి పంపారట?"

"ఏముంది. నేను అమ్మాయి... మీరు అబ్బాయి.. అమ్మాయి కోసం అబ్బాయిని మా వాళ్ళొచ్చి అడగటంలో తప్పేముంది? అది సంప్రదాయం కదా!"

"తెలివిగా మాట్లాడుతున్నాననుకుంటున్నారా?"

"నేను అలా... అన్నానా? నేను మిమ్మల్ని ఇష్టపడుతున్నానని మా వాళ్ళకి చెప్పానంతే!"

"నేను మిమ్మల్ని ఇష్టపడటం లేదు"

"అది నాకనవసరం.. నాక్కావల్సింది మా వాళ్ళకి చెప్పా!"

"అది మీ ఇష్టం".

"నేనిష్టపడ్డదేనాడూ నాకు దక్కకుండా పోలేదు".

"ఏంటి... నరసింహ సినిమాలో నీలాంబరిని అనుకుంటున్నారా?"

"ఛీ! అంత చీప్‌గా సినిమాతో పోలుస్తారేంటి? అందనిదాన్ని గురించి ఆలోచించను. ఆశపడిన

దానిని అందుకోకుండా వదలను".

"ఎక్కువగా ఊహించుకుంటున్నారు. నా జీవితంలో మాధురికి తప్ప... మరొకరికి స్థానం లేదు".

"ఆమెకంటే నేనే ఎక్కువగా ప్రేమిస్తున్నాను".

"అది మీ పిచ్చితనం."

"అవును. ఒకళ్ళ ప్రేమ మరొకళ్ళకి పిచ్చితనంగానే ఉంటుంది. మీరు లేకుండా, మీరు కాకుండా మరొకర్ని నా పక్కన ఊహించుకోలేను. మరొకరితో జీవితాన్ని పంచుకోలేను. మీరు నాకు దక్కకపోతే.. పోతే కదా!"

కౌషిక్ ఫోన్ కట్ చేశాడు.

●●●

"అలాంటిదేం లేదు డాడీ! మాధురి ఫ్రెండుగానే రూప నాకు పరిచయం" అన్నాడు కౌషిక్.

"అనే ఇన్నాళ్ళూ మేమూ అనుకున్నాం. ఆ అమ్మాయి ఇక్కడికి వస్తున్నా, నవ్వుతూ, తుళ్ళుతూ మీరు మాట్లాడుకుంటున్నా చూసీచూడనట్టు ఊరుకున్నాం. కానీ ఇంత దూరం తెస్తావనుకోలేదు. వాళ్ళంత ఖచ్చితంగా చెబుతున్నారంటే.. కథ ఎంత దూరం నడిపించావో అర్థమవుతోంది.

"ఆ అమ్మాయి అలా అర్థం చేసుకోవటం నా తప్పా!" అప్పుడే... రాజశేఖరం వచ్చాడు.

"కౌషిక్... బెంగుళూరు నుండి ఎప్పుడొచ్చావు?" అన్నాడు.

"గంటైందంకుల్".

"ఏమిటి? తండ్రీకొడుకులిద్దరూ డీప్ డిస్కషన్‌లో ఉన్నట్టున్నారు?" అయితే నేను తర్వాతొస్తాను" అని బయల్దేర బోతుంటే...

"ఆగండంకుల్! చూడండి.. డాడీ నన్ను ఇంటరాగేట్ చేస్తున్నారు. రూప నన్నిష్టపడుతోందట.. వాళ్ళ వాళ్ళొచ్చి ఏదో అనెళ్ళారట. అందుకు నేను బాధ్యుణ్ణా?"

"అవును... ఆ విషయం తెలిసేగదా! వాళ్ళొచ్చుంటారు?"

"అంకుల్... మీరైనా డాడీకి చెప్పండి. నేను ఆ అమ్మాయిని ఇష్టపడటం లేదు. జస్ట్ ఫ్రెండ్.. నేను మాధురిని తప్ప.."

"నువ్వు మాధురి విషయం మర్చిపో.. నువ్వు నీకిష్టమొచ్చిన అమ్మాయిని నిరభ్యంతరంగా చేసుకోవచ్చు" అన్నాడు రాజశేఖరం.

ఆ మాటలకి నిర్ఘాంతపోయిన భాస్కర్రావు,

"ఒరేయ్! రాజా! ఏంట్రా... నువ్వంటోంది?" అన్నాడు.

"ఉన్నదే అంటున్నారా? జరగనిదాని గురించి మనం అనవసరంగా ఆశలు పెంచుకున్నాం. ఇవ్వాళ్టి జనరేషనంతా ఇలాగే తగలడిందిరా! ప్రేమ ఒకళ్ళతో, పెళ్ళి ఇంకొకళ్ళతో... మీసాలు ముదరకముందే ప్రేమలు, పార్కులు, క్లబ్బులు, పబ్బుల వెంట తిరగటం, అవసరాలు తీరాక మొహం చాటేసి ఆస్తి అంతస్తుల కోసం మరొకళ్ళని వెతుక్కుంటున్నారు. ఇలాంటి వాటిలో మన పిల్లలు ఎక్సెప్షన్ అనుకున్నాను. కాదని తేలిపోయింది. ద్వంద్వవైఖరితో మాధురి జీవితంతో ఆడుకోవద్దు. నిప్పులేనిదే పొగ రాదుగా. ముందే తెల్సింది గాబట్టి..."

"అంటే... నువ్వు వీణ్ణి అనుమానిస్తున్నావా?"

"అనుమానం అనే కంటే అవమానం అనరా! బాగుంటుంది. ఇవిగో చూడు" అని చేతిలో ఉన్న కవర్లో ఫోటోలు భాస్కర్రావు చేతిలో పెట్టాడు.

కౌషిక్ అర్థం గానట్టు చూస్తున్నాడు.

భాస్కర్రావు ఫోటోలు చూస్తున్నకొద్దీ, అతని మొహంలో రంగులు మారుతున్నాయి.

'కౌషిక్, రూప నోటికి కేకు అందిస్తున్నట్టు, రూప వేలికి ఉంగరం తొడుగుతున్నట్టు, కారులో కూచుని షేక్‌హ్యాండిస్తున్నట్టు, ఇంకా ఇద్దరూ క్లోజ్‌గా... ఉన్నవి... చూసి" కౌషిక్‌కి ఇచ్చాడు.

"చూడు... అందుకే వాళ్ళంత ధైర్యంగా రాగలిగారు" అన్నాడు కోపంగా. కౌషిక్ ఫోటోలు చూసి "సంథింగ్ రాంగ్ డాడీ! రూప కావాలనే గేమ్ ఆడుతోంది".

"గేమ్ ఆడుతోంది ఆ అమ్మాయి కాదు. అమ్మాయిల్ని మార్చే నువ్వు" కొట్టినట్టు అన్నాడు రాజశేఖరం.

"వాడ్డూ యూ మీన్ అంకుల్?" అంతే వేగంతో అన్నాడు కౌషిక్.

"షటప్... నన్నే క్వశ్చన్ చేస్తావురా? పెళ్ళికి ముందే నీ భాగోతం తెలిసింది. లేకపోతే రేపు పెళ్ళి పందిట్లో అందరి ముందూ తలొంచుకోవాల్సి వచ్చేది".

## మనమీదేనరోయ్!

సరసి








"రాజా! అనవసరంగా ఏదేదో ఊహించుకుని మాట్లాడకు. వీటిని బట్టే కౌశిక్ క్యారెక్టర్ని అంచనా వేస్తున్నావా?"

"నేను వేసేదేంట్రా? మాధురి మెడిసిన్‌లో చేరిన ప్పట్నుంచీ రూప వాళ్ళ నాన్న రాజారావు నాకు తెలుసు. మొన్న వాళ్ళంతా వచ్చి వెళ్ళగానే, నేను అతనితో మాట్లాడాను. అతను పంపినవే ఈ ఫోటోలు. ఇదీ అబద్ధం అంటావా?"

"అనటం కాదురా! నువ్వు తొందరపడి నిర్ణ యాలు తీసుకోవద్దు"

"ఇంత తెల్సాక కూడా తొందరపడకపోతే.. రేపు చేతులు కాలాక ఆకులు పట్టుకోవాల్సి వస్తుంది".

శారద కల్పించుకుని.. "అన్నయ్యా! చిన్నప్ప ట్నుంచీ వీడు మీకు తెల్సు. మీరా ఇలా మాట్లాడు తున్నారు".

"ఇన్నాళ్ళూ ఏదో అల్లరి చేస్తాడనుకునేవాణ్ణి. కానీ ఇలా అల్లరిపాలు చేస్తాడనుకోలేదు".

"ఒరేయ్ రాజా! తొందరపడి స్టేట్మెంట్లివ్వకురా. ఇప్పుడేం కొంపలు మునిగాయిరా! వాళ్ళేదో అనె ళ్ళారు. వీడు కాదంటున్నాడు. అసలా రూపని పిలి పించి కనుక్కుందాం. ఇంత దూరం వచ్చాక ఈ చిన్నకారణంతో క్యాన్సిల్ చేస్తాననటంలోనే నీ తొందరతనం తెలుస్తోంది. ఇన్నేళ్ళ మన అనుబం ధాన్ని నీ మాటలతో, చేతలతో పాడు చెయ్యకు. ఎందుకంటే ఈ రెండిళ్ళలో అందరివీ సున్నిత మనస్తత్వాలు! అందరికీ ఆప్యాయతలు పంచుకోవ టమేగానీ తెంచుకోవడం తెలియదు" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"అయిందా! మీరు చెప్పటం... నేను ఒక్కసారి నిర్ణయం తీసుకున్నానంటే వెనక్కి తీసుకోను. నిర్ణ యాలు తీసుకునే ముందు మరొకళ్ళు వేలెత్తి చూపకుండా జాగ్రత్త పడతాను. అసలు ఇప్పుడేం జరిగిందని మీరంతా తప్పుగా అనుకుంటున్నారు. కౌశిక్ ఇష్టపడుతున్న రూపతోనే వాడి పెళ్ళి జరి పిద్దాం. మాధురికి వేరే సంబంధం చూద్దాం" అన్నాడు లేచెళ్తూ.

రాజశేఖరం వెళ్తున్న వైపే.. అవాక్కయి చూస్తూ కూచున్నారంతా.

"డాడీ! బిలీవ్ మీ! మీరు నన్ను అనుమానించ కండి" అన్నాడు కౌశిక్.

"నువ్వేం చెప్పొద్దురా! లీవ్ మీ ఎలోన్"

కౌశిక్ మౌనంగా వెళ్ళిపోయాడు.

శారద భర్త పక్కన కూచుని...

"మీరు కూడా ఏంటండీ! ఆయన అర్థం, పర్థం లేకుండా మాట్లాడినంత మాత్రాన, కౌశిక్ చెప్తు న్నది నమ్మకూడదని ఉందా? వాడు అందరితోనూ జోవియల్‌గా ఉంటాడు. అంతమాత్రాన నిజాని జాలు తెలుసుకోకుండా వాడినీ, వాడి క్యారెక్టర్నీ ఆయనలా అనుమానించకండి. వాడు చెప్పేది మనమే వినకపోతే... ఎవరితో చెప్పుకుంటాడు?" అంది కళ్ళొత్తుకుంటూ.

"ఇన్నేళ్ళ అనుబంధాన్ని ఎలా అవమానించెళ్తు న్నాడో చూశావా? కౌశిక్ గురించి నీకు తెలుసు, నాకు తెలుసు, వాడికీ తెలుసు! కానీ తెలుసుకోవా ల్సిన తెలిసిన మాధురి ఇప్పుడిక్కడ లేదు. వాడు మనసులో ఏదో ఉంచుకుని, పైకి మరొకటి మాట్లాడు తున్నాడు" అన్నాడు ఆవేదనగా భాస్కర్రావు.

## చిన్న యాక్సిడెంటే!



రకుల్ ఈ మధ్య యాక్సిడెంట్‌లో గాయ పడిందన్న సమాచారం ఆమె అభిమానులతో పాటు, సినీ అభిమానులను బాగా కంగారు పెట్టింది. అయితే పెద్దగా గాయాలు కాలేదనీ, చిన్న యాక్సిడెంటేననీ, తను బాగానే ఉన్నాననీ రకుల్ ట్వీట్ పెట్టడంతో అభిమానుల ఆందో ళన సద్దుమణిగింది. వరుస షూటింగ్‌లతో బిజీగా ఉన్న రకుల్‌ని కాస్త జాగ్రత్తగా ఉండు అంటూ ఆమె అభిమానులు, సినీ జనాలు హెచ్చరిస్తున్నారు.

"కాఫీ తెస్తాను" అని శారద వెళ్ళింది. భాస్క ర్రావు ఒంటరిగా కూచుని ఆలోచిస్తున్నాడు.

•••

సుందర్రామయ్య, గోపాలకృష్ణయ్య లాన్‌లో బెంచీమీద కూచున్నారు.

"నేను చెప్పలేదట్రా! పట్టపగలు, పదిగంటల ప్పుడు ఇంటిముందు ఆ రూప మనవాణ్ణి వాటేసు కుందని... ఆరోజే అనుకున్నా ఇలా ఏదో కొంప ముంచుతుందని.. అనుకున్నంతా జరిగింది" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"నా కొడుక్కిప్పుడు అవకాశం దొరికింది గదా! అని రెచ్చిపోతున్నాడు. అసలు కౌశిక్‌గాడికి, మాధురికి పెళ్ళి జరగనిస్తాడంటావా?"

"ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా, అసలు నాయికా నాయకులు ఒక్కటైతే, హన్మకొండవాళ్ళు వందమందొచ్చినా, నీ కొడుకు మిలిట్రీ బలగాన్ని రప్పించినా... వాళ్ళిద్దరి పెళ్ళి నిశ్చింతగా జరుగు తుందిరా!"

"ఎలా రా!" అన్నాడు సుందర్రామయ్య.

"నీ అనుభవం అంతా ఎక్కడ తగలెట్టావు. నువ్వు ముందా? నీ కొడుకు ముందా? ఇచ్చిన మాట కోసం తలలు పగలగొట్టించుకుని మరీ ఆ రోజుల్లో పక్కింటి నాగేశ్వర్రావుకి, ఎదురింటి మేరీబాయికి పెళ్ళి జరిపించిన చరిత్రరా మనది. మర్చిపొయ్యావా? ఇవ్వాళ మనపిల్లల పెళ్ళిరా ఇది. మన అనుభవం ముందు నీ కొడుకు పంతం ఏ మాత్రం నెగ్గు తుందో చూద్దాం" నొక్కిపలికాడు గోపాలకృష్ణయ్య.

"ఆ రోజులు వేరురా!"

"రోజులెప్పుడూ ఒకేలా ఉన్నాయిరా! మనుషు ల్లోనే మార్పు".

"అయితే.. ఏం చేద్దామంటావు?"

"రా! చెబుతా!" అని గోపాలకృష్ణయ్య, సుందర్రా మయ్యని వెంటబెట్టుకుని గుడికి బయల్దేరాడు.

•••

ఉత్తరాంచల్.... హిమాలయ పర్వత పాద భాగంలో, మారుమూల హిల్‌స్టేషన్ "ముస్సోరి". దీనిని 'క్వీన్ ఆఫ్ హిల్స్'గా పిలుస్తారు. సముద్ర మట్టానికి 2500 మీటర్ల ఎత్తులో, ప్రకృతి అందాలతో ఈ పట్టణంలో 'లాల్‌బహదూర్‌శాస్త్రి నేషనల్ అడ్మి నిస్ట్రేషన్ అకాడమీ ఉంది. ఇక్కడ సివిల్ సర్వీ సెస్‌లో సెలక్టయిన వాళ్ళకి శిక్షణ ఇస్తారు.

ఆ రోజు ఆఫీసర్స్ క్లబ్ ఛైర్మన్ ఎలక్షన్లలో పోటీచేసి ఎన్నికైన శ్రీకాంత్‌ని కొలీగ్స్ అందరూ అభినందిస్తున్నారు. ట్రైనీల తరపున అకాడమీ మేనేజ్‌మెంట్‌తో తల పడుతుండటమే కాక, కల్చరల్ ప్రోగ్రామ్స్ నిర్వ హించటంలోను చొరవ చూపి, అన్నిటికీ 'నేనున్నా' నంటూ ముందుండే శ్రీకాంత్ గెలుపు బ్యాచ్‌మేట్లం దరికీ సంతోషాన్నిచ్చింది. ఆ అభినందన కార్యక్ర మాన్ని మాధురి గెట్ టు గెదర్‌లా నిర్వహిస్తోంది.

సరదా సరదాగా నడుస్తున్న ఆ కార్యక్రమంలో... మాధురి మాట్లాడుతోంది. సరిగ్గా ఆ సమయంలో ఆమె ఫోన్ మోగింది. కట్ చేసింది. మళ్ళీ మోగింది.

"ఎక్స్‌క్యూజ్‌మీ" అని నంబరుచూసి... "కౌశిక్... పది నిమిషాల్లో నేనే చేస్తాను" అని ఫోన్ పెట్టేసి మైక్ ముందుకొచ్చింది.

"ఓకే.." అంటూ మాట్లాడుతున్న మాధురి పది నిమిషాల సంగతి మర్చిపోయి, 45 నిమిషాలు మాట్లాడింది.

మాధురి ఫోను మళ్ళీ మోగింది.

"సారీ! కౌశిక్... చిన్న ఫంక్షన్లో ఉన్నాను. ఎలా ఉన్నావు?"

"ఎంతసేపట్లో ఫ్రీ అవుతావు?"

"ఊ... ఇంకో అరగంట"

"అయితే తర్వాత కాల్ చేస్తాను"

"ఏంటి? ఏదైనా అర్జంటుగా మాట్లాడాలా?" అంది.

"సస్పెన్స్ అండ్ సర్‌ప్రైజ్"

"ఏంటో త్వరగా చెప్పు.. టెన్షన్ తట్టుకోలేను".

"అరగంటే కదా! మ్యాడీ! క్యారీ ఆన్" ఫోన్ కట్ట యింది.

**(ఇంకా వుంది)**

# చదివి పరుగెడితే మెమొరీ గెయిన్!

పరీక్షలంటే భయంగా ఉందా? పరీక్ష పేపరు చూడగానే చదివినవన్నీ మరిచిపోతున్నామని బాధ పడుతున్నారా? డోంట్ వర్రీ! ఇక మీకు పరీక్ష భయమే అవసరం లేదు. ఎందుకంటే దానికో సరికొత్త చిట్కా వచ్చింది.

చక్కగా చదువుకోండి. ఆనక పరుగెత్తండి. ఇక చూస్కోండి నా సామిరంగా! చదివింది బ్రహ్మాండంగా ఒంటబడుతుందంటున్నారు అధ్యయనవేత్తలు. చదువుకున్న తర్వాత వీడియోగేమ్స్ ఆడుకోవడం కంటే కూడా రన్నింగ్ చేస్తే చదువుకున్నది బాగా గుర్తుంటుందట! దీనికి కారణం మాత్రం ఇంత వరకు తెలియకపోయినాగానీ, ఇదేదో స్ట్రెస్ హార్మోన్ కార్టిసోల్‌కు సంబంధించిన వ్యవహారంగా కనిపిస్తోందని మాత్రం చెబుతున్నారు.

పరీక్షల సమయంలో చాలామంది పాఠ్యాంశాలన్నీ చదువుతారుగానీ, మెమొరీ ఉండదు. దీనికి



విరుగుడుగా, మనసుకు నచ్చినంతసేపు ఏకాగ్రతగా చదువుకున్న తర్వాత రన్నింగ్‌కి వెళ్ళమంటున్నారు. దీనివల్ల చదివింది మెమొరీలో నిలబడిపోతుందట. అప్పర్ ఆస్ట్రేలియాలోని అప్లైడ్ సైన్సెస్ యూనివర్సిటీ పరిశోధకుల సరికొత్త అధ్యయనంలో ఈ విషయం వెల్లడైంది. ఐతే చదువుకున్న తర్వాత చేసే వ్యాయామం మితంగా ఉండాలనీ, మరీ ఉదయం ఆరు గంటలకు చేసే భారీ వ్యాయామం తరహాలో ఉండకూడదనీ చెబుతున్నారు.

16 నుండి 29 ఏళ్ళ మధ్యవయసుగల 60 మంది యువతీ యువకులను మూడు బృందాలుగా విభజించి కొందరిని మోడరేట్ రన్నింగ్‌కి పంపారు. మరికొందరిని కంప్యూటర్‌గేమ్స్ ఆడించారు. కొందరిని చదవడానికి ముందు రన్నింగ్‌కి పంపించారు. ఈ ముగ్గురినీ పరీక్షించి వారి మెమొరీ కేలిబర్‌ను అంచనావేశారు. 'కొంత సమయం చదివి మోడరేట్ రన్నింగ్ చేసిన వారు' మెమొరీని కాపాడుకోవడంలో ది బెస్ట్‌గా నిలిచినట్టు గుర్తించారు. వీరికి జర్మన్-తుర్కిష్ జంట పదాలను ఇచ్చి గుర్తుపెట్టుకోమన్నారు. రన్నింగ్ తర్వాత, కంప్యూటర్ గేమ్స్ తర్వాత వాటిని రిపీట్‌చేసే పరీక్ష పెట్టి ది బెస్ట్‌ను గుర్తించి ఈ నిర్ధారణలకు వచ్చారు. ఐతే లెర్నింగ్ ఎఫెక్ట్స్‌ను మెరుగుపరిచేందుకు వీడియో గేమ్స్ అంతగా దోహదం చేయలేదని అధ్యయనం లీడ్ ఆథర్ హెరాల్డ్ కిండర్‌మాన్ వెల్లడించారు.

నవ్య






**పాపాఘ్ని కథలు**
**డాక్టర్ వేంపల్లి గంగాధర్**
ధర: 110 రూపాయలు,
**పేజీలు:** 152
**ప్రచురణ:** నవచేతన, విశాలాంధ్ర బుక్‌హౌస్‌లు

రాష్ట్రపతి భవన్‌లో విశిష్ట ఆతిథ్యం (2014) అందుకున్న తొలి భారతీయ సాహిత్యవేత్త డా.గంగాధర్. కేంద్ర సాహిత్య అకాడమీ మొదటి యువ పురస్కార గ్రహీత, పల్లె జీవనం తెలిసిన రచయిత. ఇందులోని 30 కథలు నిన్నటి, రేపటి రాయలసీమ బతుకుచిత్రాన్ని, అట్టడుగున దాగివున్న చీకటి కోణాలను ఆవిష్కరిస్తాయి. పలు పత్రికల్లో ముద్రితమైన కాలం కథల నుంచి ఎంపిక చేసిన లఘు కథలు ఇవన్నీ.

---

**రాయలసీమ జానపద హాస్య కథలు**
**డాక్టర్ ఎం.హరికిషన్**
ధర: 110 రూపాయలు,
**పేజీలు:** 108
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన బుక్‌హౌస్ బ్రాంచీలు

బాలసాహిత్యంలో నూతన ఒరవడికి కృషి చేస్తున్న ప్రముఖ రచయిత హరికిషన్. బాలలకోసం ఎన్నో పుస్తకాలు వెలువరించారు. రాయలసీమ మారుమూల గ్రామాలలో ఉన్న జానపద హాస్య కథలను సేకరించి, సవరించి వాటికి మెరుగులు దిద్ది అందించిన 30 కథలు ఇవన్నీ.



---



**కొప్పుల వారి కతలూ... కబుర్లూ-2**
**డాక్టర్ కొప్పుల హేమాద్రి**
ధర: 200 రూపాయలు,
**పేజీలు:** 112
**ప్రతులకు:** రచయిత, బి-17, సామ్రాట్ అపార్ట్‌మెంట్స్, శ్రీనగర్ కాలనీ, రింగ్‌రోడ్, విజయవాడ-08
ఫోన్ 9848296865

చెట్టు మనందరికీ అమ్మ! వాటిలో ఆరోగ్య రహస్యాలెన్నో ఉన్నాయి. ఇలాంటి వృక్షశాస్త్రం గురించి ఓపిగ్గా, ఆసక్తికరంగా చదివించే రచయిత డాక్టర్ హేమాద్రి. అడవుల్లో ఆయన అన్వేషణ, అనుభవాలు, పరిశోధనా ఫలితాలు, ఓషధీప్రస్థానంతో పాటు వాటి సమన్వయ విశేషాలే ఇవన్నీ. ఈ పుస్తకం మొదటి భాగానికి ఇప్పటికే అనూహ్య స్పందన లభించింది.

---

**పక్షుల సభ**
**మూలం: ఫరీద్-ఉద్-దిన్-అత్తర్**
**అనువాదం: డా.లంకా శివరామప్రసాద్**
ధర: 200 రూపాయలు
**పేజీలు:** 168
**ప్రతులకు:** ప్రముఖ పుస్తక కేంద్రాలు

839 యేళ్ళ క్రితం పర్షియన్ ముస్లింకవి, సూఫీ వేదాంతి రాసిన కావ్యమిది. పర్షియన్ సాహిత్యంలో ప్రసిద్ధిగాంచిన ఈ కావ్యాన్ని మనకు అందించారు ప్రముఖ అనువాద రచయిత డా.శివరామప్రసాద్. ఆయన వెలువరిస్తున్న ప్రపంచ సాహిత్యం సిరీస్‌లో ఇది 27వది.



---



**విదేశగమనే**
**కథా సంకలనం**
**తాడికొండ కె.శివకుమారశర్మ**
ధర: 150 రూపాయలు,
**పేజీలు:** 212
**ప్రతులకు:**అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

అమెరికాలో స్థిరపడిన తెలుగువారు రాస్తున్న కథలు తెలుగు ప్రవాసజీవితాన్ని అద్భుతంగా ఆవిష్కరిస్తున్నాయి. అలాంటి కథలకు గుర్తింపు తెచ్చిన కథకుల్లో ఒకరు శివకుమారశర్మ. గడచిన పన్నెండు సంవత్సరాలలో వెలువడిన ఆయన ఇరవై కథల సంపుటం ఇది. వలస జీవితాల్లో ఒడిదుడుకులూ, గజిబిజి మనస్తత్వం, మానసిక సంఘర్షణలను ఆవిష్కరించిన కథలివి.

**-లలితా త్రిపుర సుందరి**

# భూమాత

**పొత్తూరు రాజేంద్రప్రసాద్ వర్మ**

**పాంచజన్య మనసెంతో ఉద్వేగంగా ఉంది.**

**ఎంత తొందరగా బస్సు పద్మనాభం చేరుతుందా అని ఆత్రుతపడుతున్నాడు.**

**అమెరికానుంచి విమానంలో రావడం, ఢిల్లీనుంచి రైల్లో ప్రయాణించడం, విజయనగరంనుంచి బస్సులో బయలు దేరడం అంతా ఏదో కలలా ఉంది. దాదాపు ఇరవై ఏళ్ళ తర్వాత మాతృదేశం రావడం, తాను పుట్టిపెరిగిన ప్రాంతాలు చూడాలనుకోవడం అతనికి ఎంతో ఆనందంగా ఉంది.**

పదేళ్ళ క్రితం ఆనందపురంలో తను కొన్న భూమిని చూసుకోవాలన్నది కూడా ఒక ఆలోచన. చాలా కాలంగా భారతదేశం రావాలని అనుకుంటున్నా ఉద్యోగ బాధ్యతలవల్ల కుదరలేదు. చిన్నతనంలో నాటి రోజులు బాల్యం గడిపిన పద్మనాభం గ్రామాన్ని దాటుకుని ఆనందపురం వెళ్ళాలి. అందుకని ముందు పద్మనాభం చూడాలనే అనుకున్నాడు.



విజయనగరం నుంచి సింహాచలం వెళ్ళేబస్సులో కిటికీ పక్కన సీటు దొరికింది.

బస్సులోంచి వెనక్కి కదులుతూ వెళ్ళిపోతున్న ప్రాంతాలను చూస్తుంటే అభివృద్ధి ఇంత ఎక్కువగా జరిగిపోయిందా అనిపించింది. పక్కన కూర్చున్నవ్యక్తి టిక్కెట్టుకోసం ఐదు వందల రూపాయలనోటు తీసి ఇచ్చాడు. కండక్టరు చిల్లర లేదంటూ ముందుకు కదిలిపోయాడు.

"చిల్లర పెద్ద సమస్య అయిపోయింది మాస్టారూ.." అన్నాడు ఆ వ్యక్తి.

పాంచజన్య నవ్వి ఊరుకున్నాడు.

కండక్టరు తిరిగివచ్చి... "పదిరూపాయల కోసం చిల్లర ఎలా తేగలం చెప్పండి" అన్నాడు. పాంచజన్య జేబులోంచి పర్సు తీసి.. "టిక్కెట్టు ఇవ్వండి" అంటూ ఇరవై రూపాయలు ఇచ్చాడు. కండక్టరు అందుకుని ఆ వ్యక్తికి టిక్కెట్టు ఇచ్చాడు.

"మీరిచ్చారా మాస్టారూ... దిగిన తర్వాత చిల్లర మార్చి ఇచ్చేస్తాను లెండి.. మీరుకూడా పద్మనాభమే కదా.." అన్నాడు.

"అవును... నాదీ పద్మనాభమే.."

ఆవ్యక్తి విస్మయంతో చూస్తూ... "నేను అక్కడే పుట్టి పెరిగాను. మిమ్మల్ని ఎప్పుడూ చూడలేదే... ఎవరి తాలూకా... ఎవరైనా బంధువులున్నారా.." ప్రశ్నించాడు.

"పద్మనాభం మా ఊరుకాదు. నా చిన్నతనంలో కొంత కాలం అక్కడ ఉన్నాం. మా నాన్నగారు రామచంద్రరాజు. వీడిఓగా పనిచేసేవారు.."

"మీరు రాజుగారి అబ్బాయా..." తెలిసిన వ్యక్తిలా చాలా విషయాలు చెప్పడం మొదలుపెట్టాడు" అప్పటిరోజులే వేరులెండి. ఎక్కడినుంచి వస్తున్నారు. ఏమి చేస్తున్నారు?" పద్మనాభం బాగా మారిపోయిందిలెండి. గుడి మాత్రమే అలా ఉంది".

"చాలాకాలంగా అమెరికాలో ఉద్యోగం చేస్తున్నాను. ఆ మధ్య నా స్నేహితుడు పదెకరాల పంటభూమి నాతో కొనిపించాడు. నెట్‌లో ఆ ఫొటోలు మాత్రం చూశాను. ఢిల్లీలో సెమినార్‌కి వచ్చాను. ఇక్కడికొచ్చి చాలా సంవత్సరాలైనందువల్ల పద్మనాభం చూడాలనిపించింది. దాంతోబాటు ఆనందపురంలో నా పొలంకూడా చూసినట్లు ఉంటుందని వస్తున్నాను".

బస్సు రెడ్డిపల్లి వచ్చింది.

"ఇక్కడ పొగాకు వ్యాపారం బాగా జరిగేది. చాలామంది కమ్మరేకు టపాసులు తయారుచేసేవారు. దీపావళి వచ్చిందంటే కొనుక్కోడానికి ఇక్కడికే వచ్చేవాళ్ళం".

"ఇప్పుడా పరిస్థితి లేదు. ఆ వ్యాపారాలు ఎవరూ చేయడం లేదు. కష్టపడటం తగ్గిపోయింది" అన్నాడు ఆ వ్యక్తి.

పద్మనాభంలో బస్సు ఆగింది.

●●●

బ్యాగ్ తీసుకుని గబగబా దిగాడు పాంచజన్య.

చుట్టూ చూశాడు. ఒకప్పుడు పెద్ద మర్రిచెట్టు దానికింద ఒక కిళ్ళీబడ్డీ మాత్రం ఉండేది. ఇప్పుడు చుట్టూ షాపులు, రెండు హోటళ్ళు, మెకానిక్ షెడ్డులు.. ఎంతో అభివృద్ధి చెందింది. తెలిసిన

మొహం ఒక్కటైనా కనిపిస్తోందేమోనని తేరిపార చూశాడు పాంచజన్య. ఎవరూ కనిపించలేదు.

ఇంతలో బస్సులో తనపక్కన కూర్చున్నవ్యక్తి అక్కడున్న షాపులోకెళ్ళి ఇరవైరూపాయలు తీసుకు వచ్చి పాంచజన్య చేతిలో పెట్టాడు.

"అబ్బే ఎందుకులెండి'

"మీ డబ్బులు నాకెందుకు? ఇప్పుడందరూ స్థోమతుపరులే.. భూములకు రేట్లువచ్చి చాలా మంది బాగుపడ్డారు.."

"ఊరు చూసుకుని ఆనందపురం వెళతాను" అంటూ బ్యాగ్ భుజానికి తగిలించుకుని పాంచజన్య ముందుకు కదిలాడు.

●●●

పద్మనాభం అంటే పాంచజన్యకు ఎంతోఇష్టం. చిన్న కుగ్రామంగా ఉండేది.

పక్కనే గోస్తనీ నది చిన్నపాయలా ప్రవహించేది. అందులో ఈతలు కొట్టడం... ఇసుకతిన్నెల్లో ఆటలు ఆడటం అతనిమదిలో ఎన్నో మధురమైన జ్ఞాపకాలు ఉన్నాయి. ఇప్పుడా ప్రదేశమంతా మారిపోయింది. నది మీద చిన్నవంతెన కట్టారు. ఇసుక అంతా మాయం అయిపోయింది. అక్కడివాళ్ళని అడిగితే లారీలు ట్రాక్టర్లతో ఎప్పటికప్పుడు తరలించుకుని పోతుంటారని రాజకీయ నాయకులే దీనికి ఆద్యులని చెప్పడంతో ఆశ్చర్యపోయాడు.

నదిని ఆనుకుని తోటలు, పొలాలు ఎన్నో ఉండేవి. ఇప్పుడు అక్కడంతా బీడు భూములు మాత్రమే ఉన్నాయి. ఎవరో వ్యక్తులు పరిశ్రమల కోసం కొనుగోలు చేశారని చెప్పారు.

●●●

చిన్నతనంలో గుడిలో బేడా ఎక్కి ఆడుకోవడం, పూజారి ఇచ్చే ప్రసాదంకోసం ఎదురు చూడటం గొప్పగా ఉండేది. ఉదయంపూట పూజారి వినిపించే సుప్రభాతం ఎంతో ఆహ్లాదంగా ఉండేది. ఇప్పుడు అటువంటిది ఏదీ లేదని మైకుసెట్టులో పాటలు మాత్రం వినిపిస్తున్నారని తెలిసి ఎంతో బాధపడ్డాడు పాంచజన్య.

తెల్లవారుజామున విజయనగరం నుంచి ఎడ్ల బళ్ళు సామాన్లు తీసుకుని వచ్చేవి. వరుసగా పది పదిహేను బళ్ళు రాత్రి బయలుదేరి ఏ తెల్లవారు జామునో పద్మనాభం మీదుగా మద్ది, గంధవరం గ్రామాలకు వెళ్ళేవి. ఎద్దుల మెడలో గంటల శబ్దాలు లయబద్ధంగా వినిపించేవి. నిద్రలో వినిపించే ఈ శబ్దాలు ఎంతో ఫాసినేటింగ్‌గా అనిపించేవి. వాటి గురించి ఆరా తీస్తే... "ఇప్పుడు ఎడ్ల బళ్ళు ఎందుకు బాబూ... ఎక్కడ చూసినా ఆటోలు ఉన్నాయి కదా" అన్నారు.

ఈ మాటలు విన్న తర్వాత పాంచజన్య మనసు వికలమైపోయింది. మనుషుల జీవితాల్లో మార్పు ఇంతలా ఉంటుందా అనిపించింది.

చాలా సంవత్సరాలు అమెరికాలో ఉండటం ఇక్కడ విషయాలు తెలియకపోవడంవల్ల మార్పు జీర్ణించుకోలేక పోతున్నాడు. తన ఊహల్లోఉన్న పద్మనాభానికి ఇప్పటికీ ఎన్నో వందలరెట్లు మార్పు కనిపించింది.

భూముల విలువ పెరిగిపోవడం, ఆర్థిక మాంద్యం తీసుకొచ్చిన ప్రభావం ఎక్కడో అమెరికాలో ఉన్న తన ఊహకు కూడా అందకపోవడం ఆశ్చర్యం అనిపించింది.

ఆనందపురంలో ఉన్న ఫ్రెండుకి ఫోను చేశాడు.

"నీ ఫోను కోసమే చూస్తున్నాను. ఎక్కడున్నావు? కారు తీసుకు వస్తాను" అన్నాడు.

పాంచజన్య పద్మనాభంలో తాను ఎక్కడున్నాడో చెప్పాడు.

అరగంటలో కారు అక్కడికి వచ్చింది.

●●●

పద్మనాభం నుంచి కారులో బయల్దేరి ఆనందపురం వెళుతుండగా రోడ్డుపక్క భూములన్నీ ఖాళీగా కనిపించాయి. చాలా భూములు లే అవుట్లుగా మారిపోయాయి. కొన్ని భూములకు బోర్డులు కూడా ఉన్నాయి. పాంచజన్య వాటిని ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు. పాంచజన్యని గమనించి

**చాలా ఏళ్ళ తర్వాత పరాయిదేశం నుండి తాను పుట్టిపెరిగిన పరిసరాలు చూసుకోవడానికి వచ్చాడతను. విదేశంలో ఉన్నప్పుడే స్నేహితునిద్వారా గ్రామంలో భూమి కొనుగోలు చేశాడు. ఇప్పుడు ఢిల్లీలో పనిపూర్తయ్యాక స్వగ్రామానికి బయలుదేరి బాల్యానుభూతులు నెమరేసుకుంటూ వచ్చాడు. గ్రామంలో అభివృద్ధి చూసి అబ్బురపడ్డాడు. తను కొన్న పంటభూమినీ చూసుకున్నాడు. కానీ ఎలా ఫీలయ్యాడతను?**

"ఇలా ఖాళీగా ఉండిపోయిన భూములన్నీ నీలాంటి ఎన్.ఆర్.ఐ.లు కొన్నవే" అన్నాడు. తర్వాత నెమ్మదిగా "నువ్వుకొన్న భూమికి మంచిరేటు వచ్చింది. ఆ రోజు నువ్వు ఎకరం పదిలక్షలకు కొన్నావు. ఇపుడు కోటి రూపాయలైపోయింది".

"ఈ భూములు అమ్మినవారు ఏమయ్యారు".

"ఒకప్పుడు ఎందుకూ పనికిరాని భూములకు ఇప్పుడు మంచిరేటు వచ్చింది. భూములు అమ్ముకున్నవారు పక్కా ఇళ్ళు కట్టుకున్నారు. హాయిగా ఉన్నారు".

"వ్యవసాయం చేయడం లేదా?"

"వ్యవసాయం ఎందుకు?... దండగ.. కష్టపడి పండిస్తే పెట్టుబడి కూడా రావడం లేదు".

కారు ఆనందపురం వెళ్ళే మలుపుతిరిగి జగ్గురాజుపాలెం అనే ఊరి దగ్గర ఆగింది.

పాంచజన్య "ఎందుకు" అన్నట్లు చూశాడు.

"ఇక్కడే నువ్వుకొన్న భూమి ఉంది" అంటూ ఆ ఫ్రెండు దిగాడు. పాంచజన్య కూడా కిందకు దిగాడు. ఎదురుగా ఖాళీగాఉన్న స్థలం చూపించి, "ఇదే మనభూమి" అన్నాడు.

పాంచజన్య తేరిపార చూశాడు. చుట్టూ కంచె వేసి ఉంది. ఓ మూల చిన్నపాక కూడా ఉంది. కారు ఆగడం చూసి అందులోంచి ఓ వ్యక్తి పరుగున అక్కడికి వచ్చాడు.

'అతనే వాచ్‌మన్' పరిచయం చేశాడు.

●●●

ఆ వ్యక్తి నమస్కారంచేసి "భూమి కొన్నప్పుడు కూడా తమరు రాలేదు. ఒకప్పుడు ఇక్కడ కంది, మొక్కజొన్న, వరి, వేరుశనగవంటి రకరకాల పంటలు పండేవి. ఇప్పుడు అంతా ఖాళీగానే ఉంది" అన్నాడు.

పచ్చగా కళకళలాడే భూమాతను అందరిలానే తాను కూడా బీడుభూమిగా మార్చేశాడా? అనుకున్నాడు పాంచజన్య. తాను ఈ భూమి కొనుగోలు చేయకపోతే వ్యవసాయం కొనసాగేదేమో! లేదా ఇక్కడున్నవాళ్ళల్లో ఎవరు కొనుక్కున్నాగానీ వారైనా వ్యవసాయం చేసి ఉండేవారేమో!

పాంచజన్య మనసులో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

"వ్యవసాయం చేయడానికి ఎక్కడా భూమి కూడాలేదు బాబూ. కొన్నవాళ్ళంతా ఆ భూమిని ఖాళీగా వదిలి వెళ్ళిపోతున్నారు" వాచ్‌మన్ అన్నాడు.

పాంచజన్య అమెరికా నుండి ఇక్కడికి బయలుదేరేటప్పుడు తనుకొన్న భూమిని చూసుకుని మురిసిపోవాలనుకున్నాడు. పచ్చనిపంట పొలాలతో ఉంటుందని అనుకున్నాడు. మంచిరేటు ఉంటే అమ్మి సొమ్ము తీసుకుపోదామనుకున్నాడు. ఆ విషయం స్నేహితునితో చూచాయగా చెప్పాడు కూడా. అతను రెండు పార్టీలను కూడా చూశానన్నాడు. ఇప్పుడు తన బీడుభూమిని చూసిన తర్వాత ఒక్కసారి మనసంతా ఆవేదనతో నిండిపోయింది. పద్మనాభంలో కలిగిన నిరాశ మరింత ఎక్కువైంది.

"పాంచజన్యా.. భూమి విషయం ఏమి చేద్దాం".

మిత్రుడి ప్రశ్నకు ఏమీ జవాబు చెప్పలేదు. ఏంచెప్పాలో కూడా తెలియలేదు. నాలుగుపక్కలకు వెళ్ళి పొలాన్ని ఫొటోలు తీశాడు.

"నాలుగు రోజులుంటావు కదా, ఏదో బేరం సెటిల్ చేద్దాం, లాభం బాగా వస్తుందిలే. మరో ఎన్.ఆర్.ఐ. పార్టీ రెడీగా ఉంది".

●●●

"భూమి ఎప్పుడూ పంటతో పచ్చగా కళకళలాడాలి. అప్పుడే అందం ఆనందం. ఈ భూమి అమ్మి వచ్చినసొమ్ముని ఏం చేసుకోవాలో కూడా నాకు తెలియడంలేదు. ఇక్కడికి వచ్చిన తర్వాత నా ఆలోచన మారిపోయింది" అన్నాడు పాంచజన్య.

అక్కడున్నవారు ఆశ్చర్యంగా పాంచజన్యవైపు చూశారు.

"తల్లి ఎప్పుడూ పిల్లల్నిపెంచి పెద్దచేయాలి. వారు పచ్చగా ఉన్నప్పుడే ఆమెకు ఆనందం. అదే విధంగా పచ్చని పంటలతో కళకళలాడుతూ ఉన్నప్పుడే భూమాత అనే పేరుకు సార్ధకత!. నా భూమి ఏమీలేని బీడుభూమిగా కాకుండా భూమాతగా ఉండాలి. ఈ పొలంలో పంటలు పండించాలి. పచ్చదనంతో తన భూమి కళకళలాడిపోవాలి. లాభాలు లేకపోయినా పర్వాలేదు. పెట్టుబడి వచ్చినా సరిపోతుంది. నిరుపయోగంగా ఉండటంకన్నా ఈ వాచ్‌మన్ లాంటి కొంతమంది రైతులున్నా ఈ భూమిపై బతకాలి..." పాంచజన్య దృఢంగా చెప్పాడు.

పక్కనున్న ఇద్దరూ విస్మయంతో చూస్తుండిపోయారు.

**సెల్:94903 00587**




**రామాజ్ఞను అనుసరించి సీతను అలంకరించి పల్లకీలో తోడుకుని వచ్చాడు విభీష ణుడు. ఆమెను చూసేందుకు వానరులంతా తహతహలాడారు. తొక్కిసలాడారు. భటులు వద్దని వారించినా వినలేదెవరూ. దానితో తప్పనిసరై కర్రలతో నెట్టాల్సి వచ్చింది. ఆ నెట్ట డంలో వానరులంతా ఒకరిపై ఒకరుపడి కల్లోలమయ్యారు. పెద్దగా అరిచారు. అది చూసి రాముడు కోపించాడు. పల్లకీలో కాదు, నడచి తనని సమీపించమని సీతను ఆజ్ఞాపించాడు రాముడు. సీత అలాగే చేసింది. 'నాథా' అని తలెత్తి రాముణ్ణి చూసింది. ఆగ్రహావేశాలు వెళ్ళ గక్కుతూ ఎర్రగా ఉన్న అతన్ని చూసి భయపడింది. లక్ష్మణ సుగ్రీవ హనుమాదులు కూడా రాముని ముఖాన్ని చూసి భయపడ్డారు. లేశమాత్రం కూడా ఆ ముఖంలో కరుణలేకపోవ డాన్ని తట్టుకోలేకపోయారు.**

# సీత అగ్నిప్రవేశం:బ్రహ్మాదిదేవతల స్తుతి

"సీతా" పిలిచాడు రాముడు. ఆ పిలుపునకు చేతుల్లో దాచుకున్న ముఖాన్ని ఎత్తి, రాముణ్ణి చూసింది సీత.

"మహావిక్రమంతో పోరాడి, పుత్రబంధుసైన్యాల సహా రావణుణ్ణి అంతం చేశాను. నిన్ను విడిపించాను. వచ్చిన అప్రతిష్ఠను తుడిచిపెట్టాను. ఇప్పుడు హాయిగా ఉంది. సాటిరాజుల్లో తల ఎత్తుకుని తిరగ గలననిపిస్తోంది." అన్నాడు రాముడు.

అవునన్నట్టుగా సన్నగా నవ్వుతూ తలాడించింది సీత.

"నిన్ను అపహరించిన రావణుని అంతు చూస్తా నని శపథం చేశాను. నా శపథాన్ని నేను నెరవేర్చు కున్నాను." అన్నాడు రాముడు.

నిజమే కదా! అన్నట్టుగా తల పంకించింది సీత.

"నేను లేని వేళ నిన్ను రావణుడు అపహరించిన దోషాన్ని ఉత్కృష్టమైన పురుషార్థంద్వారా తొల గించాను. నా వంశప్రతిష్ఠకు వన్నె తెచ్చాను. "

అవును! అందులో అనుమానం లేదన్నట్టుగా చేతులు జోడించి నమస్కరించింది సీత.

"హనుమ సాగరాన్ని దాటడం, లంకను గగ్గోలు పరచడం, రణాంగనంలో సుగ్రీవుని విక్రమం, సాటి వారనీకాక అన్న అనీ లేక ప్రాణాలకు తెగించి విభీ షణుడు పోరాడడం... అన్నీ ఫలించాయి. ఆఖరికి విజయులమయ్యాం." అన్నాడు రాముడు.

అందుకే నేను నిన్ను చేరుకోగలిగాను అన్నట్టుగా ఆనందంగా కళ్ళరమోడ్చింది సీత.

"అయితే ఈ యుద్ధం నేను నీకోసం చెయ్యలేదు." చెప్పాడు రాముడు. ఆ మాట పిడుగుపాటులా తోచింది. కళ్ళు విప్పార్చి చూసింది సీత.

"నిజం చెబుతున్నాను, ఇదంతా నా యశస్సునూ, నా వంశప్రతిష్ఠనూ పెంచుకోడానికే చేశాను. నీకోసం ఎంతమాత్రమూ కాదు." రెట్టించి చెప్పాడు రాముడు. హతాశురాలైంది సీత.

"నువ్వు రావణుని అంతఃపురంలో ఉన్నావు. బందీగా ఉన్నావు. నీ మీద నాకు అనుమానంగా ఉంది." అన్నాడు రాముడు. ఆ మాటకి దిగ్భ్రాంతి చెందింది సీత.

"పరులమందిరంలో ఏడాదిపాటు ఉన్న స్త్రీని అనుమానించకుండా ఎవరూ ఉండలేరు. అందు కని...." ఆగాడు రాముడు.

"అందుకని..." చీలిపోయిన గొంతుతో అడిగింది సీత.

"నీతో నాకు ఎలాంటి సంబంధమూ లేదు."

"స్వామీ" గగ్గోలుపెట్టింది సీత.

"నీ ఇష్టం. నీ ఇష్టం వచ్చిన చోట నువ్వు ఉండ వచ్చు, నేను అనుమతి ఇస్తున్నాను. బాగా ఆలోచిం చుకుని నిర్ణయం తీసుకో! భరతుని దగ్గర ఉంటావో, లక్ష్మణుని దగ్గర ఉంటావో, లేదంటే సుగ్రీవ, విభీష ణుల దగ్గర ఉంటావో అంతా నీ ఇష్టం. నీకు నచ్చిన వారి దగ్గర, నిన్ను మెచ్చినవారి దగ్గర నువ్వు ఉండ వచ్చు, నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు." అన్నాడు రాముడు.

అవాక్కయి చూడసాగింది సీత.

"నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నాను. నా నిర్ణయానికి తిరుగులేదు. దీని మీద వాదించి ప్రయోజనం లేదు." అన్నాడు రాముడు. సీతను చూడలేదు సరికదా, శూన్యంలోకి చూస్తూ నిలుచున్నాడు.

తనకోసం వానరుల్ని చేరదీశాడు. వాలిని చంపాడు. వారధి కట్టాడు. రావణుణ్ణి తుదముట్టించాడు. రమ్మని ఆహ్వానించాడు. వచ్చింది. దగ్గరగా నిలిచింది. తనని గుండెల్లోకి తీసుకుంటాడనుకున్నది. గట్టిగా కౌగిలించుకుంటాడనుకున్నది. లేదుకదా, నీ మీద నాకు అనుమానంగా ఉంది. ఇక నీకూ నాకూ ఎలాంటి సంబంధమూ లేదు, నీ ఇష్టం. నువ్వు ఎవరితో ఉంటావో ఉండు! ఎక్కడ ఉంటావో ఉండు అన్న రాముని మాటలు శూలాలై, బాణాలై బాధిస్తోంటే కన్నీరు పెట్టుకుంది సీత. కాల్వలు కట్టిన కన్నీటిని కొంగుతో తుడుచుకుంది. జాలిగా అన్నదిలా.

"స్వామీ! నువ్వు క్షత్రియపుత్రుడివి. ధర్మమూర్తివి. అయినా మామూలు మొరటు మనిషిలా మాట్లా డావు. అదే బాధగా ఉంది."

అయినా ఇటు తిరిగి సీతను చూడలేదు రాముడు.

"రామా! ఇటు చూడు! నేనయ్యా, నీ సీతను మాట్లాడుతున్నాను. నా మీదా నీకు అనుమానం? అయినా నీకెలా కలిగిందయ్యా ఆ అనుమానం? కలి గింది సరే, ఆ మాటను ఇప్పుడా చెప్పడం? చాలా తప్పుగా ప్రవర్తించావు. సీతగా నేనూ ఒక ఆడ దాన్నే! ఆడదాని మీద లేనిపోని అభాండాలు వేయడం నీకే కాదయ్యా, ఏ మగాడికీ ఎన్నడూ మంచిది కాదు." అన్నది సీత. పెద్దగా ఏడ్చింది.

కరగలేదు రాముడు. చూపు మరల్చలేదు.

"రామా! నా శీలంమీద ప్రమాణం చేసి చెప్తున్నాను, నువ్వు అనుమానిస్తున్నట్టుగా నేనేమీ నా శీలాన్ని కోల్పోలేదు. అణుమాత్రం కళంకం కూడా నన్నంట లేదు. రావణుడు నన్ను అపహరించినప్పుడు నేను స్పృహకోల్పోయాను. అది విధి వైచిత్రి. ఆ సమయంలో కూడా నా మనస్సు నా అధీనంలోనే ఉంది. నిన్నే స్మరించింది.

నేను అయోనిజనయ్యా! ఆ సంగతి కూడా మరచి మరీ నిందించావు. తప్పు. పెళ్ళినాటి ప్రమాణాలూ, నామీది నీ అనురాగాలూ ఏం చేశావయ్యా? ఎక్కడ గొంతునొక్కిపెట్టావు? అరణ్యవాసానికి నువ్వు రావ ద్దన్నా నీతో వచ్చాను. నీతో పాటు పడరాని పాట్లు పడ్డాను. పొరపాటున ఓ చిన్న కోరిక కోరి నిన్ను దూరం చేసుకున్నాను. అందుకు ఏడాదిపాటు లంకలో ఎన్నో బాధలు పడ్డాను. ఆ బాధలన్నీ ఎవరికోసం పడ్డానో తెలుసా? నీకోసం. నువ్వు వస్తావు, నన్ను చేరదీస్తావన్న ఆశతో పడ్డాను. చేరదీశావు. చేరదీసి చీకొట్టావు. బాధగా ఉందయ్యా! తట్టుకోలేకపోతున్నాను." అన్నది సీత. నిలువునా కుప్పకూలిపోయింది. కింద పడి, గుండెలుబాదుకుని రోదించింది.

అయినా రాముడు తల తిప్పి చూడలేదామెను.

"రామా! నాదో చిన్న ప్రశ్న. దానికి నువ్వు సమా ధానం చెప్పి తీరాలి. నామీద నీకు అనుమానం ఉంది. నీ అనుమానం నీది. నేను కాదనను. కాక పోతే అనుమానం ఉన్నవాడివి ఇంత కాలం దానిని ఎందుకు దాచిపెట్టావు? ఆనాడు నన్ను హనుమ వెదకడానికి వచ్చినప్పుడే ఈ మాటేదో చెప్పి ఉండా ల్సింది. చెప్పి ఉంటే నువ్విప్పుడు నన్నొదిలేశావు చూడు, ఇంత తేలిగ్గానే నా ప్రాణాన్ని నేను వదులు కునేదాన్ని. చచ్చిపోయి ఉండేదాన్ని. ఆనాడే నేను చచ్చిపోయి ఉంటే ఈనాడింత యుద్ధమూ, ఇన్ని కష్టాలూ నీకూ, నీ మిత్రులకూ వచ్చి ఉండేవి కావు."

**రాముడి పిలుపుతో తల ఎత్తి చూసింది సీత. రావణుడు నిన్ను అపహరించిన దోషాన్ని ఉత్కృష్టమైన పురుషార్థం ద్వారా తొలగించి నా వంశప్రతిష్ఠకు వన్నెతెచ్చాను, ఐతే ఈ యుద్ధం నీ కోసం చెయ్యలేదు, నీతో నాకు ఎలాంటి సంబంధం లేదు, అనుమతిస్తున్నాను, నీ ఇష్టం వచ్చినచోట నువ్వుండవచ్చు అన్నాడు రాముడు. ఆ మాటలు పిడుగుపాటులా తోచాయి సీతకు. అప్పుడు ఆమె ఎలా స్పందించింది?**



అయినా ఉలుకూ పలుకూ లేదు రాముడి నోటి వెంట.

దీర్ఘంగా నిట్టూర్చింది సీత. ఏదో నిర్ణయానికి వచ్చినట్టుగా బలాన్నంతా కూడదీసుకుంది. లేచి నిల్చుంది.

"నాకు ఒకటి అర్థమైంది. ఇప్పుడు ఈ పరిస్థితుల్లో నాకు మరణమే శరణం." అన్నది.

అయినా రామునిలో చలనం లేదు. అప్పుడు లక్ష్మణుణ్ణి చూసింది సీత. కళ్ళెర్రజేసుకుని రాముణ్ణి కోపంగా చూస్తున్నాడు లక్ష్మణుడు. అతన్ని సమీపించింది.

"నాయనా లక్ష్మణా! ఇంత నిందను మోస్తూ నేనిక బతకలేనయ్యా! దయచేసి చితిని రగుల్చు. నేనందులో ప్రవేశించి ఈ తనువు చాలిస్తాను. భర్త వదిలేసిన భార్యకు బతుకులేదని పదిమందికీ తెలియాలి" అన్నది సీత.

అగ్నిప్రవేశం చేస్తానంటున్నది భార్య. అయినా భర్తగా రాముడు పట్టించుకోవట్లేదు. ఎందుకింత నిర్దయ? ఏమైంది అన్నది అంతుపట్టక అక్కడ ఉన్న వారంతా దీనంగా చూడసాగారు. లక్ష్మణ, సుగ్రీవ, విభీషణ, హనుమ, జాంబవంతాది వీరులంతా ఒకరిని ఒకరు చూసుకుని, ఏమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలో తలలు దించుకుని నిల్చున్నారు. అందాలరాముడు అగ్నిహోత్రంలా రగలిపోతున్నాడు. భగభగ మండిపోతున్నాడు. అతనిని అప్పుడు చూసేందుకుగాని, దగ్గరగా వెళ్ళి అతన్ని పలకరించేందుకుగాని ఎవరికీ ధైర్యం లేకుండాపోయింది.

"నాయనా లక్ష్మణా! చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను, దయచేసి, చితిని రగుల్చు." అన్నది సీత.

"తల్లీ" అన్నాడు లక్ష్మణుడు. తనకి నమస్కరించడం కూడదన్నట్టుగా వారించాడామెను. కళ్ళు చెమ్మగిల్ల చేసుకున్నాడు. రాముణ్ణి చూశాడు. చితిని ఏర్పాటు చేయమన్నట్టుగా కనుసైగ చేశాడు రాముడు. అన్న అంగీకారానికి నిర్విణ్ణుడయ్యాడు లక్ష్మణుడు. పెద్ద చితిని పేర్చాడు. ప్రజ్వరిల్ల చేశాడు.

తనవైపు చూడనైనా చూడని, తనని పట్టించుకోని రాముణ్ణి కడసారిగా చూసింది సీత. తలవంచింది. చేతులు జోడించి నమస్కరిస్తూ రాముని చుట్టూ ప్రదక్షిణ చేసింది. వెళ్ళి, చితిని సమీపించింది. బ్రహ్మవాదులనూ, అమరులనూ మనసులో తలచింది. వారికి మనసులోనే నమస్కరించింది. అగ్నిదేవుణ్ణి ధ్యానించిందిలా.

"ఓ అగ్నిదేవా! నా మనసు ఎల్లప్పుడూ నా స్వామిదే అయితే, నా స్వామిని అది మరచిపోని క్షణమంటూ లేనిదైతే నన్ను కాపాడు.

లోకసాక్షీ! నాలో లోపం ఉన్నదని నా నాథుడు నన్ను అనుమానిస్తున్నాడు. నాలో ఏ లోపం లేదనీ, నేను శీలము కోల్పోలేదనీ ఈ లోకానికి నువ్వు తెలియజేసేట్టుగా నన్ను రక్షించు.

భూమాతా! వాయుదేవా! సూర్యచంద్రులారా! సంధ్యలారా! సకలదేవతలారా నాలో ఎలాంటి కళంకమూ లేదనీ, నేను శీలవతిననీ మీరంతా గుర్తించినట్టయితే ఈ మహాజనుల సాక్షిగా నన్ను కరుణించండి. కరుణించి కాపాడండి."

చితి చుట్టూ ప్రదక్షిణం చేసింది సీత. మహాజ్వాలలతో మండుతున్న చితిలోనికి ప్రవేశించింది.

బంగారుబొమ్మ సీతమ్మ యజ్ఞవేదికలో వేల్చబడే ఆజ్యంలా అగ్నిగుండంలో ప్రవేశించడాన్ని చూసి లోకాలన్నీ చీకాకయ్యాయి. ఒక్కసారిగా జలదరించాయి. ఆ దృశ్యాన్ని వానర రాక్షసులు కూడా తట్టుకోలేకపోయారు. అదిరేగుండెలతో తల్లడిల్లిపోయారు. కన్నీరుపెట్టుకున్నారు. హాహాకారాలు చేశారు.

రాముడు కూడా క్షణకాలంపాటు కళ్ళు మూసుకున్నాడు. కన్నీరుపెట్టుకున్నాడు. ఎందుకిలా జరుగుతోంది? తనకే ఎందుకు ఇన్ని పరీక్షలనుకున్నాడు. బాధపడ్డాడు. అతని బాధ చూసి దేవతా సమూహం భయపడింది. విమానాల్లో పరుగుదీసింది. బ్రహ్మ, శంకరుడు, దేవేంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరాది దేవతలు దివి నుండి భువికి దిగివచ్చారు. రాముడి ఎదుట నిలిచారు. చేతులు జోడించి నమస్కరించారు. వేడుకున్నారిలా.

"మహాత్మా! మహాప్రభూ! ధర్మానికీ, న్యాయానికీ పెట్టింది పేరైన నువ్వే ఇలా ఓ సాధారణ మానవునిలా ప్రవర్తిస్తే ఎలా చెప్పు? నీ నీడ, నీ జాడ అయిన సీతను నువ్వే పరిత్యజించడం తప్పు కాదా? వసువులలో ప్రజాపతివి. సూర్యచంద్రులు కళ్ళుగా కలవాడివి. అశ్వనీదేవతలను చెవులు చేసుకున్నవాడివి. విశ్వరూపివి. పరమపావని సీత అగ్నిప్రవేశం చేస్తోంటే చూస్తూ నువ్వు ఉపేక్షించడం న్యాయం కాదు. కరుణించు! ఆ సాధ్విని కనికరించు."

దేవాదిదేవతలంతా తనని కీర్తించడాన్ని చూసి ఆశ్చర్యపోయాడు రాముడు. ఆ ఆశ్చర్యంలో తనెవరు? తనేమిటో తెలుసుకోవాలనుకున్నాడు. ప్రార్థించాడిలా.

"దేవతలారా! నేను దశరథుని కుమారుణ్ణనీ, రాముణ్ణనే నాకు తెలుసు. మీరు నన్ను అందుకు భిన్నంగా చూస్తున్నారు. కీర్తిస్తున్నారు. నేనెవరు? ఎందుకు ఇలా జన్మించాను? దయచేసి చెప్పండి."

విషయాన్ని వివరించమన్నట్టుగా కంటిచూపుతో ఆదేశించాడు శివుడు. అంగీకరించాడు బ్రహ్మ. తెలియ జేశాడిలా.

"రామా! నువ్వు నరుడివి కాదు. నువ్వు సర్వశక్తిమంతుడివై, లోకాలను సృజించి, పోషించి, లయం చేసే నారాయణుడివి. లోకమాత మహాలక్ష్మే ఈ సీతామాత. మా ప్రార్థనలు మన్నించి, లోకభీకరుడైన రావణుణ్ణీ, అతని దుష్టపరివారాన్నీ అంతమొందించేందుకే దశరథరాముడివై నువ్వు అవతరించావు. లోకరక్షాకార్యం నిర్విఘ్నంగా నిర్వహించావు. కష్టాలు చాలిక. ఆనందించు. ఈ భూమండలాన్ని చిరకాలం పాలించి, నీ దివ్యలోకానికి మళ్ళీ చేరుకో."

రామావతార కారణాన్నీ, లక్ష్యాన్నీ బ్రహ్మదేవుడు పూర్తి చేసేంతలో అగ్నిదేవుడు మానవరూపంలో అవతరించాడక్కడ. సీతను పసిబిడ్డలా ఒడిలో పెట్టుకుని, మంటలను చిమ్ముకుంటూ సాక్షాత్కరించాడు. చితిలో ప్రవేశానికి ముందు సీత ఎలా ఉన్నదో అలానే ఉన్నదిప్పుడామె. కురులు సైతం కాలిపోలేదు. అప్పట్లాగే అలాగే ఉన్నాయి. ఆభరణాల మెరుపులు మాయలేదు. తురుముకున్న పువ్వులు మాడలేదు. చీర చెక్కుచెదరలేదు. ఏ విధమైన వికారాలు లేని మనస్సుతోనూ, శరీరంతోనూ ఉన్న సీతను రాముని ముందు నిలిపాడు అగ్నిదేవుడు. ప్రార్థించాడిలా.

"రామా! నీ భార్యలో ఏ దోషమూ లేదయ్యా! ఈ పరమపావని భావనలోనూ, మనస్సులోనూ, దృష్టిలోనూ పరమశుద్ధురాలు. ఎల్లవేళలా నిన్నే స్మరిస్తూ ఉన్నది.

వంచనతో ఈ సీతను అపహరించిన రావణుడు, ఈమెను అశోకవనంలో బందీని చేశాడు. రాక్షసస్త్రీలను కాపలా పెట్టాడు. తన వైభవాలు చూపించీ, బలప్రతాపాలు వర్ణించీ, ప్రలోభాలు ఎరచూపీ, అదరించీ, బెదరించీ, బుజ్జగించినా ఈ సాధ్విని వశపరచుకోలేకపోయాడు. అనుక్షణం నిన్ను మనసులో ఆరాధిస్తూ, నీ నామాన్నే జపిస్తూ, ఆ నీచుణ్ణి గడ్డిపరక కంటే హీనంగా చూసి తృణీకరించిందయ్యా! అణుమాత్రమైన దోషం లేని ఈ సీతను, నీ ఈ సహధర్మచారిణిని, నా మీది నమ్మకంతో, నా ప్రమాణంతో స్వీకరించు."

సీతను అప్పుడు చూశాడు రాముడు. ఆనందంగా సన్నగా నవ్వాడు.

**-అరణి**



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వృత్తి వ్యాపారాలు, పెట్టుబడులు, షాపింగ్‌కు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో ప్రయాణాలకు అవసరమైన ఏర్పాట్లు చేసుకుంటారు. సమావేశాలు లాభిస్తాయి. అంచనాలు తప్పే అవకాశం ఉంది. 4,5,6 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. బోనస్‌లు, ఇంక్రిమెంట్లు అందుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. 7,8 తేదీల్లో సమావేశాలు, వేడుకల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. పెట్టుబడుల్లో నిదానం అవసరం. బంధుమిత్రులను కలుసుకుంటారు..

### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)



సమావేశాలు, పెట్టుబడులు, భాగస్వామ్యాలు, వేడుకలు, షాపింగ్‌లకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో పెట్టుబడులపై దృష్టి సారిస్తారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 4,5,6 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. చర్చలు, ప్రయాణాలు లాభిస్తాయి. గౌరవ, మన్ననలు అందుకుంటారు. 7,8 తేదీల్లో పెద్దల కారణ ంగా చికాకులు ఎదుర్కొంటారు. గౌరవ ప్రతిష్ఠలకు భంగం కలిగే అవకాశం ఉంది. వివాహ నిర్ణయాల్లో తొందరపాటు తగదు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, ఆర్థికపరమైన వ్యూహాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 4,5,6 తేదీల్లో కృషి రంగంలో ఆర్థికంగా ప్రోత్సాహకరం. సహోద్యోగుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు. వైద్యం, ఆహారరంగాల వారికి ప్రోత్సాహకరం. 7,8 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ప్రేమానుబంధాలు, ఆరోగ్యం, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో కొత్త పరిచయాలు ఏర్పడతాయి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 4,5,6 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. వివాహ నిర్ణయాలకు అనుకూలం. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 7,8 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. విలువైన వస్తువుల కొనుగోలులో నాణ్యత గమనించాలి.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

కుటుంబ వ్యవహారాలు, వేడుకలు, బదిలీలు, ఆర్థిక లావాదేవీలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ప్రోత్సాహకరం. ప్రియతముల వైఖరిలో మార్పు ఆవేదన కలిగిస్తుంది. 4,5,6 తేదీల్లో హోటల్, పరిశ్రమలు, వైద్య రంగాల వారికి ప్రోత్సాహకరం. బదిలీలు, మార్పులకు అనుకూలం. విందు వినోదాలు ఉల్లాసం కలిగిస్తాయి. సంకల్పం ఫలిస్తుంది. 7,8 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. వేడుకలకు ఏర్పాట్లలో ఇబ్బందులు ఎదురవుతాయి. బృందకార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన చర్చలు, వేడుకలు, విద్యా విషయాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో రిజిస్ట్రేషన్లు, అగ్రిమెంట్లకు అనుకూలం. బదిలీకి సంబంధించిన సమాచారం అందుకుంటారు. 4,5,6 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. శుభవార్త అందుకుంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. మెయిల్స్, సందేశాలు ఆనందం కలిగిస్తాయి. 7,8 తేదీల్లో సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఇంటర్వ్యూలలో నిరాశ ఎదరయ్యే అవకాశం ఉంది. వృత్తి, ఉద్యోగాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

స్పెక్యులేషన్లు, పెట్టుబడులు, షాపింగ్, విద్యా విషయాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విలువైన పత్రాలు అందుకుంటారు. ఏజెన్సీలు, విద్య, స్టేషనరీ, రవాణా రంగాల ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 4,5,6 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల






నవంబర్ 2 నుంచి నవంబర్ 8 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ

వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఇంటికోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక విషయాల్లో కుటుంబసభ్యుల సహకారం లభిస్తుంది. 7,8 తేదీల్లో పెట్టుబడుల్లో అచితూచి వ్యవహరించాలి. ఫీజులు, బిల్లులు చెల్లింపులో ఇబ్బందులు ఎదుర్కొంటారు. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

విద్య, వృత్తి, వ్యాపారాలు, కొత్త ప్రాజెక్టులు, వేడుకలు, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక విషయాలకు సంబంధించి ముఖ్యమైన నిర్ణయాలు తీసుకుంటారు. 4,5,6 తేదీల్లో కీలక సమాచారం, విలువైన పత్రాలు అందుకుంటారు. రవాణా, బోధన రంగాల వారికి అనుకూలం. రిజిస్ట్రేషన్లు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. 7,8 తేదీల్లో బదిలీలు, మార్పులు. చేర్పుల కారణంగా అసౌకర్యానికి గురవుతారు. కుటుంబ వ్యవహారాలు ఆవేదన కలిగిస్తాయి.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

కుటుంబ వ్యవహారాలు, చిన్నారుల విషయాలు, జనసంబంధాలకు ఈ వారం పాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. దూరప్రయాణాలకు ఏర్పాట్లు చేసుకుంటారు. 4,5,6 తేదీల్లో దానధర్మాలకు ఖర్చు చేస్తారు. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరం. వాయిదాపడుతున్న పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. 7,8 తేదీల్లో ఒక సమాచారం నిరాశ కలిగిస్తుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

రియల్ ఎస్టేట్, బదిలీలు, విద్య, వృత్తి, వ్యాపారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. 4,5,6 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితులు సహకరిస్తారు. సమావేశాలు, బృందకార్యక్రమాల్లో కీలకపాత్ర పోషిస్తారు. పెట్టుబడులు లాభిస్తాయి. జనసంబంధాలు విస్తరిస్తాయి. 7,8 తేదీల్లో ఆర్థిక విషయాల్లో నిరుత్సాహంగా ఉంటుంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

ఇంటర్వ్యూలు, పెద్దలతో సమావేశాలు, కుటుంబ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో యూనియన్ కార్యక్రమాల్లో పాల్గొంటారు. సమావేశాల్లో ప్రముఖుల్ని కలుసుకుంటారు. 4,5,6 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారికి శుభప్రదం. గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తిచేస్తారు. గౌరవ పదవులు అందుకుంటారు. 7,8 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో కొత్త పనుల ప్రారంభానికి తగిన సమయం కాదు. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన సమావేశాలు, ప్రయాణాలు, విద్య, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 4,5,6 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రదర్శనలు, సమావేశాల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో సంకల్పం ఫలిస్తుంది. 7,8 తేదీల్లో రాజకీయ, సినీ, బోధన, పర్యటన రంగాల వారి అంచానలు తల్లకిందులయ్యే అవకాశం ఉంది. సమావేశాల్లో జాగ్రత్తగా వ్యవహరించాలి.

# కృష్ణవంశీ కల నెరవేరేనా?









ఒకప్పుడు ఆయన క్రియేటివ్ జీనియస్. హీరోయిన్లను ఆయన చూపించినంత అందంగా మరెవ్వరూ చూపించరనే పేరు ఆయన సొంతం. విజయవంతమైన సినిమాలను ఎన్నింటినో తన ఖాతాలో వేసుకున్న కృష్ణవంశీకి సక్సెస్ ఎండమావిగా మారింది. కృష్ణవంశీ ఇప్పుడు అర్జంటుగా ఓ భారీ హిట్ కొట్టాల్సిన అవసరం ఎంతైనా ఉందని సినీ జనాలు అంటున్నారు. కృష్ణవంశీ కూడా తన ఆశలన్నీ 'నక్షత్రం' మీదే పెట్టుకున్నాడట! అందుకే ఈ సినిమా పబ్లిసిటీని డిఫరెంట్‌గా నిర్వహించి సక్సెస్ ట్రాక్ పట్టాలన్నది ఆయన ఆశ అట! కృష్ణవంశీ కల ఈసారైనా నెరవేరాలని ఆయన అభిమానులు పలువురు కోరుకుంటున్నారు.

# బోయపాటి ఆలోచిస్తే బెటర్!



తనమీద ఆరోపణలు చేస్తున్న వారికి 'లెజెండ్' వెయ్యిరోజుల వేడుకలో గట్టి సమాధానం చెప్పాలని బోయపాటి డిసైడ్ అయ్యాడని సినీ జనాలు అంటున్నారు. గతంలో బోయపాటి మీద ఆయన గురువు పోసాని, స్నేహితుడు కొరటాల ఓ స్థాయిలో ఆరోపణలు గుప్పించారు. ఆ ఆరోపణలపై బోయపాటి ఇంతవరకూ నోరు మెదపలేదు. సరైన వేదిక మీద ఆ ఆరోపణలకు సమాధానం చెప్పాలన్నది బోయపాటి ఆలోచనట! ఆ వేదిక 'లెజెండ్' వెయ్యిరోజుల పండగగా బోయపాటి భావిస్తున్నాడట కూడా! ఇంతవరకూ బాగానే ఉంది కానీ, గురువు గారికి కౌంటర్‌ఇవ్వడం అంత మంచి పని కాదు అన్నది కొందరి వాదన. ఉన్నదున్నట్టు మాట్లాడతాడనీ, అబద్ధాలు చెప్పడనీ పోసానికి మంచి పేరుంది. అలాంటి వ్యక్తి మీద తిరుగుబావుటా అంటే బోయపాటి ఆలోచించాల్సిందే అంటున్నారు సినీ జనాలు. 'నిప్పు లేందే పొగ రాదు కదా' అన్నది వారి వాదన.

# అవసరాలకి అదృష్టం!

ఇంద్రగంటి మోహనకృష్ణ క్యాంపు నుంచి వచ్చిన శ్రీనివాస్ అవసరాలకి అదృష్టం ఓ రేంజ్‌లో పట్టినట్టుంది. 'ఊహలు గుసగుసలాడే', 'జ్యో అచ్యుతానంద' సినిమాల హిట్టుతో అవసరాల చిన్న సినిమాలకు పెద్ద దర్శకుడు అయిపోయాడు. ఇప్పటివరకూ చిన్ని సినిమాలే చేసిన అవసరాలకి టాలీవుడ్‌లోని ఓ స్టార్ హీరోని డైరెక్ట్ చేసే ఛాన్స్ దక్కిందట! అన్నీ పూర్తైతే త్వరలోనే ఈ సినిమా పట్టాలెక్కుతుంది అంటున్నారు. ఈ వార్త నిజమే అయితే కనుక అవసరాల రేంజ్ ఎక్కడికో వెళ్ళిపోతుందనీ, పెద్ద సినిమాలకు మంచి ఆప్షన్ అవుతాడనీ సినీ జనాలు చెబుతున్నారు.



# చిన్న సినిమా వైపు పెద్దల చూపు



కేవలం కోటి రూపాయలతో నిర్మించిన 'పెళ్ళిచూపులు' బ్లాక్‌బస్టర్‌గా నిలిచింది. పెట్టుబడికి సుమారు 20రెట్లు తెచ్చిన ఈ సినిమా మీద కోలీవుడ్, బాలీవుడ్ పెద్దల చూపులు పడ్డాయి. ఈ సినిమా కోలీవుడ్ హక్కులను ఫ్యాన్సీరేటుకి స్టార్ డైరెక్టర్ గౌతమ్ మీనన్ దక్కించుకోగా, బాలీవుడ్ కోసం సల్మాన్ ప్రయత్నిస్తున్నాడట! సల్మాన్ సొంత నిర్మాణ సంస్థలో ఈ సినిమా నిర్మించే ఆలోచనలో ఉన్నాడట! ఇదే కనుక నిజమైతే బాలీవుడ్‌లో కూడా ఈ సినిమాకి హక్కులు మంచి రేటే పలికే అవకాశం ఉంది అంటున్నారు. మొత్తానికి ఈ చిన్న సినిమా మీద కాసులవర్షం కురుస్తోందన్నది నిజమట!

# నన్నే ఎందుకలా...?

-శ్రుతిహాసన్



**కొందరిని వర్ణించడానికి మాటలు సరిపోవు. ఫ్లగ్గులో వేలు పెడితే శరీరమంతా జివ్వుమన కుండా ఎలా ఉంటుంది? సరిగ్గా శ్రుతిహాసన్ అందం అలాగే ఉంటుంది. అందం, అభినయం అంతకు మించి గట్స్ ఉన్న హీరోయిన్‌గా శ్రుతికి పేరుంది. ఒకప్పుడు ఆమెను ఐరన్ లెగ్ అన్నారు. ఇప్పుడు వారే ఆమెను గోల్డెన్ లెగ్ అంటూ ఆకాశానికి ఎత్తేస్తున్నారు. నటిగా ఎంత మంచి పేరు తెచ్చుకున్నా తనకు సంబంధించి ప్రతి చిన్న విషయాన్ని వివాదాస్పదం చేస్తున్నారంటున్న లోకనాయకుడి తనయ శ్రుతిహాసన్‌తో...**

---

**'ప్రేమమ్' సక్సెస్ జోష్‌లో ఉన్నట్టున్నారు?**

నిజమే. సక్సెస్ మూడ్‌నుంచి బైటకు రాలేదు. చాలా రోజుల తరువాత ఓ మంచి పాత్ర దొరికింది. దాన్ని ప్రేక్షకులూ అంగీరించారు. రెండు ఆనందాలు కదా! ఎక్కువ కాలం ఉంటుంది.

**సితారలాంటి పాత్రలు ఇష్టమని అన్నారు ఎందుకలా?**

ఎప్పుడో తప్ప సితారలాంటి పాత్రలు దొరకవు. గ్లామర్ పాత్రలు ఎన్నైనా రావచ్చు. కానీ ఇలాంటి పాత్ర రమ్మంటే మళ్ళీ మళ్ళీ రాదు. అందుకే అలా చెప్పాను.

**రెండు భాషల్లో వచ్చిన ఏ సినిమా బాగా నచ్చింది?**

రెండు భాషల్లోనూ ఈ సినిమా అద్భుతంగా తీశారు. మాలీవుడ్‌లో అక్కడి పరిస్థితులకు అనుగుణంగా తీస్తే ఇక్కడికి వచ్చేసరికి కథలో కొన్ని మార్పులు చేశారు. అవి తప్పనిసరి కూడా! మార్పులు చేసినా ఎక్కడా అతిగా అనిపించడం కానీ, మూలకథ దెబ్బతినడం కానీ జరగలేదు. తెలుగులో చేసే ముందు మలయాళం సినిమా చూశాను. నాకు రెండు సినిమాలూ బాగా నచ్చాయి.

**మలయాళం ప్రభావం మీమీద పడలేదంటారా?**

అక్కడ నా పాత్రను ఎలా తీర్చిదిద్దారు? అన్నదే చూశానుతప్ప ఆ పాత్ర చేస్తున్న నటిని గానీ, ఆమె నటనని గానీ చూడలేదు. తెలుగులో డైరెక్టర్‌గారు ఎలా చెబితే అలా చేశాను.

**రీమేక్ రాణి బిరుదు మీరే ఇచ్చేసుకున్నట్టున్నారు?**

తెలుగులో నేను చేసిన సినిమాలు ఎక్కువగా రీమేక్‌వే ఉన్నాయి. ఎందుకో తెలియదు కానీ, అలా సెట్ అయిపోతున్నానంతే! అందుకే ఎవరో ఆ బిరుదు ఇవ్వడం ఎందుకని? నాకు నేనే ఇచ్చేసుకున్నాను. 'రీమేక్ రాణి' బిరుదు బాగుంది కదూ!

**హారర్ సినిమాలు చేసే ఆలోచన ఉందా?**

లేదని ఎలా చెప్పను. ఉంది కానీ, నేను అలాంటి వాటికి సరిపోనేమో అని నా అనుమానం. ధైర్యం చేసి ఎవరైనా నా దగ్గరికి అలాంటి కథతో వస్తే తప్పకుండా చేస్తాను.

**నిర్మాతగా మారేదెప్పుడు?**

దానికి ఇంకా కొంత సమయం ఉంది. నటిగా ఇంకా ప్రూవ్ చేసుకోలేదు. ఇప్పటివరకూ కొన్ని రకాల పాత్రలకే పరిమితమయ్యాను. అలా కాకుండా నటిగా ఎన్ని రకాల పాత్రలు చేయగలనో అన్ని పాత్రలూ చేయాలి. తరువాత పాటలు పాడాలి. అప్పుడు నిర్మాణం గురించి.

**మీ సిస్టర్‌లాగా దర్శకత్వంలోకి వెడతారా?**

అది కూడా ఎప్పుడో రోజు చేస్తాను. కాకపోతే నా కథల్ని నేనే డైరెక్ట్ చేసుకుంటాను. ఇత రుల కథల జోలికి వెళ్ళదలుచుకోలేదు. ఈలోపు కథలు రెడీ చేసుకుంటున్నాను.

**మీ సిస్టర్‌కి సలహాలు ఇస్తుంటారా?**

తను పనిచేస్తోంది ఎవరి దగ్గరా? ఒకేసారి పది పనులు చేయగల గ్రేట్ పర్సన్ దగ్గర చేస్తోంది. ఇక తనకి నేను సలహాలు ఇవ్వాల్సిన అవసరం లేదు. కొన్ని రోజులకు తనే నాకు సలహాలు ఇస్తుందేమో! అంత బాగా ట్రైన్ అవుతోంది.

**మీ ఫాదర్‌తో చేస్తున్న సినిమా గురించి.**

నాన్నతో కలిసి చేయాలని ఎప్పటి నుంచో కోరిక. ఆ కోరిక 'శభాష్ నాయుడు'తో తీరింది. చిన్నతనం నుంచీ నాన్న నుంచి ఎన్నో నేర్చుకున్నాను. ఈ సినిమాతో మరిన్ని విషయాలు నేర్చుకున్నాను.

**ఈ సినిమా షూటింగ్‌లో మరిచిపోలేని అనుభూతి?**

ఓరోజు నాకు, నాన్నకు మధ్య వచ్చే సన్నివేశాల షూటింగ్ జరుగుతోంది. ఆ సమయంలో నాన్న సినిమాలో నా పేరు మరిచిపోయి అసలు పేరు పెట్టి పిలిచేశారు. అందరూ ఒక్కసారి షాక్ అయ్యారు. ఆ తరువాత నాన్న సర్దుకుని పెద్దగా నవ్వేశారు. ఇదొక స్వీట్ మెమరీగా నాకు ఎప్పటికీ గుర్తుండిపోతుంది.

**గౌతమితో వచ్చిన విభేదాల గురించి...**

నా పాత్ర కాస్ట్యూమ్ గురించి ఇద్దరం డిస్కస్ చేసుకుంటుంటే మా ఇద్దరి మధ్యా ఏదో గొడవ జరిగిందన్న పుకార్లు పుట్టించారు. తను కానీ, నేను కానీ ఏది చేసినా, ఏది చెప్పినా సినిమా బాగా రావాలనీ, ఔట్‌పుట్ బాగుండాలనే కదా! మా మధ్య ఏం జరిగిందో తెలుసుకోకుండా పుకార్లు పుట్టించేస్తే ఎలా? మానాన్నగారు ఎక్కువగా గౌరవించే వ్యక్తులలో గౌతమి కూడా ఒకరు. నేను ఆయనకి ఎంత గౌరవం ఇస్తానో గౌతమిని కూడా అంతే గౌరవిస్తాను. ఇప్పుడే కాదు ఎప్పుడూ తనతో గొడవపడే అవకాశమే లేదు.

**దీని గురించి గౌతమితో చర్చించారా?**

లేదు. నాకా అవకాశం రాలేదు. నా సినిమాలతో నేను బిజీ అయిపోయాను. తెలుగు, తమిళంలో ఒప్పుకున్న సినిమాలు వెంట వెంటనే మొదలు కావడంతో వాటితో తీరిక లేకుండా అయిపోయింది. కొద్దిగా సమయం దొరికితే తనని కలుస్తాను. కానీ వీటి గురించి ప్రత్యేకించి చర్చించను. ఇలాంటి పుకార్లని నాలాగే గౌతమి కూడా పట్టించుకోదు.



**మిమ్మల్ని ఎక్కువ ప్రభావితం చేసింది?**

మా నాన్న తరువాత మా మదర్ సారికనే! తను చాలా ధైర్యవంతురాలు. ఇండిపెండెంట్ పర్సన్. తను నాన్నకి దూరంగా వచ్చి చాలా సంవత్సరాలే అయినా ఇప్పటి వరకూ ఎవరి మీదా ఆధారపడలేదు. నాన్న పోలికలతో పాటు అమ్మ పోలికలు కూడా చాలా వచ్చాయి. మా మదర్‌లానే నాకూ స్వతంత్రంగా జీవించడం అంటే ఇష్టం.

**మీమీద వచ్చే విమర్శల గురించి...**

అస్సలు పట్టించుకోను. సినిమాల పరంగా లేదా వ్యక్తిగతంగా చాలామంది విమర్శిస్తూనే ఉంటారు. వాటిలో నాకు ఉపయోగపడతాయి అన్న వాటినే తెలుసుకుంటాను తప్ప మిగతావి అస్సలు వినను కూడా వినను. ఉదాహరణకి 'ప్రేమమ్' సినిమా గురించే తీసుకోండి. ఈ సినిమాలో నన్ను తీసుకున్నారు అని తెలిసినప్పుడు చాలామంది చాలా రకాలుగా విమర్శించారు. నేను ఆ పాత్రను చేయలేననీ, సినిమా బాగా రాదనీ ఇలా చాలా కామెంట్స్ వచ్చాయి. సినిమా విడుదలైన తరువాత నా గురించి విమర్శించినవారే నన్ను పొగడడం ప్రారంభించారు. అసలు చిన్న విషయానికి కూడా నన్నే ఎందుకలా టార్గెట్ చేస్తారో నాకు అర్థం కాదు.

**పవన్ కల్యాణ్‌తో రెండోసారి చేయడం గురించి?**

ఓ విధంగా చెప్పాలంటే నాకు అదృష్టాన్ని తీసుకువచ్చిన వ్యక్తి ఆయన. ఆయనతో 'గబ్బర్‌సింగ్' చేసిన తరువాతే నన్ను గోల్డెన్ లెగ్ అనడం మొదలెట్టారు. అంతకు ముందు నా మీద ఐరన్‌లెగ్ ముద్ర వేసి కొన్ని సినిమాల్లో తీసుకోలేదు కూడా! ఆయనతో రెండవసారి చేయడం నా అదృష్టం. నా కెరీర్‌లో ఆయన ఓ స్పెషల్ వ్యక్తి. రెండవసారి ఆయనతో  చేసే అవకాశం రాగానే డేట్లు అడ్జస్ట్ చేసుకుని ఓకే చెప్పేశాను

**లేడీ ఓరియెంటెడ్ సినిమాలు చేసే ఉద్దేశం ఉందా?**

చాలా మంది అదే అడుగుతుంటారు. 'క్వీన్', 'కహానీ' లాంటి సినిమాలు అయితే తప్పకుండా ఆదరిస్తారు. పదే పదే అవే వస్తుంటే ఎవరూ చూడరు కూడా! అందుకే అలాంటి సినిమాలు చేసే సాహసం ఇప్పట్లో చేయను. భవిష్యత్తులో చేస్తానేమో చెప్పలేను.

**బాలీవుడ్‌లో చేస్తున్న సినిమాలు?**

ఇప్పటివరకూ వేటికీ ఓకే చెప్పలేదు. దక్షిణాదిన సినిమాలు పూర్తి కాగానే అక్కడ సినిమాలు చేస్తాను.

-చిన్ని



# ఇంటర్వ్యూ

# రేపటి పౌరుల ఉత్సాహ వేదిక 'బాలోత్సవ్'

-డా.వాసిరెడ్డి రమేష్‌బాబు
సెల్: 98481 57517

**దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ అన్నాడు గురజాడ.**

**గంగిగోవు పాలు గరిటెడైనను చాలు/కడివెడైననేమి ఖరముపాలు... అన్నాడు శతకకారుడు.**

**పుట్టలో చీమల్లా బతికితే సరిపోదు, ఎలా బతికాం అనేదే ముఖ్యం' అంటారు సామాజికవేత్తలు.**

**మన దేశంనిండా మానవ వనరులే. రక్తపుష్టికీ, కండపుష్టికీ పెట్టిందిపేరు. మనల్ని మనం ఇంకా బెటర్‌గా పాలించుకోవాలన్నా, ప్రపంచానికి మార్గదర్శకత్వం వహించాలన్నా ఈ దేశంలో మళ్ళీ విలువల్ని ప్రతిష్టింపజేయాలి. మనలోని క్రియేటివిటీనీ, విలువల్నీ కాలానుగుణంగా రీడిస్కవర్ చేయాలి.**

**అందుకే మన దేశంలో ఎందరో బుద్ధిజీవులు ఈ దిశగా తమ వంతు బాధ్యతలు నిర్వర్తిస్తున్నారు. చంద్రునికో నూలుపోగులా బాలోత్సవ్ రమేష్‌బాబుగారు కూడా చేస్తున్నదదే!**

**జనం మెచ్చిన సర్జన్ డాక్టర్ వాసిరెడ్డి రమేష్‌బాబు. దాదాపు ఇరవైనాలుగు సంవత్సరాలుగా ఏటా పిల్లల్ని ఒకచోట చేర్చి వారి సృజనకు పదునుపెడుతున్నారు. కొత్తగూడెంలో నిర్విఘ్నంగా బాలోత్సవం నిర్వహిస్తున్నారు. 2016 నవంబరు 10,11,12,13 తేదీల్లో రజతోత్సవ వేడుకగా 20 వేల మంది పాల్గొనే బాలోత్సవ్ దేశాన్ని అలరించనున్నది. ఈ సందర్భంగా రమేష్‌బాబు ఇంటర్వ్యూ.....**

గుంటూరుజిల్లా దుగ్గిరాల మండలం తెనాలి సమీపంలోని చిన్నపాలెం గ్రామంలో జన్మించాను. మా నాన్నగారు వాసిరెడ్డి సత్యహనుమంతరావు. అమ్మ సామ్రాజ్యలక్ష్మి.

తెనాలి తాలూకా పాఠశాలలో 12వ తరగతి వరకు చదువుకున్నాను. 1970-75లో గుంటూరు మెడికల్ కాలేజీలో హౌస్ సర్జన్, అమృత్‌సర్ కాలేజీలో ఎం.ఎస్. జనరల్ సర్జన్ చేశాను. 1975-77లో ఫిరోజ్‌పూర్ పంజాబ్ మిషన్ హాస్పిటల్‌లో సర్జన్‌గా చేశాను. మా అమ్మగారి ఊరు ఖమ్మంజిల్లా మధిర. మా బంధువులంతా అక్కడే. అందువల్ల 1977లో కొత్తగూడెంలో వైద్యవృత్తి ప్రారంభించాను.

**బాలోత్సవ్ ఆవిర్భావం**

'కొత్తగూడెం క్లబ్‌లో 1980లో సభ్యుడిగా చేరాను. 1991 నాటికి సెక్రటరీగా ఎంపికయ్యాను. ఈ క్లబ్ ఓ విశాల ప్రాంగణం. అన్ని వసతులతో కూడిన సుందర వనం. ప్రకృతిని ఆస్వాదించగల పరిసరాలతో, పూలమొక్కలు, పచ్చని చెట్లతో కళకళలాడుతూ ఉంటుంది. కేవలం ధనవంతులకే కాకుండా, క్లబ్‌ని అందరికీ ఉపయోగపడేలా కళా సాంస్కృతిక వేదికగా తీర్చిదిద్దాలని సంకల్పించాను. అలా కొత్తగూడెం పట్టణస్థాయిలో 1991లో బాలల ఉత్సవం ప్రారంభమైంది.

**నామకరణ**

క్రమంగా 1992-2000 నాటికి ఖమ్మంజిల్లా పాఠశాలలన్నిటికీ బాలోత్సవ్ విస్తరించింది. జిల్లాలో విద్యార్థినీ విద్యార్థులు తమ ప్రతిభాపాటవాలు నిరూపించుకుంటున్నారు. రాష్ట్రస్థాయికి విస్తరించే తలంపుతో 2000 సంవత్సరంలో బాలోత్సవ్‌గా దీనికి నామకరణం చేశాను. ఖమ్మం, వరంగల్, కృష్ణా, గుంటూరు జిల్లాలో చేశాను. నిదానంగా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 23 జిల్లాల పిల్లలు పాల్గొనడం ప్రారంభించారు. ఇలా 2013 వరకు బాలోత్సవంలో వేలాదిమంది తమ ప్రతిభాపాటవాలు ప్రదర్శించడం, వారికి గుర్తింపు లభించడంతో నా ఆశయం నెరవేరుతోందనే భావన నాలో కలిగింది.

**28 అంశాలతో బాలోత్సవ్**

బాలోత్సవ్‌లో వయసులవారీగా పోటీలుంటాయి. నర్సరీ నుండి 4వ తరగతి వరకు సబ్ జూనియర్స్, 5 - 7 వరకు జూని యర్స్, 8- 10వ తరగతి వరకు సీనియర్స్‌గా విభజించి పిల్లల్ని 40 విభాగాలుగా వర్గీకరించి 28 అంశాల్లో పోటీలు నిర్వహిస్తాం. ప్రతి విభాగంలో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలతోపాటు రెండు ప్రత్యేక బహుమతులిచ్చి ప్రోత్సహిస్తున్నాం.

బాలోత్సవ్‌లో పదహారు వేదికలుంటాయి. అవసరమైతే కొత్త వేదికలు పెడతాం. జానపద బృందనృత్యం,

కూచిపూడి, భరతనాట్యం, వక్తృత్వం, ఏకపాత్రాభినయం, బొమ్మలుచేద్దాం మట్టితో, నాటికలు, వాద్య సంగీతం, వ్యర్థంతో అర్థం, లేఖారచన, నీతి పద్యం, అనగనగా..., విచిత్ర వేషధారణ, జానపద గీతాల పోటీ వేదికలు ఉంటాయి. సినిమా, లలిత సంగీతం, జానపద నృత్యం, పేరిణి నృత్యం, కథా రచన, కథా విశ్లేషణ, లఘుచిత్ర ప్రదర్శన, కవితా రచన, తెలుగులో మాట్లాడుకుందాం, వీధినాటక విశ్లేషణ.... ఇలా కాలానుగుణ అంశాలు జోడిస్తున్నాం.


బాలోత్సవ్ రథ సారథులతో డా. వాసిరెడ్డి రమేష్‌బాబు

### కథలు, కథా రచన

నర్సరీ నుండి నాలుగో తరగతి వరకు పిల్లలకు 'కథలు ఎలా చెప్పాలి?' అనే అంశం నిర్వహిస్తాం. పిల్లలకు స్టేజీ ఫియర్ పోగొట్టాలనేదే దీని ఉద్దేశం. వీళ్ళంతా సబ్ జూనియర్స్. అమ్మమ్మ, తాతయ్యల దగ్గర కథలు నేర్చుకువచ్చి, వందలాదిమంది ప్రేక్షకుల ఎదుట చెబుతారు. ఈ ప్రక్రియలో పిల్లలకు నేను 'చెప్పగలను', 'మాట్లాడగలను' అనే దృఢ సంకల్పం, మనోధైర్యం బాల్యంలోనే కలుగుతుంది.

సీనియర్స్ విభాగంలో విద్యార్థులకు కథ రచన పోటీలు ఒక వర్క్‌షాపులా చేస్తాం. ప్రముఖ రచయితల సమక్షంలో, 'కథలు ఎలా రాయాలి' అనే విషయంపై అవగాహన కల్పిస్తాం. కథలురాసేలా వారిని పురిగొల్పేందుకు ఈ వర్క్‌షాపు దోహద పడుతుంది. అప్పటికప్పుడు, 'ఒక స్టోరీ లైన్' ఇచ్చి కథ రాయమంటాం. విశేష ప్రతిభ ప్రదర్శించగలుగుతున్నారు. ప్రముఖ రచయితలు వాసిరెడ్డి నవీన్, ఓల్గా, అక్కినేని కుటుంబరావు, చింతపట్ల సుందర్శన్, దాసరి అమరేంద్ర, హనీఫ్, చంద్రలత, భగవంతం, శిరంశెట్టి కాంతారావు లాంటివారు ఈ వర్క్‌షాపు నిర్వహిస్తూ ఉంటారు. కవిత్వ రచనపై సీతారాం, ప్రసేన్, వంశీకృష్ణ లాంటి కవులు పిల్లలను మోటివేట్ చేస్తారు. అప్పటికప్పుడు పిల్లలకు ఒక అంశం ఇచ్చి కవిత రాయమంటారు. పిల్లలు కూడా అమోఘంగా స్పందిస్తున్నారు. ప్రముఖకవి రాసిన కవితలు పిల్లలకు చదివి వినిపిస్తారు. దీనివల్ల ఉచ్చారణలో స్పష్టత, భాషాపరిజ్ఞానం అలవడుతుంది.

### నీతిపద్యం, లేఖారచన

పిల్లల్లో నైతికత పెంచేందుకు నీతిపద్యం, వాటి అర్థాలు విడమర్చి చెబుతాం. పిల్లల్లో మోరల్ వాల్యూస్ పెంచేందుకు ప్రయత్నిస్తున్నాం. ఉత్తరాలు రాయాలనే అభిలాష పెంచేందుకు పిల్లలకు ఇన్లాండ్ కవర్లు ఇచ్చి ఆప్తులు, తల్లిదండ్రులు, స్నేహితులకు లేఖలు రాయమంటాం. తెలుగు మరిచిపోతున్న తరుణంలో ఈ పద్ధతివల్ల మాతృభాషపై మమకారం పెరుగుతుంది.

### లఘుచిత్ర విశ్లేషణ, మట్టిబొమ్మలు

పిల్లలకు ఒక లఘుచిత్రం (షార్ట్‌ఫిలిమ్), చిన్న చిన్న నాటికలను చూసి విశ్లేషించమంటాం. దీనివల్ల కథ, నాటకం, మంచి సినిమాపట్ల వారిలో ఆసక్తితో పాటు, సొంతంగా విశ్లేషణ చేయడంవల్ల స్థిరమైన అభిప్రాయాలు పెంపొందుతాయి. చదువంటే అక్షరాలు నేర్వడం, వాక్యాలు చదవడం, చదివింది రాయడం మాత్రమే కాదు, చదివిన విషయంపై తనదైన అభిప్రాయం ఏర్పరచుకోవడం, వ్యక్తీకరించడమే నిజమైన చదువు. పిల్లల్లో విశ్లేషణా సామర్థ్యం పెంపొందించడంలో కథ, నాటక, చిత్ర విశ్లేషణలు ఎంతో ఉపయోగపడతాయి.

పిల్లలు మట్టితో బొమ్మలుచేసే కళ ఇప్పుడు అంతరించింది. బాలోత్సవ్‌లో మట్టితో రథాలు, దేవుడి బొమ్మలు, సైకిళ్ళు, చక్రాలు, ఇళ్ళు, మనిషి బొమ్మలు, వంట పాత్రలు తయారుచేయిస్తాం. ఇది సృజనాత్మకత పెంచే ప్రక్రియ.

### బాలోత్సవ్ కుటుంబం

కొత్తగూడెం రామచంద్రా జూనియర్ కాలేజీ లెక్చరర్ చటర్జీగారు 1999 వరకు, ఆ తర్వాత అదే కళాశాల తెలుగు లెక్చరర్ డాక్టర్ శర్మగారు ఆ బాధ్యత స్వీకరించారు. కొత్తగూడెం క్లబ్ మేనేజర్ మల్హార్ గారు, సింగరేణి సంస్థలో చిరుద్యోగి చంద్రశేఖర్ గారు మా బాలోత్సవ్ కుటుంబంలో ముఖ్యపాత్ర ధారులు. ఏటా 12 వేల మందికి మూడురోజులు భోజన సదుపాయ ఏర్పాట్లు చేస్తారు. ఆ ఏర్పాట్లన్నీ సింగరేణి విశ్రాంత ఉద్యోగి మాధవరావుగారు పర్యవేక్షిస్తారు. ప్రేమతో కమ్మటి, రుచికరమైన, ఆరోగ్యకర ఆహారం సమకూరుస్తారు. వీళ్ళంతా చేదోడువాదోడుగా ఉండటంవల్లనే ఇరవైనాలు గేళ్ళుగా బాలోత్సవ్‌ను గర్వించదగ్గస్థాయిలో నిర్వహించ గలుగుతున్నాను.

### సింగరేణి వనరులు

బాలోత్సవ్‌కు సింగరేణి సంస్థవారు తమ ప్రాతిపదికన సౌకర్యాలు సమకూరుస్తారు. అతిథిగృహంలో వసతి ఏర్పాట్లు చేస్తారు. కె.సి.పి సిమెంట్ జాయింట్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీమతి వి.యల్.ఇందిరాదత్‌గారు, నోవా అగ్రిటెక్ ప్రైవేట్‌లిమిటెడ్ ఛైర్మన్-మేనేజింగ్ డైరెక్టర్ ఏలూరి సాంబశివరావుగారి సౌజన్యంతో ఈ ఉత్సవం నిర్విఘ్నంగా నిర్వహిస్తున్నాం.

### స్ఫూర్తిదాతలు

కీ.శే. శాకమూరి శ్రీరామమూర్తిగారు, ప్రముఖ సినీనటులు, కళా హృదయులు కీ.శే.నర్రావెంకటేశ్వర రావుగారు బాలోత్సవ్‌కు స్ఫూర్తిదాతలు. వీరిద్దరి జ్ఞాపకార్థం నాలుగురోజులపాటు బాలోత్సవ్ భోజన సదుపాయాలకు శాకమూరి శ్రీనివాస్‌గారు ఆర్థిక సహాయం అందజేస్తూ ఉంటారు.

బాలోత్సవ్‌లో కాలేజీ విద్యార్థులు సేవా దృక్పథంతో స్వచ్ఛందసేవ చేస్తారు. వీరితోపాటు రాత్రిం బవళ్ళు ఎన్‌సిసి విద్యార్థుల సేవలు మరువలేనివి. వీరంతా కొత్తగూడెం ప్రియదర్శిని కళాశాల, రామచంద్రారెడ్డి డిగ్రీకళాశాల విద్యార్థులు. బాలోత్సవ్ ఇంకా మూడునెలలు ఉందనగానే 200 మంది విద్యార్థులు ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి సన్నాహాలు ప్రారంభిస్తారు. విశ్రాంత ఉపాధ్యాయులు, విశ్రాంత ఉద్యోగులు స్వచ్ఛంద సేవలు అందిస్తారు.

### జాతీయస్థాయికి బాలోత్సవ్

తెలంగాణ రాష్ట్రసాధన అనంతరం బాలోత్సవ్‌ను జాతీయస్థాయికి తీసుకువెళ్ళాం. దేశంలో ఏ పాఠశాలలో చదివిన తెలుగువారైనా ఈ ఉత్సవానికి ఆహ్వానితులే. ప్రవేశరుసుం లేదు. ఢిల్లీ, కర్ణాటక, గుజరాత్, తమిళనాడు, పాండిచ్చేరి, ఛత్తీస్‌ఘడ్, ఆంధ్ర, తెలంగాణ విద్యార్థులు గత యేడాది హాజరయ్యారు. ఈసారి రజతోత్సవానికి రెండువేలుపైచిలుకు విద్యార్థులు పాల్గొంటారు.

ఎగిరే పక్షి అనుభవించే ఆనంద రహస్యం, చీమల శ్రామిక సౌందర్యం, పైరగాలికి తలలూపే గడ్డిపూల సౌందర్య రహస్యం పిల్లలకు తెలియజెప్పడమే బాలోత్సవ్ ముఖ్య ఉద్దేశం. అబ్రహాం లింకన్ తన కొడుక్కి పాఠాలుచెప్పే ఉపాధ్యాయుడికి రాసిన లేఖలో ఇదే కోరాడు. ఆనందంగా జీవించడం, నైతిక విలువలుగల రేపటితరాన్ని తయారుచేసే ప్రయత్నమే ఈ బాలోత్సవ్ ఉద్దేశం.



గత ఏడాది బాలోత్సవ్ వేదికపై అలరించిన కూచిపూడినృత్యం

### కుటుంబం

నా జీవితభాగస్వామి రాజ్యలక్ష్మి. మాకు ఇద్దరు పిల్లలు. అబ్బాయి వాసిరెడ్డి నవీన్. బ్రిటన్‌లో రేడియాలజిస్ట్. కోడలు సౌజన్య. ఆవిడ కూడా రేడియాలజిస్ట్. కుమార్తె శిల్ప. అల్లుడు శ్రీహర్ష ఇద్దరూ అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లే.

**-కె.హరనాథ్, సెల్ 9703542598**

# ఇవన్నీ నిజాలే!

### ఏనుగులకు చచ్చే చావు!

A ఆఫ్రికాలో 2011లో 30 వేల ఏనుగులను అక్రమంగా హత మార్చారు.

•••

A ఆఫ్రికా, సవన్నా భూముల్లో ప్రస్తుతం మూడు లక్షల 52 వేల 271 ఏనుగులు మాత్రమే మిగిలాయని కచ్చితమైన గణాంకాలు తేల్చారు. 90 మంది నిపుణులతో కూడిన 376 మంది బృందం రెండేళ్ళపాటు కష్టపడి ఈ లెక్కలు తేల్చింది. అంతేకాదు, ప్రపంచానికే గర్వకారణమైన ఈ ఆఫ్రికా ఏనుగుల్లో ఇప్పటివరకు మూడు లక్షల 50 వేల ఏనుగుల్ని తుడిచిపెట్టేశారట..

•••

A కళాసౌందర్యశాస్త్రంలో, తత్వవేత్త అయిన హెగల్ అంతగొప్పవాడు బెనడిట్టోక్రోచే. 19వ శతాబ్దాంతంలో యూరప్‌లో పుట్టిన 'కళ కళ కోసమే' అనే నినాదానికి తాత్విక పునాది క్రోచే సిద్ధాంతమే.

•••

A భిన్న దూరాలు, దిక్కులనుండి చూసే వ్యక్తులకు స్థలం ఎలా కనిపిస్తుందో ఐన్‌స్టీన్ తన సాపేక్ష సిద్ధాంతంలో వివరించాడు. ఇదే విషయాన్ని ప్రముఖ చిత్రకారుడు పికాసో తన 'క్యూబిస్టిక్ శైలి' చిత్రాల్లో ఆవిష్కరించాడు.

### భూమికి తప్పిన ప్రమాదం

A విశ్వంలో పరిభ్రమిస్తున్న భూమి ఎప్పటికప్పుడు ఎన్నో ప్రమాదాలు తప్పించుకుంటోంది.

•••

A మొన్నటికి మొన్న అంటే సెప్టెంబరు 7, 17 (2016) తేదీల్లో రెండు ఆస్టరాయిడ్ యాక్సిడెంట్లను భూమి తప్పించుకుంది. పది మీటర్ల పొడుగు, 50 అడుగుల చుట్టుకొలత ఉన్న ఆర్‌బి-1, 61 మీటర్ల పొడుగున్న ఆర్‌బి-2 అనే ఈ రెండూ భూమికి అతి సమీపం నుండి దూసుకెళ్ళాయి. సాధారణంగా ఆస్టరాయిడ్స్ శకలాలు భూమికి సగటున 3.80 లక్షల కి.మీ దూరం నుండి వెళ్ళిపోతాయట. మళ్ళీ యాభై ఏళ్ళ వరకు వీటివల్ల ప్రమాదం రాదట!

•••

A తొలి రోజుల్లో పాలపుంత ఎలా ఏర్పడిందో తెలుసుకునేందుకు ఎంతో వివరంగా ఒక చిత్రాన్ని ఖగోళ శాస్త్రవేత్తలు రూపొందించారు. దీని ఆధారంగా నక్షత్రాల రంగులను బట్టి కోటీ 30 లక్షల నక్షత్రాల ఆవిర్భావ కాలాన్ని గుర్తించారు.

•••

A విశ్వాంతరాళంలోని గ్రహరాశుల్లో మనిషి ఊహించినదానికంటే పుష్కలంగా జీవరాశి విస్తరించి ఉండి ఉంటుందని న్యూయార్క్-కార్నెల్ యూనివర్సిటీ శాస్త్రవేత్తల పరిశోధనలు వెల్లడిస్తున్నాయట!

•••

A ఈజిప్షియన్ల కాలంలోనే తపాలా విధానం ఆరంభమైంది.

-చిన్నారి

## సుధామ పదగారడి-286

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| h | 1 | 2 | | h | 3 | | | 4 |
| 5 | h | | h | 6 | h | h | h | |
| | h | | h | 7 | | 8 | h | |
| 9 | | h | 10 | | h | 11 | | h |
| | 11 h | 12 | | h | 13 | | h | 14 h |
| h | 15 | 15 | h | 16 h | | h | 17 | |
| 18 | h | 19 | | | h | 20 | h | |
| h | h | h | h | | h | | h | |
| 21 | | | | h | 22 | | | h |

### ఆధారాలు

**అడ్డం**

1. తెలివి (3)
3. సైన్స్‌లో తెలివి (4)
7. అని (3)
9. బడలిక (2)
10. పులావులో సన్నం కానిది (2)
11. పిండప్రదానం వేళ ఎదురు చూసేలా చేసే పక్షి (2)
12. పాత సినిమాల ముగింపు కార్డు ఇదే! (2)
13. అటుగా వేశ్య (2)
15. కంచుకము (2)
16. బ్రెడ్డుకు రాసుకు తినేది జామ్ కాదు! (2)
17. గురువు (2)
19. మూడు రంగులు గలది (3)
21. ఇంద్రుడు మధ్యలో అట్నుంచి రాలా! (4)
22. సొగసు (3)

**నిలువు**

2. బ్రహ్మ (3)
4. అచ్చు పని (3)
5. బాల్ థాకరే పెట్టిన పార్టీ (4)
6. జీవిత కాలము (3)
8. పన్ను లేకుండా ఇవ్వబడిన గ్రామం అటుగా సాకాము (3)
10. క్రయవిక్రయాదుల వలన వచ్చిన హెచ్చు (2)
12. చిలుక (3)
13. నేటికి ముందు రోజు (2)
14. ఓదార్పు (4)
16. జ్యోత్స్న (3)
18. ఆడుగుర్రం (3)
20. అడుసు (3)

### పదగారడి-285 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఈ | | పం | డు | గ | | నా | | టి |
| రి | వ | టు | | డ | | తి | ర్య | క్కు |
| క | | లు | | వ | | | వ | |
| | | | గ | | దే | | స | ఖి |
| గం | | జ | ల్లా | | పా | కం | | ల్లా |
| త | మ | న్నా | | | వ | | | |
| | సా | | క | వ | లి | క | | న |
| గ | లా | ఖా | | స్తా | | టి | దు | లు |
| ల్లి | | మ | స | దు | | ళా | | వ |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

# నమ్మకం నిజమైంది!

## -అదితి ఆర్య



**పూరీ ఫ్యాక్టరీ నుంచి వచ్చిన హీరోయిన్ అంటే చాలా చాలా అందంగా ఉంటుందనేది సినీరంగంలో చాలామంది అభిప్రాయం. దాన్ని నిజం చేస్తూ, అందానికి అభినయం తోడైతే ఎలా ఉంటుందో 'ఇజం' హీరోయిన్ అదితి ఆర్య చూపించింది. మిస్ వరల్డ్ నుంచి సినీ రంగానికి వచ్చిన ఆమెతో...**

**తొలిసినిమా ఇంత విజయాన్ని ఇస్తుందనుకున్నారా?**

నిజం చెప్పాలంటే సినిమాచేసే సమయంలో సక్సెస్ గురించి ఎలాంటి ఆలోచన లేదు. ఉన్నదల్లా పూరీ సార్ మీద నమ్మకం మాత్రమే. ఆయన సినిమాలు బాగా తీస్తారు, హీరోహీరోయిన్లకి మంచి సక్సెస్‌ను ఇస్తారని విన్నాను. ఆ మాటలు నమ్మాను. చివరకి ఆ నమ్మకం నిజమైంది.

**ఈ రంగంలోకి వస్తుంటే మీ పేరెంట్స్ ఏమీ అనలేదా?**

అనలేదా... అంటే భయపడ్డారు తప్ప పెద్దగా అభ్యంతరం చెప్పలేదు. ఈ రంగం పూర్తిగా కొత్త కనుక ఎలా ఉంటుందో అని సందేహించారు.

**బాలీవుడ్ సినిమాల్లో ప్రయత్నించలేదా?**

సినిమాల గురించి నేనేమీ సీరియస్‌గా ప్రయత్నించలేదు. తెలుగులో అనుకోకుండా అవకాశం వచ్చింది. భాష రాకపోయినా ఇక్కడి వాళ్ళు నాకు చాలా బాగా నచ్చారు. దక్షిణాది సినిమాలకే నా మొదటి ప్రయార్టీ. హీరోయిన్లకు దక్షిణాది సినీరంగం చాలా కంఫర్ట్ జోన్ అన్నది నా అభిప్రాయం.

**పూరీగారితో చేయడం ఎలా అనిపించింది?**

నాలాంటి కొత్త అమ్మాయికి పూరీ లాంటి డైరెక్టర్ దొరకడం నిజంగా అదృష్టమే! అన్నిటికీ కొత్త కావడంతో ఓపికగా ఒకటికి రెండు సార్లు చెప్పేవారు. తనకు కావలసింది రాబట్టుకునే వారు. నటులకి స్వేచ్ఛ ఇస్తారు. అది నాకు బాగా నచ్చింది.

**మొదటిసారి కెమెరా ముందుకు వచ్చినప్పుడు ఎలా అనిపించింది?**

కొద్దిగా కొత్తగా అనిపించింది. అంతే! కాలేజీ రోజుల్లో స్టేజి డ్రామాల అనుభవం ఉంది. దాంతో కెమెరా ఫియర్ కలగలేదు. ఇక డైరెక్టర్ సార్ ఎలా చెబితే అలా చేశాను. యాక్టింగ్‌కి కొత్త కావడంతో పూరీ సార్ నాకు ట్రైనింగ్ ఇప్పించారు. దాంతో పెద్దగా ఇబ్బంది పడలేదు. బాగా చేశానని చెప్పలేను కానీ, నా వరకూ నాకు సంతృప్తికరంగానే ఉంది.

**సేవా కార్యక్రమాల్లో పాల్గొంటారట కదా?**

దివ్యాంగులకి నాకు చేతనైన సహాయం చేస్తుంటాను. దివ్యాంగుడైన మా అంకుల్ దాదాపు 20 సంవత్సరాల నుంచి మాదగ్గరే ఉంటున్నారు. ఇంతవరకూ ఆయనని విసుక్కున్నది లేదు. ఎంతో ప్రేమగా ఆయనకి సేవలు అందిస్తాం. ఆయనలాగే చాలామంది ఉన్నారు. వారందరికీ చేయలేకపోయినా, కొంతమందికైనా నా సేవలు అందిస్తుంటాను. కాకపోతే రెగ్యులర్‌గా సేవా కార్యక్రమాల్లో పాల్గొనడం కుదరడం లేదు.

**చదువు మధ్యలో ఆపేసినట్టున్నారు?**

లేదు. ఇండియన్ స్కూల్ ఆఫ్ బిజినెస్‌లో చదివే అవకాశం వచ్చింది. వచ్చే సంవత్సరం తిరిగి కాలేజీలో చేరతాను. ఎలాగైనా చదువు పూర్తి చేస్తాను. దాన్ని మాత్రం నిర్లక్ష్యం చేయను.

**తెలుగులో చేస్తున్న సినిమాలు?**

కథలు అయితే వింటున్నాను. ఫైనల్ కాగానే ఆ వివరాలు చెబుతాను.

**ఎలాంటి దర్శకుల దగ్గర చేయాలనుకుంటున్నారు?**

ఫలానా దర్శకుల దగ్గరే చేయాలన్న నియమం ఏదీ పెట్టుకోలేదు. ఏ దర్శకులు అవకాశం ఇచ్చినా తప్పకుండా చేస్తాను. అయినా ఫలానా దర్శకుల దగ్గరే పనిచేస్తానన్న స్థాయి కాదు నాది.

**హీరోల గురించి...**

సేమ్ జవాబు. అందరితో పనిచేస్తాను. అన్ని రకాల సినిమాలు చేస్తాను. ఒకే భాషకి పరిమితం కావాలని కూడా అనుకోవడం లేదు.

-దేవి

